[illegible] థమాల—18

# తమిళపంచకావ్యకథలు

గ్రంథకర్త.

చల్లా రాధాకృష్ణశర్మ,

ఆంధ్రోపన్యాసకులు,

సర్ త్యాగరాయకళాశాల, మదరాసు.



1955

మూల్యము
ఒకటిన్నరరూపాయలు

# మనవి మాటలు

— *. —

తెనుఁగు, తమిళము, కన్నడము, మలయాళము మున్నగునవి ద్రావిడభాషాకుటుంబమునకుఁ జెందినసోదరభాషలు. భాషావిషయకముగా మాత్రమే కాక సాంస్కృతికముగఁ గూడ నీ భాషలను వ్యవహరించువారికి సన్నిహితసంబంధము గలదు. కనుక తమిళుల ప్రాచీనసంస్కృతిపరిశీలన మితరభాషలవారికి-నందును పొరుగున నున్న తెలుఁగువారి కవసరము. అట్టి సంకల్పముతోనే యీగ్రంథము రచింపఁబడినది. విశ్వసాహిత్యమునే యవగతముఁ జేసికొన సంసిద్ధులై యున్నసోదరాంధ్రులు నా యీయుద్యమము నాదరింతు రని విశ్వసించుచున్నాను.

ఈ తమిళపంచకావ్యకధలను వ్రాయుటలో డా. ఉ. వే. స్వామినాథఅయ్యరు, గౌ॥ శ్రీ ఎ యస్. పి. అయ్యరు, శ్రీ ఆర్. పి సేతుపిళ్లై ప్రభృతుల రచనములు సంప్రదింపఁబడినవి. ఆ యా రచయితలకు, విద్వాంసులకు మిక్కిలి కృతజ్ఞుఁడను.

ఏతద్ గ్రంథరచనావసరమున నాకు మిక్కిలిగాఁ దోడ్పడిన మన్మిత్రులు, పండితవిమర్శకులు నగుశ్రీ తిమ్మావఝ్ఝల కోదండరామయ్యగారికి మిక్కిలి కృతజ్ఞుఁడను.

ఈ పుస్తకమును సర్వాంగసుందరముగ నచ్చొత్తించి యిచ్చిన 'వెల్డన్ప్రెస్సు'వారి నభినందించుచున్నాఁడను.

చల్లా రాధాకృష్ణశర్మ.

——

# పీఠిక

మణిమేకలై, సిలప్పదిగారం, జీవకచింతామణి, కుండలకేశి, వళయాపతి యనునవి తమిళపంచకావ్యము లని వ్యవహృతము లగుచున్నవి. వీనిలో మొదటిమూఁడును నాఁడునాఁటికి బహుళప్రచారము నందికొనినవి. కడపటి రెండును నేఁటిదాఁకఁ గూడ నుపలబ్ధములు గాకపోవుటచే నవి కేవలము నామమాత్రములుగానే పేర్కొనఁబడుచున్నవి. ఈ కావ్యపంచకము జైనబౌద్ధుల సమాదరణమున వెలయింపఁబడెనని ప్రాచ్యపాశ్చాత్య పండితలోక మంగీకరించినది. కావున జైనబౌద్ధుల తాత్త్వికరహస్యములు, నాచారవ్యవహారములు, విశ్వాసములు మున్నగువానికి నీ కావ్యములు ప్రతిబింబములని నుడువుట యత్యుక్తి కానేరదు. ఇట్లనుటచే నీ పంచకావ్యములు కేవలము మతసిద్ధాంతగ్రంథము లనుకొనుట పొరపాటు. ఆలనాటి తమిళుల ప్రశాంతజీవనవిధానమును గన్నులకుఁ గట్టునట్లుగ నభివర్ణించుచున్న యీ కావ్యములమూలమున మనకుఁ దమిళుల రాజకీయ, సాంఘిక, నైతిక విషయము లనేకములు కొల్లలుగఁ దెలియవచ్చుచున్నవి.

## రాజకీయపరిస్థితులు

ప్రాచీనకాలమునఁ దమిళదేశమునఁ జేర, చోళ, పాండ్యము లను మూఁడురాజ్యములు వర్ధిల్లెను. వీనిని 'తమిళరాజ్యత్రయ' మని చరిత్రకారులు వ్యవహరింతురు. ఈ రాజ్యములు చేర, చోళ, పాండ్య వంశీయుల యధీనమునం దుండెడివి. సిలప్పదిగారం కథాకాలము నాఁటికిఁ జేరరాజ్యమును సెంగుట్టువన్ భూపతియుఁ, జోళదేశమును కరికాలచోళమహీపతియుఁ, బాండ్యమండలమును నెడుంజెలియన్ మన్నీఁడును బాలించుచుండిరి. వీరెల్లరు మతసహిష్ణుతఁ బ్రదర్శించినవిశాలహృదయులు. తమిళ భాషావాఙ్మయముల నాదరించినభాషాపోషకులు. నృత్తగీతాదు లగులలిత

కళలఁ బోషించినకళారాధకులు. ధర్మసమ్మతముగ రాజ్యాధికారము నెఱపిన న్యాయమూర్తులు.

ఈ తమిళరాజులలోఁ దలమానికము వంటివాఁడు కరికాలచోళ రాజేంద్రుఁడు. ఈతఁడు కావేరీనది కిరుకెలంకుల గట్లు పోయించి వెల్లువల నుండి తన దేశమును సంరక్షించినవాఁ డనియుఁ, బ్రజారంజక పరిపాలకుఁ డనియు వినుతి కెక్కెను. అవంతి, మాళ్వ, మగధాదు లగు నార్యభూమి పతు లీతని మిత్రత నాశించినట్లుగా మనకుఁ దెలియుచున్నది. సెంగుట్టువర్ భూపతి యుత్తరాపథమునందలి యార్యమహీపతులను జయించినట్లు సిలప్పది గారము సాక్ష్య మొసఁగుచున్నది. తమిళరాజులు విశాలహృదయులే యైనను వారిలో వారికి నంతఃకలహము లుండినట్లు సువిదిత మగుచున్నది. అంతే కాదు. ఇరుగుపొరుగుల నున్న రాజులకును వారికిని వైషమ్యము లుండి నటులను దెలియుచున్నది.

ఈ తమిళరాజుల యేలుబడియందు 'పుహార్' నామాంతరము గల కావేరీపట్టణము, మధురానగరము మున్నగునవి సిరిసంపత్తులకు నెలవు లై విలసిల్లుచుండె నని తెలియుచున్నది. ఆయానగరములనుగూర్చి పేర్కొనఁ బడినయంశములు ప్రాచీనతమిళవైభవమును స్ఫురణమునకుఁ దెచ్చునట్టివిగ నున్నవి. కావేరీపట్టణము సుప్రసిద్ధనౌకాశ్రయము; వర్తకకేంద్రమును. దూరదేశములనుండియు నౌక లచ్చటికి వచ్చుచుండె నఁట! తన్నగరమున విభిన్న భాషలు వ్యవహరించువా రెందఱో యుండి రఁట! మరువూర్ పాక్కమనియు, పట్టినప్పాక్కమనియు నా పట్టణము రెండు భాగములుగఁ జేయఁబడెను. మొదటిది యనాగరకప్రదేశము. రెండవది నాగరకప్రదేశము. మరువూర్ పాక్కమునందు శరీరకష్టముఁ జేసికొనుపారిశ్రామికులును, విదేశీయులును నివసించుచుండిరి. నవధాన్యములు, నవరత్నములు, సుగంధద్రవ్యములు మున్నగునవి యచ్చట విక్రయింపఁబడుచుండెను. పట్టినప్పాక్కమునందు రాజవంశీయులును, జాతుర్వర్ణ్యములవారును, భోగస్త్రీలును వేర్వేఱు వీథులందు నివసించుచుండిరి. నగరమునందలి-

యొక్కొక్క 'చదుక్కము'నందు నొక్కొక్క రోజులయు ముండె నఁట. విదువీథులు కలియుచోటునకుఁ జదుక్క మని పేరు. ఈ విషయాదికము నవలోకించినచో కావేరీపట్టణ మానాఁడు మిక్కిలి యుచ్చస్థితియం దుండినటు తెలియక పోదు.

అటులనే మధురానగరవర్ణనము గూడ గమనింపఁదగినదే. ఆ నగరము సువిశాల మయినది. అందలివీథులు సుందరములు, సుదీర్ఘములును. వీథుల కిరుకెలంకుల మహోన్నతము లగుసౌధపంక్తు లుండెను. అందు సుందరోద్యానములును, తోఁపులును బెక్కు లుండెను. నగరరక్షణమునకై యవనభటులు నియమితు లై యుండి రఁట!

## సాంఘికపరిస్థితులు

నాఁటి తమిళసంఘమున వణిక్ప్రవరు లగువైశ్యశిఖామణులకు విశేషగౌరవ ముండెను. సిలప్పదిగారమునందలి యితివృత్తము కణ్ణకీకోవలు లనువైశ్యదంపతుల జీవితగాథయే గదా! కోవలుని కుమార్తె యగుమణిమేఖలాసన్న్యాసమే మణిమేకలైయందలి ప్రధానవిషయము. అలనాఁటి వణిజులు ధనికు లై యుండిరని యిఁక వేఱుగ నుడువ నవసరము లేదు. వారి భవనములు రాజమందిరములను దలపించుచుండె నఁట! వారిలో బాల్యవివాహములే యెక్కువ జరఁగుచుండె నని చెప్పఁదగును. ఏల యనఁ బెండ్లినాఁటికిఁ గోవలుఁడు పదునాఱేండ్లు నిండినయువకుఁడు. కణ్ణకి పదుమూఁడేండ్లకన్నెపడుచు. కొందఱు ముద్దుగుమ్మలు గజములమీఁదఁ దమ బంధుమిత్రాదుల యిండ్ల కేఁగి వారిని వివాహముల కాహ్వానించుచుండిరి. ధనికుల వైవాహికోత్సవములు మహావైభవముగ జరఁగుచుండెను. కోవలుని వివాహము వేదోక్తముగ జరఁగెను. అగ్నిసాక్షికముగ నతఁడు కణ్ణకిని బరిణయ మాడె ననియుఁ, బిదప నా దంపతు లరుంధతీదర్శనముఁ గావించిరనియు సిలప్పదిగారమునఁ బేర్కొనఁబడినది.

బ్రాహ్మణులకుఁ గూడ సంఘమునందు గౌరవ ముండెను. బ్రాహ్మణసత్కారము శుభోదర్కమని యెన్నఁబడుచుండెను. కాని కొందఱు బ్రాహ్మణు లానాఁడే వేదాధ్యయనమును వీడి నృత్తగీతాదులకుఁ గడంగిరి. యతిగ్రామణులయెడ సంఘము విశేషముగ గౌరవాభిమానములు చూపుచుండెను. వేశ్యలు నృత్తగీతాదికళలందు విదుషీమణులై వాసి కెక్కియుండిరి. సిలప్పదిగారమునం దభివర్ణింపఁబడినమాధవి భోగస్త్రీ యైనను నామెచరిత్ర మనన్యసామాన్యముగ నున్నది. తనప్రియుఁ డగుకోవలుఁడు విగతజీవుఁ డయ్యె నని తెలిసికొని యామె తనసర్వస్వమును ద్యజించి సన్న్యసించెను. ఆమె కుమార్తె యగుమణిమేఖల శ్రావికగా యావజ్జీవితము గడపెను. నాఁడు వేశ్యాగమనము సర్వవర్ణములవారికిని బరిపాటిగ నుండెను. కాని పరభార్యాసంగమము మాత్రము దూష్యముగ భావింపఁబడుచుండెడిది.

సాంసారికజీవనము సాఁగించుస్త్రీలు నృత్తగీతాదుల నభ్యసించినట్లు తెలియవచ్చుట లేదు. అతిథిసత్కారము, భర్తృసేవానిరతి మొదలగునవి వారికి విధ్యుక్తధర్మములుగఁ జెప్పఁబడెను. స్త్రీలకు ధర్మోపదేశము చేయఁ గొందఱు మతాచార్యులు వెనుకంజ వేయుచుండిరి. కాని స్త్రీలు కూడ సన్న్యాసమును స్వీకరించుచుండి రనియే నడువవలసి యున్నది. మహిళ లేకాంతముగ నెచ్చటికినిఁ బోరా దనియు, నట్లుపోవునచో నాపదలు సంభవించు ననియు వారి నమ్మకము. పాతివ్రత్యమే స్త్రీలకు ముఖ్యాతిముఖ్యధర్మముగా నుండెను. పతివ్రత యైనపడఁతికి సంఘమునందు గౌరవప్రపత్తులు మెండుగ నుండెను. నోములు నోఁచుట, తీర్థములందుఁ గ్రుంకు లిడుట మున్నగునవి నాఁడును బ్రచారమునం దుండెను. కాని వీనికంటె భర్తృసేవానిరతియే స్త్రీలకు సద్గతిఁ బ్రసాదించు ననునమ్మక మెక్కుడు ప్రచారములో నుండినది.

అప్పటికే యార్య, దేశి యనుభేదములు తమిళదేశమున వేరులు నాఁటుకొని వ్యాపించియుండెను. మాధవి కరికాలచోళమహీపతి యాస్థాన

నాట్యరంగమునఁ బ్రథమముగఁ గాలికి గజ్జెకట్టి నాట్యమాడెను. తదవసరమున నామె తొలుత 'దేశి' నాట్యముఁ గావించి పిమ్మట 'ఆర్య' నృత్యమొనర్చెను. దేశి యనఁగ ద్రావిడనృత్య మనియు, నార్య యనఁగ నౌత్తరాహుల నాట్య మనియు నర్థములు. ఈ సందర్భమున సిలప్పదిగారమునందలి 'అరంగేట్రుగాదై' (రంగాధిరోహణ గాథ) సంభావ్యము. ఇందు నాఁటి రంగాధిరోహణ మహోత్సవము మనోజ్ఞముగ వర్ణిత మై యున్నది. ఈ యుత్సవమునందు సంగీతనాట్యాచార్యులు, కవి, వైణికుఁడు, మార్దంగికుఁడు మున్నగువారు పాల్గొనుచుండిరి. పర్వతప్రాంతముల నున్నవారు 'కురవ[1]' యను దేశినాట్యవిశేషమునందు సిద్ధహస్తు లై యుండిరి.

తమిళప్రజలకు దైవభక్తియు, దేశాభిమానమును, స్వకులాచార నిర్వహణాసక్తియు మెండని తెలియుచున్నది. దేశాభిమాన మనఁగ రాజభక్తి యని నుడువఁదగును. కర్షకులు కూడ సంఘమునందు గౌరవాదరములఁ బడయుచుండిరి. శిల్పులు, చిత్రకారులు మున్నగు కళాకారులుకూడ రాజసంపూజితు లగుచు గౌరవముగఁ గాలము గడపుచుండిరి. నిర్ధనులు మట్టిగోడల యిండ్లలో నివసించుచుండిరి. ఇండ్లకప్పులకు వారు బోదకసవును, తాటియాకులను, కొబ్బరియాకులను నుపయోగించుచుండిరి. గోడల కెఱ్ఱమన్ను పూసెడివారు. నగరము లందలి మధ్యతరగతులవారి గృహములు ఇటికతోఁ గట్టఁబడియుండెను. గృహోద్యభాగములు సున్నముతో వెల్ల వేయఁబడి యుండెడివి. గవాక్షములు జింకకన్నులను దలఁపించుచుండెను. ఉపసంహారమున నాఁటి తమిళులు భోగభాగ్యములతోఁ దులఁదూఁగుచుండి రనియే పేర్కొన నగును.

---

1. గోకులమునందు శ్రీకృష్ణుఁడు సలిపిన 'రాసక్రీడ' వంటిదే యీ కురవనృత్యవిశేష మని శ్రీ ము. రాఘవఅయ్యంగారుగారు విశ్వసించుచున్నారు. చూడుఁడు శ్రీ అయ్యంగారుగారి 'ఇలక్కియచ్చట్టురైగళ్' (సారస్వతవ్యాసములు). యాదవులు కూడఁ బర్వసమయములందు దీనిని సలుపుచుండెడివా రఁట.

# X

# మతపరిస్థితులు

తమిళ కావ్యపంచకమున మణిమేకలై, కుండలకేశి యను గ్రంథములు బౌద్ధమతప్రాశస్త్యము నభివర్ణించుచున్నవి. సిలప్పదిగారం, జీవకచింతామణి యనునవి జైనమతప్రాశస్త్యము నుగ్గడించుకావ్యములు. జైనబౌద్ధములు మహోన్నతదశలో నున్నను శైవవైష్ణవములు కూడ నాకాలమునఁ బ్రచారములో నుండెను. ఇందులకుఁ బ్రధానహేతువు తమిళరాజుల మతసహిష్ణుత యనియే పేర్కొనఁ దగును. శక్త్యారాధన కూడ నాఁడు వ్యాప్తిలో నుండె నని తెలియుచున్నది.

వివిధము లగుమతము లెన్ని యున్నను నాఁడు తమిళప్రజలలో మతకలహము లున్నట్లు కానరావు. కావేరీపట్టణమునందు శివకేశవాలయములు, మురుగన్ కోవెల (కుమారస్వామి), ఇంద్రాలయము, కృష్ణబలరాముల మందిరములు, జైనబౌద్ధవిహారములు మున్నగునవి యుండె నని తెలియుచున్నది. ప్రజలు తమకు నచ్చినమతము నంగీకరించుచుండిరి. కుటుంబములోని వా రెల్లరు నొకే మతము నవలంబింపవలయు నను నియమము లే దని నుడువఁదగును. ఏల యన సెంగుట్టువన్ వైదికమతావలంబకుఁడు; శైవుఁడు. కాని యాతని సహోదరుఁ డగు ఇళంగో అడిగళ్ (ఇళంగో పూజ్యపాదులు) జైనమతావలంబకుఁడు.

ఆ నాళ్లలో [1]నింద్రోత్సవము మహావైభవముగఁ గావేరీపట్టణమునందు జరఁగుచుండెను. ఆ యుత్సవసమయమున నింద్రాదిదేవత లా పట్టణమున కేతెంచెడివా రని యైతిహ్యము. తీర్థములందు స్నాన మాడుటవలనను, నోములు నోఁచుటవలనను శుభములు గలుగు నని నాఁటి సంఘము నమ్మియుండెను. కావేరి సముద్రమునఁ గలియుప్రదేశమున సోమగుండము,

1. నన్నయ్యభట్టు కూడ నింద్రోత్సవప్రశంస సెలవిచ్చియున్నాఁడు. చూడుఁడు. నా 'ఇంద్రోత్సవప్రశంస' యనువ్యాసము. 'సంస్కృతి.'

సూర్యగుండము నను రెండుతీర్థరాజము లుండెడి వఁట! వానియందుఁ గ్రుంకు లిడినఁ బాపపరిహార మగు నని వారు విశ్వసించి యుండిరి. శకునము లందును, జ్యోతిషశాస్త్రమునందును వారికి నమ్మక ముండెను. పునర్జన్మము నందును, కర్మసిద్ధాంతమునందును నాఁటి సంఘమునకు విశ్వాస ముండె నని చెప్ప నవసరము లేదు.

మణిమేకలై కథాకాలమునాఁటికే మృతశరీరులకు దహనసంస్కార మొనర్చునాచారము తమిళులలోఁ బరిపాటి యయ్యె నని తెలియు చున్నది. కొందఱు మృతకళేబరములను దహనముఁ జేయుచుండిరి. మఱి కొందఱు ఖననముఁ జేయుచుండిరి. కొందఱు కళేబరములను గ్రద్దలకు నక్కలకు నాహారముగ బహిరంగప్రదేశముల నుంచెడివారు. కొందఱు పెద్ద పెద్ద మట్టికుండలలో (తాళ్ళి) శవముల నుంచి వానిని భూమిలోఁ బూడ్చుచుండిరి. ఇటుల నీ పంచకావ్యములనుండి తమిళుల ప్రాచీనాచారవ్యవహారములు ప్రవ్యక్తము లగుచున్నవి. తమిళుల ప్రాచీనాచారవ్యవహారములను దెలుపు నీ పంచకావ్యములును గావ్యరాజములు గానే కాక సంఘజీవనదర్పణములుగాను భాసించుచున్న వని చెప్పుటలో దోషము కానరాదు.

ఇఁక శిలప్పదిగారమునం దభివర్ణింపఁబడిన కణ్ణకీదేవినిగూర్చి రెండు మాటలు నుడువవలసి యున్నది. ఈమె సతీదేవి యని ప్రజా సన్నుతిఁ గాంచినది. తమిళదేశమునఁ బలుతావుల నీమె యాలయములు గలవు. సింహళమునందుఁ గూడ గజబాహు వనురాజు సతీదేవ్యాలయ మొకటి నిర్మించి కృతకృత్యుఁ డయ్యెను. కాని యీ కోవెలలు నేఁడు ద్రౌపదీదేవ్యాలయములుగ వ్యవహృతము లగుచున్నవి.

తెనుఁగునాఁటఁ గూడ సతీదేవ్యాలయ మొకటి వెలసె ననియు, దానిని కనకమహాలక్ష్మిగుడి యని వ్యవహరించుచున్నా రనియు శ్రీనిడుదవోలు వేంకటరావుగారి యభిప్రాయము. నేఁటి విశాఖపట్టణము చోళులు కట్టించినది. తమ సంస్కృత్యనుసారముగా వారుకణ్ణకీదేవి (సతీదేవి),

యాలయమును గూడ నా పట్టణమునఁ బ్రతిష్ఠించి రని శ్రీ వేంకటరావు గారు తెలుపుచున్నారు. కణ్ణకీదేవిగుడికిఁ గ్రమముగా కనకమహాలక్ష్మిగుడి యనువ్యవహారము వచ్చినది. కణ్ణకి యనుమాటను స్థానికులు సరిగా నర్థము చేసికొనఁ జాలక 'కనక'గా భ్రమపడి యుందు రని పరిశోధకుల యభిప్రాయము.

అది గ్రామదేవత గుడి యని కొందఱు మొదటఁ బొరబడిరి. కాని గ్రామదేవత గుడులు తఱచుగా గ్రామముల పొలిమేరలలోనే యుండును. కాని గ్రామమధ్యములం దుండవు. కణ్ణకీదేవ్యాలయములు దక్షిణాదిని గ్రామమధ్యములయందే యుండుటను మనము చూచుచున్నాము. విశాఖపట్టణములోని గుడి కూడ గ్రామమధ్యమునందే యున్నది.

విజయవాడలోని కనకగుర్గ కూడ కణ్ణకీదేవి కావచ్చు ననియు, కణ్ణకి కనకలక్ష్మి యయినప్పుడు కనకదుర్గ కూడఁ గావచ్చు ననియు శ్రీ తిరుమల రామచంద్రగా రభిప్రాయిపడుచున్నారు. ఈ విషయమున నింకను స్థలపురాణములను, నితరచారిత్రకాంశములను బరిశీలింపవలసి యున్నది.

ఈ తమిళ కావ్యపంచకమునందు సంస్కృతశబ్దములు, నార్యగాథలు, వారి యాచారవ్యవహారములు మున్నగునవి విశేషముగఁ గానవచ్చుచున్నవి. అయినను నవి ద్రవిడసంస్కృతికి దర్పణములై తమప్రత్యేకతను జాటుచున్న వనియే నుడువఁదగును.

# విషయసూచిక







# మణిమేఖల

వేశ్యాగృహమునఁ బ్రభవమందియు విభవములను వాంఛింపక శ్రావికగా జీవితము గడపిన యొక యొలఁబ్రాయపు ముద్దుగుమ్మ చరిత్రము నభివర్ణించు కావ్యము మణిమేఖల. ఏతత్కావ్యమునకు మణిమేఖలాసన్యాసము ననునర్థము నొసఁగు 'మణిమేకలై తుఱవు' అను నామాంతరముగూడఁ గలదు.

తమిళ కావ్యపంచకమున రచనాకాలమునుబట్టి ప్రథమగ్రంథముగా వ్యవహృత మగుచున్న యీ కావ్యమును శాత్తనార్ అను కవిప్రవరుఁడు వెలయించినాఁడు. కాని సీత్తలైశాత్తనార్ అనునది యాతని విఖ్యాతనామము. శీత్తలై యనఁగఁ జీము గాఱుతల యని యర్థము. భాషయందుఁ గాని, భావమునందుఁ గాని దోష మేదేని గోచరించినచో వెన్వెంటనే శాత్తవారు తాను వ్రాయుచుండిన యినుపగంటముతో శిరస్సుపైఁ బొడుచుకొనెడి వాఁడట! ఈ కఠిననియమమునకు ఫలితముగా నాతని శిరోభాగమున గాయము లేర్పడి చీము కాఱుచుండెను. కనుకనే యాతనికి సీత్తలై శాత్తనా రను నామము గలిగె నని యందురు. సంఘకాలపు సారస్వతోపాసకులలో నొకఁడగునితఁడు మధురానగరధాన్యవర్తకుఁడు. సిలప్పదిగారకృతి కర్తయగుఇళంగో ఆడిగళ్, కపిలుఁడు మున్నగువా రీతని మిత్రులు. శాత్తనార్ క్రీస్తుశకము రెండవశతాబ్దమునందు జీవించినట్లు పండితుల విశ్వాసము. ఈతని కవితలో సారళ్య మెక్కువ. అర్థవంతములు, రసోదంచితములు నగు సమాసరచనలో నీతఁడు వార్త కెక్కినవాఁడు. ఈతని ప్రకృతివర్ణనలు నిరుపమానము లని పండితులు నుడువుదురు.

మణిమేఖలలో నాఁటి బౌద్ధసంఘము మనోజ్ఞముగ నభివర్ణితమై యున్నది. బౌద్ధుల పూజావిధానములు, విశ్వాసములు, నాధ్యాత్మిక రహస్యములు, నాచారవ్యవహారములు మున్నగునవి యిందు వివరింపఁబడినవి. ముప్పదిగాథలుగ విభజింపఁబడిన యీ కావ్యమునందు 4,857 పఙ్క్తులు గలవు.

## ఈ కథయందలి పాత్రలు

—.•:—

ఉదయకుమారుఁడు

అఱవణఅడిగళ్ (అఱవణ పూజ్యపాదులు)

ఆపుత్రుఁడు

రాహులుఁడు

* * *

మణిమేఖల

మాధవి

సుతమతి

చిత్రాపతి

కాయచండిక

వసంతమాల

౧

"చోళమండలము వర్థిల్లునుగాక! కావేరీపూం పట్టణము వర్థిల్లును గాక! మన మహారాజులుంగారి న్యాయపరిపాలనము వర్థిల్లును గాక! నెలకు మూఁడు వానలు చొప్పున చోళమండల మంతయు కురిసి దేశము సస్యశ్యామలమై వెలయును గాక! విజ్ఞులారా! వినుఁడు. మన ప్రభు పుంగవులును, మంత్రివరేణ్యులును ప్రతిసంవత్సరమువలె నీసంవత్సరమును ఇంద్రోత్సవమును జరుపుటకు నిశ్చయించినారు. దేవసహస్రాక్షుఁడు సపరివారముగ మన నగరమునకు విచ్చేయనున్నాఁడు. కాన మీ మీ గృహములను మామిడాకుల తోరణములు, అరఁటి కంబములు, చెఱకుగడలు, పూల తీగలు - మున్నగువానితో సుందరముగ నలంకరింపుఁడు. రత్నహారములను స్తంభములకు కట్టుఁడు. మీ గృహాంగణములే గాక వీథులుకూడ శుభ్రములుగ నుండవలయును. ప్రాఁత యిసుకను తీసివైచి క్రొత్త యిసుకతో బాటలను, వీథులను నింపుఁడు. పూర్ణకుంభములతోడను, ధూపదీపములతోడను ఇంద్రభగవానుని నాహ్వానింపుఁడు. జెండా లెగురవేయుఁడు. దేవమందిరము లన్నియు పరిశుభ్రములుగ నుండవలయును. కల్యాణమండపములందు జరుగు పురాణకాలక్షేపములను వినుఁడు. దేవతలును, మానవులును కలసి మెలసి

విహరింపనున్న యీ సమయమున విరోధులు తమ శత్రుత్వ మును విస్మరించి మిత్రులవలె మెలఁగ వలయును. ఉత్సవ మును వైభవముగ కొండాడుఁడు. శాంతి సౌఖ్యములు వర్ధిల్లును గాక! క్షామము మటుమాయ మగును గాక! జ్వరాది భయములు నశించును గాక!”

ఇట్లు రాజభటుఁ డొకఁడు నగారా మ్రోఁగించుచు నగరవాసులకు రాజాజ్ఞలను దెలియఁజేయుచుండెను.

ఆ నగారా కావేరీ పూంపట్టణమందలి యింద్రాలయము లోనిది. ఇంద్రోత్సవమునకు ముందటినాఁడు దానిని వెలికిఁ దీసి, పట్టపుటేనుఁగుపై నుంచి యా రాజభటుఁడు నగరవీధు లన్నియుఁ దిరుగును. పట్టపుటేనుఁగు ననుసరించి మఱికొన్ని యేనుఁగులు కూడ నుండెను. వానికి వెనుక ఖడ్గహస్తులైన సైనికవీరులును, పౌరులును, బాలురును రాజాజ్ఞలను మఱల మఱలఁ దెలుపుచు నడచుచుండిరి.

ఇంద్రోత్సవము మఱునాఁడు ప్రారంభ మయ్యెను. తదవసరమున మాధవి యనువేశ్య రాజాస్థానము నందలి వేదికపై నాట్య మాడవలయును. ఈ యాచార మామెకు వంశానుగత మైనది. పట్టణగణికాసమూహమున కామె తల మానికము. ఆటపాటలలో మాధవి ధురీణ. సౌందర్యమునఁ గూడ నామె కామెయే సరి. కాని యా సంవత్సర మామె యాపూర్వాచారమునకు స్వస్తి చెప్పినది. ఇందుల కొక గాథ కలదు.

కావేరీపట్టణమున కోవలుఁ డను నొక వర్తక వరేణ్యుఁడు గలఁడు. కణ్ణకి యను కన్యకతో నతనికి వివాహము జరిగెను. వారిరువురును శారికాకీరములవలె నన్యోన్యముగ సంసారయాత్ర సాగించుచుండిరి. ఇట్లుండ నొకనాఁడు కోవలుఁడు మాధవిని జూచుట తటస్థించెను. తదాదిగ నతఁడామెయందు బద్ధానురాగుఁడై తుదకు మాధవి తోడనే జీవింపఁ దొడఁగెను. వారిరువురకు మణిమేఖల యనుకుమార్తె కలిగెను. కొంతకాలమునకుఁ బిమ్మట మాధవిశీలమును సంశయించి కోవలుఁ డామెను విడనాడి కణ్ణకిని జేరెను. అప్పటి కతఁడు నిర్ధనుఁడు, అస్తిపాస్తులడుగంటెను కావున వ్యాపారార్థమై యతఁడు కణ్ణకితోఁ గూడి మధురానగరమునకుఁ బోయెను. అట దురదృష్టవశమున కోవలునిపై నొక నేరము మోపఁబడెను. తత్ఫలితముగ నతఁడు పాండ్యభూపతిచేఁ జంపఁబడెను. భర్తృమరణానంతరము క్రోధావేశపరవశయై కణ్ణకి తన పాతివ్రత్యప్రభావమున మధురానగరమును మంటల పాలు చేసెను. పిమ్మట నామె చేరదేశమునకు రాజధానీ నగరమగు వంజిని జేరి యట భగవదనుగ్రహముచే భర్తను గలసికొని దేవలోకమునకుఁ జనెను.

కోవలుని దుర్మరణవార్త చెవిని బడినదే తడవుగ మాధవికి ప్రాపంచిక భోగములయందు రోఁత కలిగెను. తన సర్వస్వమును నామె నిర్ధనజనాళికి దానధర్మములుగ నిచ్చివేసెను. పిమ్మట బౌద్ధశ్రమణుఁడగు అఱవణవడిగళ్ పాదసన్ని

ధిని జేరి మాధవి తదాశ్రమమునందే కాలము గడపసాగెను. కణ్ణకి పాతివ్రత్యమహిమకు ముగ్ధయై మణిమేఖలయు నీ హైహికభోగములను రోసి అరవణమున్యాశ్రమమును జేరెను. ఆ లావణ్యలతిక యప్పటికిఁ బదుమూఁడేండ్ల కన్నెపడుచు.

ఇటుల విరక్తమనస్కు లగుటచే మాధవియు, మణిమేఖలయు నానాఁటి యింద్రోత్సవమునఁ బాల్గొనరైరి. ఇది నగరవాసుల యసంతృప్తికి హేతు వయ్యెను. కాఁగా వారు మాధవి నుద్దేశించి కటూక్తులు పలికిరి. వానిని విని యామె తల్లి యగు చిత్రాపతి సహింపలేక పోయెను. తోడనే మాధవి ప్రియసఖియైన వసంతమాలను బిలిపించి యామెతో, ''చెలీ! చూచితివా? మన కుటుంబమును నగరవాసు లెట్లు పరిహసించుచున్నారో! మాధవియు, మణిమేఖలయు మన కులధర్మమునకు విరుద్ధముగ మున్యాశ్రమమున నివసించుచున్నారుగదా. మీఁదు మిక్కిలి ముక్కుపచ్చలారని మణిమేఖల జీవితముగూడ మాధవిమూలమున నాశన మైనది. ఇట్లు చేయుట మాధవికి న్యాయమా? ఎట్లైనను సరే వారిరువురను గృహాభిముఖులనుగా జేయవలయును. ఈ భారమును నీవు వహింపవలసిన దే'' అని చిత్రాపతి నుడివెను.

వసంతమాల మున్యాశ్రమమునకుఁ జనెను. తపశ్చర్యల వలన వాడివత్తలై యున్న మాధవీముఖమండలమును గాంచి యామె విషణ్ణహృదయ యయ్యెను. ''ఈ ఆశ్రమజీవనము మన కులోచితధర్మము గాదు. వంశానుగతముగ వచ్చుచున్న ఆచారము నతిక్రమించినందులకు నిన్నును, మణిమేఖలను

నగరము పరిహసించుచున్నది. కనుక మీరిద్దఱును మఱల స్వజనములో కలియుట సమంజసముగ నుండును" అని వసంతమాల మాధవికిఁ జెప్పెను.

ఈ మాటలు వినిన మాధవికి వీనులు సూడిన ట్లయ్యెను. వసంతమాల యజ్ఞానమునకు వగచి యామె యిట్లనెను. "నా భర్త దుర్మరణము చెందిన విషయము నీకును తెలియునుగదా! ఆ కఠోరవార్తను విన్నదే తడవుగ పతితోడిదే లోకమని తలఁచు నెలఁత వెంటనే యీ లోకము నుండి నిష్క్రమించియుండెడిది. భర్తృదుర్మరణమును సహింపఁ జాలకయే గదా మహాపతివ్రతయగు కణ్ణకి మధురను దగ్ధము గావించినది. మన మణిమేఖలకుఁగూడ జీవితముపై రోఁత యేర్పడినది. అఱవణ మునివర్యులీ జీవిత మననేమో మాకు స్పష్టము చేసినారు. దుఃఖభూయిష్ఠమే యీ జీవితము. దీని సౌఖ్యములేమో అశాశ్వతములు. దుఃఖము లేమో అనంతములు. కనుక మమ్ము బాధింపవలదు. అదియునుగాక బుద్ధదేవునిపంచశీలము[1]లన నేవో మునిప్రవరుఁడు మాకు వ్యక్తము చేసినాఁడు. బుద్ధసేవయందే జీవితమును లగ్నము చేసి నిజమైన దేవదాసి యగుటకు నేను యత్నించుచున్నాను. మణిమేఖలకూడ నిట్లే తలఁచుచున్నది. ఈ విషయాదికమును నా తల్లికిని, సఖులకును తెలియఁజేయుము."

---

1. మద్యము సేవింపకుండుట, జీవహింస చేయకుండుట, అసత్యమాడకుండుట, పరభార్య కాశింపకుండుట, చౌర్యము చేయకుండుట - అనునవి పంచశీలములు.

చెల్లాచెదరుగ మహోదధిలోఁ బడియున్న యమూల్య రత్నములను గాంచి నిశ్చేష్టుఁడగు నిరుపేదవలె, వసంత మాల మాధవి మహనీయసంకల్పమును విని శిలావిగ్రహము వలె నిలువఁబడెను. ఇఁక జేయునది లేక యామె గృహాభిముఖయై చని చిత్రాపతితో మాధవి పలికిన పలుకులను వివరము చేసెను.

వసంతమాలకును, తనతల్లికిని జరిగిన సంభాషణమును మణిమేఖల వినుచునే యుండెను. దుఃఖభారముచే నామె హృదయము పలువ్రక్కలయ్యెను. కణ్ణకీ కోవలుల విషాద గాథ యామెను కలఁచివైచెను. సతీదేవి యని వినుతి కెక్కిన యా కణ్ణకి పవిత్రమూర్తిని దన హృదయపీఠమునఁ బ్రతిష్ఠించుకొని యామె కన్నీరుమున్నీరుగా విలపింపసాగెను. అప్పుడామె శాక్యర్షి గళసీమ నలంకరించు నిమిత్తము సుమహారము నొకటి కట్టుచుండెను.

శోకరసాధిదేవతగా నున్న తన ముద్దులపట్టిని మాధవి చూచెను. ఆమె విచారహేతువును సునాయాసముగ గ్రహించి యామెను మాధవి మధురోక్తులతో నూఱడించెను. ఆమె కన్నీటిని దుడిచివైచి మాధవి 'అమ్మా! నీ కన్నీటి కాల్వలచే సుమహారము మలినమై పోయినది. ఇది యిఁక బుద్ధదేవుని కంఠసీమ నలంకరించుటకు యోగ్యమైనది కాదు. ఉద్యానవనమునకు పోయి క్రొత్త పువ్వులు కోసి వానితో మాల కట్టుము. పొమ్ము.'' అనెను. మణిమేఖల దుఃఖోద్వేగమును మాన్పుటకే యామె యారీతిగ నుడివెను.

మాతృనానతిని శిరసావహించి మణిమేఖల పూల తోఁటకు బయలుదేఱెను. అంత నామె ప్రియసఖ యగు సుతమతి "బాగు బాగు! నీవంటి లావణ్యలతిక ఒంటరిగా నుద్యానవనమునకు వెళ్లుట మంచిది గాదు. అనర్థము లేమైనను సంభవించిన సంభవింపవచ్చును. నీవలె నే నొకతూరి యేకాంతముగ పూలతోఁటకు వెడలినప్పుడు నాకు కలిగిన యొక యాపదను వివరించెదను" అనుచు మణిమేఖల కామె స్వవృత్తాంతము నిట్లు చెప్పసాగెను.

"చంపానగరవాసియైన కౌశికుఁ డను బ్రాహ్మణుని కుమార్తెను నేను. నే నొకనాఁడు పుష్పోద్యానమున నొంటరిగ పువ్వులు కోయుచుంటిని. అప్పుడిచట వైభవోపేతముగ ఇంద్రోత్సవము జరుగుచుండెను. తదుత్సవాలోకన కుతూహలుఁడై మారుతవేగుఁ డనుగంధర్వుఁ డొకఁడు గగనవీధిని పోవుచుండెను. దురదృష్టవశమున నతని దృష్టి నాపై పడెను. అతఁడు తోడనే నన్నమాంతముగ తన నగరమున కెత్తుకొనిపోయెను. అతనియొద్ద నేను కొన్ని దినము లుంటిని పిమ్మట అతఁడే నన్నీ నగరమున విడిచివెళ్లెను. కనుక కన్య లేకాంతముగ వెళ్లుట శ్రేయస్కరము గాదు."

అటుపిమ్మట కావేరీ పట్టణమందలి పూలతోఁటలను గుఱించి ప్రస్తావించుచు సుతమతి "ఇలవంతిగై అను పుష్పోద్యాన మొకటి కలదు. అందు రాజులును, వారి వంశీయులును విహరించుచుందురు. ఉయ్యాన మను మఱొకతోఁటలో

దేవతలు విహారము సలుపుచుందురు. రాక్షసు లావనమందలి పువ్వులను కాపాడుచుందురు. తుదకు భృంగములుకూడ వానిని సమీపింపవు. ఇంకను మఱికొన్ని వనములు కలవు. అవి యన్నియు సామాన్యుల మైన మనకు సంబంధించినవి కావు. పలు తెఱంగులయిన సాధుపుంగవులకు విహారభూమి యగు సుందరోద్యాన మొకటి కలదు. దాని పేరు ఉపవనము. అందు పూల మొక్కలు కలవు. ఆ వనమధ్యమున చంద్రకాంత శిలానిర్మితమగు దివ్యమండప మున్నది. అందుండి మాటలాడినచో వారి యాకృతులు మాత్రమే తెలియును గాని వారి మాటలు వినఁబడవు. ఆ మండపమున మణులు చెక్కిన బుద్ధదేవుని పద్మపీఠము కలదు. దానిపై మొగ్గ లుంచినచో, అవి కూడ వికసించును, పూజాప్రసూనములు వాడివత్తలు కాకుండ నటులనే చాలకాల ముండును. కలకలలాడుచు కన్నులపండువు గొలుపు ఆ వనమును కన్నులార గాంచిననే గాని దాని శోభను గ్రహింపఁజాలము. మన మచ్చటికే పోదము'' అనెను.

అంత వారిరువురును సుందరోద్యానమునకు దారి తీసిరి. ఇంద్రోత్సవము మహావైభవముగ జరుగుచుండెను. ప్రజల కోలాహల ధ్వనులతో నగరము మాఱుమ్రోఁగి పోవుచుండెను. వీథుల కిరువైపులనున్న సుందరమందిర కుడ్యభాగములపై గీయఁబడిన చిత్తరువులను జూచుచుఁ గొందఱు తన్మయు లగుచుండిరి. తనివితీఱ మద్యము సేవించిన కొందఱు మైమఱచి పిచ్చిపిచ్చిగ మాటలాడుచుండిరి. ''మిత్రమా!

మద్యమును సేవించినచో సకలదుఃఖములను మఱచిపోవుదువు. త్రాగి చూడుము. పిమ్మట నీకే తెలియఁగలదు'' అని యొకఁడు తన మిత్రుని నుద్దేశించి నుడివెను. వారి మాటలను, వికారచేష్టలను వినుచుఁ, జూచుచు మణిమేఖలా సుతమతులు నిర్వికారులై యుద్యానవనాభిముఖముగా పోవుచుండిరి. కొంత దూర మేఁగుసరికి ప్రజాసమూహ మొకటి వారిద్దఱిని జుట్టుముట్టెను. ఆ గుంపులోనుండి యొకఁడు మణిమేఖలను జూచుచు నిట్లనెను.

''చూచితిరా! యీ బంగారుబొమ్మను. ఈ సౌందర్య తిలకను తపశ్చర్యలకు గుఱిచేసిన ఆ తల్లి యెంత కఠినాత్మయో గదా! ఈ మందయాన పువ్వులు కోయుటకై సుందరోద్యానమున ప్రవేశించెనేని యట నున్న హంసలీమె యొయ్యారపు నడకలను గాంచి సిగ్గుపడునేమో!''

ఈ మాటలు మణిమేఖలకు శ్రవణగోచరము లయ్యెను. అటులనే మెలమెల్లగ నడచుచు వారిరువురును నుపవనమును జేరిరి.

ఆ యుపవనమునందలి తీఁగలు, వివిధములైన పూల మొక్కలు, పూపొదరిండ్లు మున్నగునవి నేత్రపర్వములుగ నుండెను. మహామనీషుల నిష్కల్మషహృదయములవలెఁ గలఁకఁదేఱిన నీటితోఁ గాలువలు స్వచ్ఛందముగఁ బాఱుచుండెను. ఆ వనశోభ కెంతయో వా రబ్బుర పడుచుండఁగ నొక కలకలారావము వారికి వినవచ్చెను.

మహారాజులుంగారి కాలవేగ మనుపట్టపుటేనుఁగు పట్టణముపైఁ బడెనఁట! ప్రజలు భయభ్రాంతులై రాజునకు మొఱపెట్టుకొనఁగ, యువరాజగు ఉదయకుమారుఁడు ప్రభు నానతి శిరసావహించి యా మదగజమును నదుపులోనికిఁ దీసికొనివచ్చెను. ఈ సంఘటన యుపవనమునకు సమీపమున సంభవించెను. పిమ్మట యువరాజు రథారూఢుఁడై యంతః పురమునకు మఱలెను. త్రోవలో 'ఎట్టికుమారుఁ' డను నొక వర్తకశ్రేష్ఠుఁడు నొకచేత వీణ ధరించి, ప్రేయసి గళసీమ నావరించి మఱొక చేతిని వైచి శిలావిగ్రహమును దలపించుచు నిశ్చేష్టుఁడై యుండెను. అతనిని జూచి యేల దీనుఁడవై యున్నా వని యువరాజు ప్రశ్నించెను. వర్తకుఁ డంత యువ రాజును సమీపించి, చేతులు జోడించి వినయముతో "ప్రభూ! మఱేమియును లేదు. లావణ్యతిలక యగు మణిమేఖల సుత మతితోఁగూడి ఉపవనమునకు పుష్పసంచయనార్థమై వెళ్లినది ఆమెను జూచినతోడనే నాకు కోవలుని దుర్మరణ వృత్తాం తము కన్నులకు కట్టినట్లయ్యెను" అనెను.

ఉదయకుమారునికి వణిజుని ప్రత్యుత్తర మెక్కడ లేని సంతోషముఁ గలిగించెను. మధురాతి మధురభావము లెన్నియో యాతని హృత్సీమఁ బరువు లిడెను. ఆతఁడు మణి మేఖలను హస్తగతముఁ జేసికొన నభిలషించెను. 'ఆమె నీ రథముననే కూర్చుండఁ బెట్టుకొని వచ్చెదను, చూడు' మనుచు యువరాజు శరవేగమున నుపవనమునకుఁ బోయెను.

తేరుసవ్వడి వినఁబడినంతనే మణిమేఖల భయ భ్రాంతయై, 'సుతమతి! ఎవరిదో రథ మిచ్చటకు వచ్చు చున్నది. అది ఉదయకుమారునిది కాదుగదా! అతఁడు నాపై మరులుగొని యున్నాఁడని విన్నాను. ఈ యాపదనుండి యెట్లు బయటపడుటయో తెలియరాకున్నది'' అనెను. సుతమతి మణిమేఖలను చంద్రకాంత శిలానిర్మితమైన యా మండపములోనికిఁ బొమ్మని నుడివి యామె కొంత దూర ములో నిలువఁబడి యుదయకుమారుని చర్యలను గమనించు చుండెను.

యువరాజు సుతమతిని జూచెను. ''ఈ యేకాంత ప్రదేశమున నేల నిలువఁబడియున్నావు? నీతో మణిమేఖల కూడ ఇచ్చటికి వచ్చిన దని విన్నాను. ఆమె యెక్కడ? ఆమెకు విచారము తీరెనా? మున్యాశ్రమమును వీడి యీ సుందరోద్యానమునకు మణిమేఖల వచ్చుట నాకు మిక్కిలి సంతోషముగ నున్నది. ఆమె యెక్కడ నున్నదో చెప్పుము'' అని యాతఁడు ప్రశ్నలవర్షము కురిపించెను. సుతమతి తొలుత యువరాజుతో మాటాడుటకు భీతిలెను. ఎట్లో ధైర్యముఁ దెచ్చికొని యామె గంభీరముగ సమాధాన మొసఁగెను.

''ఉదయకుమారా! తరుణవయస్కుఁ డయ్యు వృద్ధ వేషము ధరించి వాది ప్రతివాదుల సంశయములను పోకార్చి న్యాయవిచారణ సలిపిన కరికాల చోళమహీపతి వంశీయుఁ డవు నీవు. అట్టి నీకు నావంటి అబల రాజధర్మమునుగూర్చి

నుడువ నవసరము లేదు. కాని చెప్పుచున్నాను. పురాకృత కర్మలకు ఫలితమే యీ శరీరము. ఇది దుఃఖభూయిష్ఠము. రాగ ద్వేషముల కిది పీఠము. కష్టముల కిది యాటపట్టు. ఆశయే మానవుని కష్టములకు మూలకందము. కనుక, యువరాజా! మణిమేఖలపై ఆశను వీడుము.''

ఈ మాట లేవియు నతని తల కెక్కలేదు. చంద్రకాంత శిలానిర్మితమయిన మందిరముపై నతనిచూపు పడెను. తుద కతఁడు మణిమేఖల దివ్యాకృతిని గాంచెను. కాని యా మండపమున నెట్లు ప్రవేశింపవలయునో తెలియక యాతఁడు ''దీని ద్వార మెచ్చట నున్నది. చెప్పుము'' అని సుతమతిని ప్రశ్నించెను. ''నేను చెప్పను. మణిమేఖల సచ్చీల. కాము ముచే నీ వామెను వశము చేసికొనఁజాలవు. ఆమె కోపగించె నేని నిన్ను శపింపను శపింపనచ్చును'' అని సుతమతి నుడువు చుండఁగ ఉదయకుమారుఁడు ''సుతమతీ! ఆ మాటలు కట్టి పెట్టుము. నే నామెను వశము చేసికొనక మానను. భోగస్త్రీ యైన మణిమేఖలకు తపస్సు చేయుట కధికార మెక్కడిది?'' అని పలికెను.

''నీ వామెను వశము చేసికొనజాలవు. ఈ వ్యర్థప్రయత్నమును మానుము.''

''ప్రేమయే త్రోవ వెదకికొనును. దీని కేమిగాని— విద్యాధరుఁ డొకఁడు నిన్ను జైనసంఘారామములో చేర్చె నని యెల్లరు నుడువుదురు. మఱి యిపుడు బౌద్ధసంఘమున

ఎట్లు ప్రవేశించితివి?'' అని యువరాజు ప్రశ్నింపఁగ సుతమతి యిట్లనెను.

''యువరాజా! నేను బాల్యమునందే మాతృవిహీన నైతిని. నాఁటినుండియు నా తండ్రియైనకౌశికుఁడే నన్ను సాకుచుండెను. విద్యాధరుఁడు నన్ను తస్కరించిన విషయము తెలియక నా తండ్రి గ్రామగ్రామము తిరిగి తిరిగి యీ పట్టణ మండలి జైనసంఘారామమున నున్న నన్ను చూచెను. నే నాయనకు ఏకైక పుత్రికను. పైపెచ్చు బాల్యమునుండియు పెంచిన మమకారముచే నన్ను విడిచి వెళ్లుటకు కాళ్లాడక యాతఁడీనగరమందే బిచ్చమెత్తుకొనుచు నివసింపఁ దొడఁ గెను. ప్రతిదినమును మే మిరువురము కలసికొనుచుంటిమి. ఇట్లుండ నొకనాఁడు భిక్షార్థమై యేఁగుచుండఁగ లేఁదూడతో నున్న ఒక ఆవు నా తండ్రిని చాలదూరము తఱిమి తఱిమి తుద కాయన కడుపును జీల్చివేసెను. అటులనే ఆయన తన కడుపును చేతితో అదిమి పట్టుకొని నేనున్న జైనసంఘమును సమీపించి వైద్యసహాయమును కోరెను. కాని యట నున్న శ్రమణులెల్లరు రక్తసిక్తమై భయము గొల్పుచున్న యీ నా తండ్రి శరీరమునుజూచి వెగటుగొని చికిత్స సేయుట కంగీకరింపక నేను మా తండ్రితోఁగూడి నివసించుటకు మాత్రము సమ్మతించిరి.

పిమ్మట మాకు సహాయము చేయఁగలవా రెవ్వరైన నున్నారా యనుచు మే మిరువురము విలపించుచుండఁగ

సంఘధర్ముఁ డనుదయామయుఁ డొకఁడు మమ్ము సమీపించెను. అతఁడు బౌద్ధభిక్షువు. బుద్ధదేవుని ధర్మోపదేశములను వివరించి యాదయామూర్తి మమ్ము బౌద్ధ సంఘారామమున చేర్చెను. అనంతరము నాతండ్రి కాలధర్మము చెందెను. నాఁటినుండియు నేను బౌద్ధసంఘమునందే నివసించుచున్నాను. రాజా! మిమ్ము నేను కోరున దొక్కటే. మణిమేఖల నిక నాసింపకుఁడు.''

సుతమతిమాట లతనికి రుచింపలేదు. ''కానిమ్ము. మా ఆస్థాన నర్తకియైన చిత్రాపతి సహాయమున నా హృదయేశ్వరిని పొందెదనుగాక!'' అనుచు ఉదయకుమారుఁడు రథము నెక్కి రాచనగరునకు వెడలిపోయెను.

అప్పుడు మణిమేఖల తలుపు తెఱచి వెలుపలికి వచ్చెను. ఆమె చూపు లారథముపై కేంద్రీకృతములై యుండెను. ''అతనిని చూచుట కిదే తొలిసారి. ఏలనో నా హృదయమతని వెన్నంటి యరుగుచున్నది. వారకాంత యనియు, తపస్సు చేయుట కనర్హురా లనియు నతఁడు నన్ను గుఱించి మాటాడెను. అయినను నా కతనిపై కోపము కలుగలేదు. కామ మనఁగ నిదియే కాఁబోలు. ఇది నా హృదయము నుండి మాయ మగుగాక!'' అని మణిమేఖల నుడివెను.

తత్సమయమున మణిమేఖల యనుదేవత యింద్రోత్సవమునఁ జాల్గొని యుపవనమునందున్న బుద్ధదేవుని సేవించుటకై యొక భిక్షుకివేషము ధరించి యచటికి వచ్చెను.

సర్వభూతసమదర్శి యగు నా శాక్యర్షి ని సేవించి యట దీన వదనయై నిలువఁబడియున్న సుతమతిని జూచి యామె 'నీకు సంభవించిన కష్ట మేమి ?' యని ప్రశ్నించెను. ఉదయకుమారుఁడు మణిమేఖలయందు బద్ధానురాగుఁడై యున్న విషయమును, అతని నిశ్చితాభిప్రాయమును సుతమతి యా దైవమునకు తెలియఁజేసెను.

ఇంతలో భానుఁడు పశ్చిమాద్రిని జేరెను. ఉపవనము శోభను గోల్పోయి భర్తృవిహీనయైన పడఁతివలెఁ గన్పట్టెను. కొంత సేపటికి చంద్రోదయ మయ్యెను. దివినుండి భువికి సంతత ధారగ పాలొలుకుచున్నదో యనునట్లు తెల్లని వెన్నెల వెలుఁగులతో నా వనము నిండిపోయెను.

మణిమేఖలాదైవము సుతమతి నుద్దేశించి, 'ఉదయకుమారుడు మణిమేఖలపై వలపు గొనియున్నాఁడు. ఈ వనములో సాధుపుంగవు లుండుటచే నతఁడు బలాత్కారమునకు పాల్పడలేదు. లేదేని యందులకుఁ గూడ నతఁడు సాహసించి యుండెడివాఁడే. మీ రీవనమును వీడి నగరమును ప్రవేశించితిరేని అంత పనియు జరుగును. కావున మీరిరువురును ఈ రాత్రి చక్రవాళాలయమున గడపినచో కష్టము లేమియు కలుగవు' అని నుడివెను.

అందులకు సుతమతి సమ్మతించెను. 'శ్మశానాలయ మని యెల్లరు నా గుడిని పేర్కొనుచుండఁగ, మీరు మాత్రము దానిని చక్రవాళగుడి యనుచున్నారు, కారణము తెలిసికొన

వచ్చునా ?' అని ప్రశ్నింపఁగ మణిమేఖలాదైవ మా గుడికి సంబంధించిన యైతిహ్యము నొకటి చెప్పెను.

"ఈ వనమునకు ప్రక్కగా ఈ నగర శ్మశానభూమి కలదు. నగర మెప్పు డేర్పడెనో రుద్రభూమియు నప్పుడే యేర్పడెను. దానికి నాలుగుప్రక్కలందును గోడలు కలవు; నాలుగు ముఖద్వారములును గలవు. అందొక కాళీ దేవ్యాలయ మున్నది. శ్మశాన దేవతల కుద్దేశింపఁబడిన స్తంభములు కొన్ని యట నున్నవి. ఆ దేవతలకు పూజా పురస్కారములు యథావిధిగ జరుగుచున్నవి. మృతులైనవారి జీవితవిశేషములను తెలుపు శిలా స్తంభములుకూడ నున్నవి. కాటికాపరులు నివసించుటకుగాను ప్రత్యేకముగ నిర్మింపఁబడిన కొన్ని గృహములు కలవు. మరణించిన వారినిగూర్చి విలపించువారికి శిలావేదికలు కొన్ని యట నిర్మింపఁబడినవి. ఎండవానలనుండి రక్షణ పొందుటకై కొన్ని గదులుకూడ కట్టఁబడినవి. మృత శరీరుల సంస్కారార్థము రుద్రభూమి యంతయు నైదు భాగములుగ విభజింపఁబడినది. ఒకభాగమున మృతకళేబరములకు దహన సంస్కారములు జరుగుచుండును, మఱొకవైపు గ్రద్దలు, తదితరములైన జంతువులు భక్షించుటకుగాను శవము లుంచబడును. ఒకభాగమున కళేబరములు భూమిలో సమాధి కావింపఁబడును. మఱికొన్ని చోటుల భూమిలో గదులు నిర్మించి వానిలో ఖననము చేయుదురు. కొన్ని శవములను పెద్దపెద్ద మట్టికుండలలో వైచి భూమిలో భద్రపఱచెదరు. నడిరేయికూడ వచ్చిపోవు జనముతో శ్మశానము కిటకిటలాడు

చుండును. రోదనధ్వనులు, డప్పులచప్పుడు, నక్కకూఁతలు, గ్రద్దలకూఁతలు, గ్రుడ్లగూబలరొదలు — మున్నగువానితో నా ప్రదేశము వఱ్ఱుమ్రోఁగుచుండును. ఆ రుద్రభూమిలో పలువిధములైన వృక్షము లున్నవి. మృతకళేబరముల మాంసమును భుజించు అఘోర శివమతస్థులును, కపాల మాలలను ధరించు కాపాలికులును పెక్కు రున్నారు. నిప్పు తోడి కుండలు, త్రెంపబడిన పూలదండలు, పగిలిపోయిన కుండపెంకులు, బల్యన్నములు, బొరుగులు—మొదలగునవి శ్మశానమున చెల్లాచెదరుఁగ పడియుండును.

ఈ మహాభయంకరమైన రుద్రభూమికూడ నగర మండలి యొక భాగ మని తలఁచి యొక బ్రాహ్మణ బాలుఁ డిచ్చటికి వచ్చెను. అప్పు డొక దయ్యము తాండవము సలుపు చుండెను. అది చూచి భయవిహ్వలుఁడై ఆ బాలుఁడు గృహమునకు మఱలెను. తోడనే యతఁడు జ్వరపీడితుఁ డయ్యెను. కొన్ని దినముల కతఁడు మరణించెను. అప్పు డతని తల్లి యగుగౌతమి 'వృద్ధులము, అంధులము నైన మా దంపతుల కాధారభూతుఁడైన యీ బాలుని పొట్ట బెట్టుకొనిన ఆ మృత్యుదేవత యెవ్వ' రనుచు గోడుగోడున విలపించుచు నగరాధిదేవత యైనచంపాపతిని ప్రశ్నించెను. అందుల కా దేవత 'నీ కుమారుని మరణమునకు బాధ్యు లెవరును కారు. అతని పురాకృత కర్మమే అతని మరణమునకు కారణము' అని యామెకు నుడివెను. ఈసమాధానము గౌతమికి తృప్తి

గలిగింపలేదు. కావున చంపాపతి సకలదేవతలను రప్పించి బ్రాహ్మణికి సంభవించిన కష్టమును తెలియఁజేసెను. పురాకృత కర్మలే మానవుని శుభాశుభములకు హేతువులని వా రెల్లరు ముక్తకంఠముతో నుడివిరి. అంత గౌతమి దుర్భర దుఃఖముతోఁ దన కన్నకడుపునకు దహనసంస్కారము గావించి జ్ఞానసంపన్నయై గృహాభిముఖురా లయ్యెను.

చంపాపతి యసాధారణ ప్రజ్ఞావిశేషమును వ్యక్త మొనర్చుటకై మయుఁ డను దేవశిల్పి యా శ్మశానవాటిక యందు మేరుపర్వతమును, దాని నావరించియుండు సప్త పర్వతములను, నాలుగు ద్వీపములను, రెండువేల చిల్లర దీవులను, అందందు నివసించు మానవుల యాకృతులను తలపించు నిర్మాణములను గావించెను. కావున దీనికి చక్ర వాళాలయ మని పేరు వచ్చెను. కాని యిది రుద్రభూమి యగుటచే శ్మశానాలయ మనియు వ్యవహరింతురు.''

మణిమేఖలాదైవము నుడివిన పయి వివయాదికమును సావధానచిత్తయై వినిన మణిమేఖల 'భూలోకమండలి మానవ జీవిత మిట్టిది కాఁబోలు!' అని నిట్టూర్పు విడిచెను. అంత లోనే సుతమతికి నిద్రచేఁ గన్నులు కూరుకొని పోయెను. పిమ్మట మణిమేఖలాదైవము మణిమేఖలను నిద్రబోనిచ్చి యామెను మణిపల్లవ మనుదీవికిఁ గొంపోయెను.

అనంతర మాదైవము ఉదయకుమారుని శయన మందిరమును ప్రవేశించెను. తెల్లవాఱినచో మణిమేఖల

నెట్లు వశము చేసికొందునా యని చింతించుచు నతఁడు నిద్రా విహీనుఁడై యుండెను. అతనికి మణిమేఖలాదైవము స్వప్నమునఁ గనఁబడి, 'యువరాజా! ఈ రాజ్యమునకు రాజుగా నుండవలసిననీవు ధర్మచ్యుతుఁడ వైనచో వానలు కురియవు; దేశము సుభిక్షముగ నుండదు. నీ యాత్మగౌరవమును నీవు సంరక్షించుకొనునట్లుగా ప్రజలగౌరవమును గూడ నీవు కాపాడవలయును. లేదేని రాజ్యభ్రష్టుఁడ వగుదువు. కామాతురుఁడవై యొక స్త్రీని — అందులోను వేశ్యాకులమున జన్మించిన స్త్రీని — బలాత్కారము చేయఁబూనుటకంటె ధర్మవిరుద్ధమైన కార్యము మఱొకటి లేదు. కనుక బుద్ధదేవుని కుమార్తెయు, బౌద్ధమతావలంబినియు నగు మణిమేఖలపై ఆశను వీడుము.'' అని ప్రబోధించెను.

అటులనే యామె సుతమతికిని కలలో సాక్షాత్కరించి యిట్లు నుడివెను. ''మణిమేఖల తన పూర్వజన్మమునకు సంబంధించిన విషయములను తెలిసికొనుటకై ఆమెను నేను మణిపల్లవమునకు గొంపోయితిని. నేఁటికి ఏడవదినమున మణిమేఖల కావేరీపట్టణమున కరుదెంచును. ఈ విషయమును మాధవికి చెప్పుము.''

భయభ్రాంత యగుచు సుతమతి లేచి చూడఁగా మణిమేఖల కనఁబడలేదు. భానూదయము కాఁగానే యామె మాధవిని సమీపించి జరిగినవిషయమును తెలియఁజేసెను. శిరోభూషణమును గోల్పోయిన నాగమువలె మాధవి తనయను జూడనందులకు మిక్కిలి దుఃఖించెను.

మణిపల్లవమునకుఁ గొనిపోవఁబడిన మణిమేఖల విషయము నిఁక గమనింపుము. నిద్రనుండి మేల్కొని పరిసరములను జూచినంతనే యంతయు నామెకు నూతనముగఁ గన్పట్టెను. ప్రౌఢదెక్కుచున్న కొలఁది నామెకు ధైర్యము గలుగుచుండెను. తా నెప్పుడును ఉపవనమును జూడలేదు. కావున నిది యందలి యొక భాగమై యుండనోపు నని యామె తలఁచెను. "సుతమతి! ఎచ్చట నున్నావు? నాకు భయ మధికమగుచున్నది. ఎక్కడనైన చాటున నున్నావా? రమ్ము. నన్ను చూడకున్నచో నా తల్లి తల్లడిల్లి పోవును. నన్నిచట నొంటరిగా విడిచి నీవుమాత్రము వెళ్లితివా యేమి? లేక నిన్న మనతో మాటలాడిన భిక్షుకిచేఁతలా యివి? ఆమె మాయలాడిగా కనఁబడుచున్నది. రమ్ము రమ్ము." అనుచు మణిమేఖల యటునిటు పరువు లెత్తెను. ఆమె కెవ్వరును కానరాలేదు. ఇంతలో తండ్రి దుర్మరణవృత్తాంత మామెస్మృతిపథమునకు వచ్చెను. "అయ్యో! తండ్రి! పరరాజ్యములో నిష్కారణముగ నీవు చంపఁబడితివి. నేనీ నూత్నప్రదేశములో మరణింపనున్నాను." అనుచు నామె విలపింపఁదొడఁగెను.

ఆమె చాలదూర మేఁగెను. తుద కొకచోట నామెకు శాక్యర్షి యగుబుద్ధదేవుని పవిత్రపీఠము కన్పించెను. అది యింద్రునిచేఁ బ్రతిష్ఠింపఁబడినది. ఆ పీఠమును పూజించిన వారికిఁ బూర్వజన్మమునకు సంబంధించిన విషయములు సుస్పష్టము లగును. అట్టి యద్భుతశక్తి దానికిఁ గలదు. నాగ

జాతివా రగురాజు లిరువురు పరస్పరము కలహించుకొనినపుడు బుద్ధదేవుఁడే స్వయముగ నేతెంచి వారికి హితోపదేశము గావించి విధ్వంసాత్మక మగుయుద్ధమును మానిపించెను. అప్పు డీ యపూర్వవిషయము బయలుపడెను.

ఈ యద్భుతపీఠమును జూచినతోడనే మణిమేఖల దుఃఖమును విస్మరించెను. మిూఁదుమిక్కిలి యాశ్చర్యచకిత యయ్యెను. ఆనందబాష్పము లామె కన్నులనుండి జలజల రాలెను. ఆమె తన కరకమలములను జోడించెను. ఆ పీఠము నకు ముమ్మారు ప్రదక్షిణము చేసి సాష్టాంగముగ ప్రణమిల్లెను. పూర్వజన్మమున జరిగినవిషయము లన్నియు నామెకుఁ దెలియ వచ్చెను.

''గాంధార దేశమునకు తూర్పుదిక్కున వృషభద్వయ (ఇడవయమ్) మను నగరము గలదు. దానిని రాజధానిగఁ జేసికొని హస్తిపతి పరిపాలించుచుండెను. ఓ బ్రహ్మధరుఁడ! అతనికి నీవు బావమఱఁదివిగదా! ఒకనాఁడు నీవు రాజునకు ధర్మోపదేశము గావించుచు నాఁటికి ఏడవదినమున జంబూ ద్వీపమున భూకంప మేర్పడు ననియు, అప్పు డీ నగరమును నాగదేశములో నాలుగువందల యోజనముల ప్రదేశమును సముద్రమున మునిఁగిపోవు ననియు నీవు నుడివితివి. ఈ విషాద విషయమును ప్రజలకు దండోరా వేయించి రాజు తెలియఁ జేసెను. పిమ్మట ప్రజాసమూహముతోఁ గూడి హస్తిపతి అవంతీదేశమునకు రాజధానీ నగరమైన ఉజ్జయినికి ప్రయా

ణమై పోయి, పోయి కాయంగరై నదీతీరమున విడిసెను. అప్పుడు నీవు చెప్పినట్లుగ భూకంప మేర్పడెను. తత్ఫలితముగ ఇడవయము నశించెను. ఆ దుర్భరదృశ్యమును తిలకించిన హాస్తిపతియు, ప్రజలును వేనోళ్ల పొగడుచు నిన్ను చుట్టుముట్టిరి. నీ వప్పుడు ఉజ్జయినిలో ధర్మోపన్యాసము చేయుచుంటివి.

తత్సమయమున నేనును నా భర్త రాహులుఁడును నిన్ను సందర్శించితిమి. యశోధరానగరాధిపతి యైనరవివర్మకును, ఆతని పట్టమహిషి అముదపతికిని నేను జన్మించితిని. అప్పటి నా పేరు లక్ష్మి. నన్ను చూచినదే తడవుగ నిశ్చలచిత్తుఁడవై నీవు నీభర్త నేఁటికి పదునాఱవదినమున మృత్యుదేవతను తలపించు దృష్టివిష మనునాగుబాముచే కఱవఁబడి మరణించు నని చెప్పితివి. అతనితో సహగమన మాచరించిన పిమ్మట నేను కావేరిపట్టణమున జన్మింతు ననియు, అచ్చట విషాదసంఘటనము సంభవించు ననియు, మణిమేఖలాదైవము కష్టసమయములో నాదుకొను ననియుఁగూడ నుడివితివి. ఆ దైవమే పూర్వజన్మమునకు సంబంధించినవిషయముల నన్నిటిని తెలుపు ననియు చెప్పితివి. ఇంకను మణిమేఖలాదైవము రాలేదు. కారణము తెలియుట లేదు'' అనుచు మణిమేఖల విలపింపసాగెను.

ఇట్లు మణిమేఖల విలపించుచున్న సమయమున మణిమేఖలాదైవము దివినుండి భువి కేతెంచెను. ఆమె బుద్ధపీఠమునకు ముమ్మారు ప్రదక్షిణము చేసెను. ఆమెను జూచి, ''నీ దయ

వలన నేను పూర్వజన్మము నెఱిఁగితిని. అపుడు నాకు భర్తగా నుండిన రాహులుఁ డీ జన్మమున నెచ్చట జన్మించినాఁడు. అతనిని నాగసర్ప మెందులకు కాటు వేయవలసివచ్చెను.'' అని మణిమేఖల కారణ మడుగఁగా నా దైవ మిట్లు నుడివెను.

''అమ్మీ! నీవును నీ భర్తయు (రాహులుఁడు) ఒక నాఁడు వనమునందు సంచరించుచుండఁగ మీలో మీ కొక కలహ మేర్పడెను. నీ కోపమును శాంతింపఁజేయుటకై నీ భర్త నీ పాదసన్నిధిని వ్రాలియుండెను. తత్సమయమున రత్నదీపమునందు ధర్మచక్రమును ప్రవర్తింపఁజేసిన బౌద్ధభిక్షు వొకఁడు గగనవీథిని పోవుచు మీ రున్న చోటికి వచ్చెను. అది మధ్యాహ్నసమయము. అతనిని చూచినతోడనే నీవు భయ భ్రాంతవై లేచి ఒక మూలగ నిలువబడితివి. అది చూచి నీ భర్త కన్ను లెఱ్ఱజేసి 'యీవచ్చినవాఁ డెవఁ'డని ప్రశ్నించెను. ఆ ప్రశ్న నీకు కోపజనక మయ్యెను. వచ్చిన భిక్షువును గౌర వించుట మాని యి ట్లడుగవచ్చునె? అని భర్తను మందలించి నీ వా భిక్షువుపాదపద్మములకు ప్రణమిల్లితివి. పై పెచ్చు సహర్షముగ నా సాధువున కాతిథ్య మొసఁగితివి. ఆనాఁటి రాహులుఁడే నిన్ను సుందరోద్యానమున వెంబడించిన యువ రాజు ఉదయకుమారుఁడు. కావుననే యతఁడు నీపై మరులు గొని యున్నాఁడు. అతనిపై నీకును అవ్యాజముగ ప్రేమ యేర్పడినది. ఈ విషయమును గ్రహించియే నేను ని న్నిచటకు తీసికొని వచ్చితిని. మఱియొక విషయమునుగూడ నుడివెదను. వినుము.

పూర్వజన్మమున నీకు తార, వీర అను తోఁబుట్టువు లుండిరి. వారు దుర్జయుఁ డనురాజును వివాహ మాడిరి. ఒక నాఁడు రాణులు వెంట రాఁగా దుర్జయుఁడు గంగానది కావల నున్న పర్వతప్రాంతమునకు వెడలి, రాచనగరునకు తిరిగి వచ్చుచుండఁగా త్రోవలో బౌద్ధభిక్షు వగుఅరవణముని వారికి కనఁబడెను. దుర్జయుఁ డా మునికి నమస్కరించి విశేషము లడిగెను. గృధ్రకూట పర్వతప్రాంతమున బుద్ధుఁడు ధర్మోప దేశము గావించుచున్నాఁ డని యాతఁడు నుడివెను. అమ్ముని యాదేశమును తలఁదాల్చి దుర్జయుఁడు భార్యాసమేతుఁడై గృధ్రకూటమునకు వెడలి బుద్ధుని సేవించెను. తత్ఫలితముగ ఈ జన్మమున వీర సుతమతిగాను, తార మాధవిగాను జన్మ మందిరి.

మణిమేఖల! ఇప్పటికి నీ కన్ని విషయములును తెలిసియే యుండును. పూర్వపుణ్యవశమున నీకు బుద్ధదేవునియందు ప్రగాఢవిశ్వాసము కుదిరినది. జన్మనిన్మైన నీకు బౌద్ధభిక్షు వులు తప్ప మఱి గే యితర మతావలంబకులును ధర్మోప దేశము చేసియుండరు. అయినను వివిధమతముల సమగ్ర స్వరూపమును నీవు తెలిసికొనవలయును. అప్పుడు గాని బౌద్ధ ధర్మముల వైశిష్ట్యము నీకుచక్కగా తెలియదు. కావుననూఁడు మంత్రములను నీ కుపదేశించెదను. ఇవి నీ కుపయోగపడును. వివిధమతధర్మములను తెలిసికొనవలయు నన్నచో పలుస్థల ములకు వెళ్లవలసియుండును. మొదటి మంత్రము నుచ్చరించి నచో నీ వెచ్చోటికి పోదలచిన అచ్చోటికి పోఁగలవు. నీవు

యువతివి కావున నీకు ధర్మోపదేశము చేయుటకు మత పెద్ద లంగీకరింపరు. రెండవమంత్రము నుచ్చరించితివేని నీ యిచ్చ వచ్చిన రూపమును ధరింపవచ్చును. ఇఁక మూఁడవ మంత్రము. ఆఁకలిదప్పులు విద్యాభ్యాసమునకును, విజ్ఞాన సముపార్జనమునకును విఘ్నములుగ నుండును. కనుక వానిని తీర్చుట కీ మంత్రము తోడ్పడును."

ఇట్లు నుడివి మణిమేఖలాదైవ మదృశ్య మయ్యెను. పిమ్మట మణిమేఖల మణిపల్లవమున నున్న యిసుక తిన్నెలు, పూలతోఁటలు, సరోవరములు—మున్నగువానిని జూచుచు నా ద్వీపము నలుమూలల తిరిగెను. ఒకచోట ద్వీపతిలక యను దేవత యామెకుఁ గనఁబడెను. ఆమె యా ద్వీపమును సంరక్షించు దేవత. పూర్వజన్మము నెఱిఁగిన మణిమేఖల సాధారణ మహిళగా నుండ దని గ్రహించి యా దేవత, "ఈ ద్వీపమునం దున్న బుద్ధపీఠము నర్చించువారు పుణ్య పురుషులుగ నుందురు. కాన నీవు సామాన్యయువతివి కావు. ఆ బుద్ధపీఠమున కభిముఖముగ నొక తామరకొలను గలదు. అందుండి ప్రతిసంవత్సరమును బుద్ధుని జన్మదివస మగు వైశాఖపౌర్ణమినాఁడు అమృతసురభి యను నొక యక్షయ పాత్రము వెలుపలికి వచ్చుచుండును. అది ఆపుత్రునిది. ఆ పాత్రము నేఁడు పైకి వచ్చును. అది నీకు లభింపఁగలదు. దీనిని గుఱించి అరవణముని యింకను కొన్ని విషయములు నీకు చెప్పఁగలఁడు" అని నుడివెను.

ఈ మాటలు వినినంతనే మణిమేఖల బుద్ధుని పాదపద్మములకు ప్రణమిల్లి, యా సరోవరమునకు ప్రదక్షిణము జేసి కొలనిగట్టున నిలువఁబడెను. కొలని నీటినుండి కొంతసేపటి కొక యక్షయపాత్ర వెలువడి మణిమేఖల చేతిలోనికి వచ్చెను. భక్తిపారవశ్యమున బుద్ధదేవుని స్తుతించి మణిమేఖల యిట్లనెను. "నా భర్తతో సహగమన మాచరించు సమయమున—ఆనాఁడు బౌద్ధభిక్షువునకు సహర్షముగ అన్నపానీయము లొసఁగిన మధురస్మృతి—నా స్మృతిపథమునకు వచ్చెను. తత్ఫలితముగ కాఁబోలు నా కీనాఁడు అక్షయపాత్రము లభించినది. ఆఁకలి గొన్న తనయునిఁ జూచిన దేతడవుగ పాలుగారు మాతృవక్షోజములవలె, ఆహారార్థమై యెండవాన లనక అహరహములు శ్రమించుచుండు అన్నాతురుల యాఁకలిదప్పులను నా చేతియం దున్న యీ యక్షయపాత్రము తీర్చునుగాక!" అనెను.

"నీవు నుడివినది నిజము. తీఱని ఆఁకలియే సర్వానర్థములకును ముఖ్యకారణ మగుచున్నది. అది మానవజాలికి ప్రబలశత్రువు. పై పెచ్చు కులీనతను, గౌరవమును, విద్యాభ్యాసానురక్తిని నది గోల్పోవున ట్లొనరించును. భిక్షాటనమునకు పాల్పడఁ జేయును. విశ్వామిత్రుఁ డంతటివాఁడే క్షుద్బాధకు తాళఁజాలక కుక్కమాంసమును భక్షించెను. అంతే గాదు, వర్షార్థము దేవేంద్రునకుఁ గూడ నా మాంసమందలి యొక భాగము నాతఁడు నైవేద్యముగ సమర్పించెను. అన్నాతురుల

కొనఁగబడునదే నిజమునకు దాన మగుచున్నది. ధనికుల కిచ్చునది అపాత్రదాన మగును. పూర్వపుణ్యావశమున సంపాదించిన యీ అక్షయపాత్ర మూలమున నిర్ధనుల క్షుద్బాధను నీవు మటుమాయము చేయుదువుగాక !'' అని మణిమేఖలకు ద్వీపతిలక ప్రబోధించెను.

మణిమేఖల యా దేవతకు సభక్తికముగ నమస్కరించి యామెయొద్ద సెలవు దీసికొనెను. పిమ్మట నామె బుద్ధపీఠమునకుఁ బ్రదక్షిణము గావించి మొదటి మంత్రము నుచ్చరించెను. తోడనే యామె గగనవీధిని కావేరీపట్టణమునందలి యరవణ మున్యాశ్రమమునకు నెడలెను. తన తల్లిని, సుతమతిని గలసికొని యామె మణిపల్లవమున జరిగిన వివిధవిషయములను వారికి విదిత మొనర్చెను. అక్షయపాత్ర మహిమను మిక్కిలి కొనియాడెను. అనంతరము వారందఱు నఱవణమునిని సందర్శించు నభిలాషతోఁ దదాశ్రమమునకుఁ జనిరి.

మణిమేఖల యమ్మునికి ముమ్మారు ప్రదక్షిణము జేసి నమస్కరించి మణిపల్లవపు విషయములను వివరించెను. తన పూర్వజన్మమునకు సంబంధించిన మఱికొన్ని వివరము లఱవణమునివలనఁ దెలియు నని మణిమేఖలాదైవము నుడివె ననియు, వానినిఁ దెలుపుఁ డనియు, ఆపుత్రుని కథను, అక్షయపాత్ర మహిమను వివరింపుఁ డనియు నామె మునిని వేఁడెను.

అటులనే యని ముని యిట్లనెను. ''ఒకప్పుడు నేను దుర్జయరాజును సంధించి యతినిని గృధ్రకూట పర్వతమును

సందర్శింపు మని కోరితిని. మఱియొకప్పు డతఁడు గంగాతీర మండలి యొక వనములో విచారవదనుఁడై కూర్చుండి యున్నప్పుడు నే నతనిని జూచి నీ విచారమునకు కారణ మేమి? అని ప్రశ్నించితిని. ఒకనాఁటి రాత్రి భోజనానంతరము మద్యము సేవించి, స్పృహ తప్పినదై వీర యొక మదగజ మును సమీపింపఁగా నది యాతెను చావమోఁదె ననియు, వీర దుర్మరణవార్త చెవిని పడఁగానే తార సౌధోపరిభాగము నుండి క్రిందికి దూకి బలవన్మరణము చెందె ననియు, రాణు లిరువురును దివంగతులు కాఁగా తాను విచారవదనుఁడై యున్నాఁ డనియు దుర్జయుఁడు దుఃఖోద్వేగము నడఁచుకొని నుడివెను. పురాకృత కర్మల ననుసరించి శుభాశుభము లేర్పడు ననియు, అందులకుగాను పరితపించుచు రాచ కార్య ముల పట్ల విముఖత్వము చెందుట పాపహేతు వనియు నే నంత నతని నోదార్చితిని.''

పిమ్మట మణిమేఖల నుద్దేశించి మునిప్రవరుఁడు 'ధర్మము నానాఁటికిని పతనస్థితికి పాల్పడుచున్నది. కాని ధర్మ మేనాఁటికైనను సుస్థిరముగ నుండు ననుతలంపుతో నేను ధర్మోపదేశము చేయుచున్నాను. మరల బుద్ధదేవుఁ డీ ప్రపంచమునం దవతరించి ధర్మప్రచారము గావింపఁగలఁడు. అప్పు డెల్లరును దయార్ద్రహృదయు లగుదురు. సూర్య చంద్రులు నిర్మలముగ ప్రకాశింతురు, సకాలవర్షము లుండును. అవని యంతయు సస్యశ్యామలమై శోభించును. శాంతిసౌఖ్య

ములు వర్ధిల్లును. మృగములును, మానవులును తమతమ వైరములను విస్మరింతురు. శాక్యర్షి ముఖతః ధర్మోపదేశము పొందినవారికి పునర్జన్మ ముండదు. కాని మణిమేఖల! ప్రస్తుతము నీకు లభించిన అక్షయపాత్ర నాధారముగఁ జేసికొని ప్రపంచపరివ్యాప్తమై యున్న ఆఁకలిమంటలను పోకార్పుము. క్షుద్బాధ నశించిననాఁడే శుభోదయము గలుగును. ఇది నీ విధ్యుక్తధర్మము. ఈ ధర్మము నీవు నిర్వర్తించితివేని పిమ్మట నీకు ధర్మోపదేశము చేయుదును.'' అనెను.

అందులకు మణిమేఖల సహర్షముగ సమ్మతించెను. పిమ్మట 'ఆపుత్రుని' గాథను ముని యామె కీవిధముగ నుడివెను.

''వారణాశిలో అభంజకుఁ డను నొక బ్రాహ్మణుఁడు గలఁడు. అతని భార్యపేరు శాలి. ఆమె సచ్ఛీల కాదు. తాను కావించిన పాపపరిహారార్థము శాలి తీర్థాటనము చేయ నిశ్చయించి కన్యాకుమారి కేతెంచెను. అప్పు డామె నిండు చూలాలు. త్రోవలోనే యామె ప్రసవించెను. ఆమె కొక మగపిల్లవాఁడు (ఆపుత్రుఁడు) జన్మించెను. అయినను శాలి కర్కశహృదయయై ఆ శిశువు నొక తోఁటలో విడిచిపెట్టి పోయెను. ఆ పసికూన క్షుద్బాధచే కెవ్వన విలపింపసాఁగెను. అది విని యచ్చటనే యున్న యొక ఆవు ఆ శిశువును సమీపించి నాలుకతో నాకి పా లొసఁగెను. ఇ ట్లేడుదినములు గడచెను. తుదకు భూతి యనుబ్రాహ్మణుఁడు భార్యాద్వితీయుఁడై యా త్రోవను పోవుచు శిశువును జూచి, దగ్గఱకు తీసికొని, లాలించి తన గృహమునకు తీసికొనిపోయెను.

ఆతఁ డాపుత్రునికి విద్యలు నేర్పి ఉపనయన సంస్కారమును గూడ గావించెను.

ఒకనాఁ డా గ్రామమందలి బ్రాహ్మణుఁ డొకఁడు గోమేధ యాగమును జేయ నిశ్చయించెను. యజ్ఞపశువు కూడ సిద్ధముఁ జేయఁబడెను. గోమేధయాగ నిరోధకుఁ డైన ఆపుత్రుని కది తెలియవచ్చెను. రాత్రివేళ అతఁడు యజ్ఞ పశువు నెచ్చటికో తోలుకొని పోవఁదొడఁగెను. ఈ విషయ మును తెలిసికొని ఆ యూరి బ్రాహ్మణు లందఱు గుమిగూడి యాగపశువును ఆపుత్రుఁడే తోలుకొనిపోయి యుండు నని పసికట్టిరి. అన్వేషణ సలిపి తుద కా బ్రాహ్మణు లాపుత్రుని పట్టుకొనిరి. ఒక బ్రాహ్మణుఁ డా యజ్ఞపశువును స్వాధీనము చేసికొన యత్నింపఁగా అది యాతని పొట్టను చీల్చివైచెను. అతఁడు బిగ్గఱగా విలపింపఁదొడఁగెను. తోడనే బ్రాహ్మణు లెల్లరు దయావిహీనులై కసితీఱ ఆపుత్రుని చావమోదిరి. అయినను మానవాళికి మాతృమూర్తి యగుగోనూతను నిష్కారణముగ బాధింపవచ్చునె? అనుచు ఆపుత్రుఁడు వారిని ప్రశ్నించెను. వారు వేదములందలి ప్రబలప్రమాణ ముల నెత్తి చూపి తమకార్యమును సమర్థించుకొనిరి. ఆపుత్రుఁ డంత వేదమతమును ఖండించెను.

ఇది యిట్లుండఁగా నానమూహమందలి యొక బ్రాహ్మ ణుఁ డాపుత్రుని జన్మవృత్తాంతమును బయటపెట్టెను. అతఁ డును నిజవృత్తాంతమును తెలియఁజేసెను. తోడనే ఆపుత్రుని

పెంచి, పెద్ద చేసిన భూతికూడ నతని యుదంతము కలుష భూయిష్ఠముగ నున్న దని నిశ్చయించి యతనిని విడనాడెను. దిక్కులేనివాఁడై ఆపుత్రుఁడు మధురానగరమునకు పయన మయ్యెను. అట సరస్వత్యాలయములో నాతఁడు బస యేర్ప ఱుచుకొనెను. బిచ్చ మెత్తుకొనుచు నాతఁడు నగరవీథు లన్నియు తిరిగి తిరిగి లభించిన యాహారపదార్థములను మునుముందుగ గ్రుడ్డి, మూగ మున్నగు నభాగ్యులకును, అన్నార్తులైన నిర్ధనులకును పెట్టి పిమ్మట తాను భుజించు చుండెడివాఁడు. ఒకనాఁడు క్షుధార్తులు కొందఱు నిద్రి తుఁడై యున్న ఆపుత్రుని సమీపించి, అతనిని లేపి అన్నము పెట్టు మని ప్రార్థించిరి అప్పు డతనియొద్ద పట్టె డన్నమైనను లేదు. సరస్వతిని ప్రార్థింపఁగ నా దేవి యతని కొకయక్షయ పాత్ర నొసఁగి యిట్లనెను. "ప్రపంచ మంతయు కఱవుకాటక ములచే బాధింపఁబడినను, ఈ పాత్రమున ఆహారము సమృ ద్ధిగ లభించును. దీని సహాయమున నీ యిచ్చ వచ్చినంతగా నీవు అన్నార్తుల కాహారము పెట్టవచ్చును." పట్టపగ్గములు లేని సంతోషముతో నతఁ డందఱి క్షుద్బాధను తీర్చివైచెను. కొలఁది కాలములో నా సరస్వత్యాలయము క్షుత్పీడితు లగు మానవులకే కాక పశుపక్ష్యాదులకుఁగూడ నిరతాన్నసత్ర మయ్యెను.

ఈ యద్భుతవిశేషమును విని యింద్రుఁడు భయా క్రాంతుఁ డయ్యెను. దానశీలుఁ డైన ఆపుత్రుఁ డెక్కడ తన సింహాసనము నాక్రమించునో యనుసంశయ మతనిని బాధింప

దొడఁగెను. అతఁడు వృద్ధబ్రాహ్మణవేషము ధరించి ఆ పుత్రుని సమీపించి వరము కోరుకొను మని యడిగెను. అందులకు నవ్వి 'నిస్వార్థచిత్తులై దేశశ్రేయస్సును గోరి శ్రమించువారును, ఆశాపాశములను గోసి తపశ్చర్యలలో కాలము గడపువారును నిష్కాములుగ నుందురు. వారికి వరములతో పని లేదు. క్షుధార్తుల బాధను పోకార్చుచున్న యీ యక్షయపాత్ర యొక్కటియే నాకు చాలును. నా కేమియు వలదు. పొమ్ము' అని యాతఁడు కొంచెము కఠినముగ మాటాడెను. ఇంద్రుడు రోషకషాయితనేత్రుఁ డయ్యెను. ఆ పుత్రునిపై నాతఁడు పగ సాధింప సమకట్టి తనలోకమునకు వెడలిపోయెను.

పిదప నింద్రుఁడు కుండపోతగా వానలు కురిపించెను. తత్ఫలితముగ పాండ్యమండలము సస్యసంపదతో తులతూగుచుండెను. నిర్ధనులు మచ్చునకైనను లేకుండిరి. సరస్వత్యాలయము పూర్వమువలె వచ్చిపోవుజనముతో కిటకిట లాడక శూన్యాలయమువలె కన్పట్టెను. ఆపుత్రుని కిది విచారహేతువయ్యెను. తాను నిర్ధనులకు సహాయము చేయలేకున్నానే యని యాతఁడు విచారింపసాగెను. దేశము నలుమూలలు గాలించినను, నాతనికి దరిద్రుఁ డొక్కఁడును కానరాలేదు. సుమత్రాద్వీపమున గొప్ప క్షామ మేర్పడి ప్రజలు వేనకు వేలుగ విగతజీవు లయినా రనువిషాద విషయ మతనికి వినవచ్చెను. అతఁడు తత్‌క్షణమే సుమత్రా ద్వీపమునకు ప్రయాణమై యొక నావ నెక్కెను. కాని భయంకర మగు

తుపా నొకటి రాఁగా ఆ యోడను మణిపల్లవమున లంగరు వేసిరి. ఆపుత్రుఁడు నావ దిగి ద్వీపములోనికి వెళ్లెను. నాఁటి నిశీథమున నావ తిరిగి బయలు దేఱెను. ఓడయందున్న వా రా పుత్రుని విషయమునే మఱచిపోయిరి. నావ బయలు దేఱి పోవుట చే నతఁడు నిస్పృహఁ జెందెను. సుమత్రా ద్వీపవాసులకు సహాయము చేయఁజాలక పోయితినే యని యతఁడు విషణ్ణహృదయుఁడై యక్షయపాత్రను మణిపల్లవమునం దున్న తామరకొలనిలో విసరివేయ నిశ్చయించెను. జీవరాసులకు దానధర్మము సేయునభిలాష గల మహావ్యక్తి కా యక్షయ పాత్ర హస్తగత మగును గాక యని తలఁచి, గోముఖము నొకటి ధరించి ఆపుత్రుఁడు దానిని కొలనిలోనికి పాఱవైచెను.

ఆపుత్రుఁడు మణిపల్లవమున నున్నప్పుడు నే నచటనే యుంటిని. అతఁడు చెప్పఁగా నతని వృత్తాంత మంతయు నాకుఁ దెలియ వచ్చినది. ఆపుత్రుఁడు సుమత్రాద్వీపపాలకుని యంతఃపురమునందలి యొక గోవునకు ప్రకృతము జన్మించి యున్నాఁడు. అతని కానాఁడు పా లొసఁగినయావుకూడ నా దీవియందే చతుర్ముఖుఁ డనుసాధుపుంగవుని తపోభూమికి సమీపమున జన్మించినది. దాని కిప్పుడు బంగారుకొమ్ము లున్నవి. అది పూర్వముకంటెను నెక్కువగా పాలిచ్చుచున్నది. ఆ సాధువు త్రికాలవేది. ఆ యావు వీరపురుషుని ప్రసవించు నని యతఁడు నుడివెను. అమ్మునిమాటలు ఫలించి యా గోవు గర్భమునుండి వెలువడినబంగరుగ్రుడ్డునుండి బుద్ధభగవానుని

వలె వైశాఖపూర్ణిమనాఁడు ఆపుత్రుఁడు జన్మించెను. ఈ విషయమును తెలిసికొని యెల్లరును విస్మయముఁ జెందిరి. ఆ ద్వీపపరిపాలకుఁడైన భూమిచంద్రుఁడు చతుర్ముఖుని యాదేశము ననుసరించి యా బాలుని సంరక్షింపసాఁగెను. ఆ బాలుఁడే పెద్దవాఁడై యిప్పుడు రాజ్యము సేయుచున్నాఁడు. కనుక మణిమేఖలా! నీ వా యక్షయపాత్రము నుపయోగించి క్షుధార్తుల యార్తిని బాపుము.''

అఱవణముని యాదేశమును సహర్షముగ శిరసావహించి మణిమేఖల భిక్షుకివేషము ధరించి యక్షయపాత్రమును జేత నిడికొని నగరమున సంచారము సేయసాగెను. అలనాఁడు వత్సరాజగునుదయనమహారాజును ప్రద్యోతనుని చెఱనుండి విడిపించునిమిత్తము మహామంత్రి యౌగంధరాయణుఁడు వికృతవేషము గైకొని యుజ్జయినినగరవీధుల సంచరించునప్పుడు జను లాతని చుట్టును గుమి గూడినట్లుగా మణిమేఖలను నగరప్రజలు చుట్టుముట్టిరి. 'ఈ సౌందర్యతిలకము - యువరాజగు నుదయకుమారుని హృదయాధిదేవతయౌ — నేఁడు భిక్షుకియై భిక్షాపాత్రను చేత నిడికొని నగరమున తిరుగుచున్నది''—అని యెల్లరును మణిమేఖలను జూచి యాశ్చర్యపడసాగిరి.

ఆజనసమూహమున కాయచండిక యనునొకస్త్రీ యుండెను. ఆమె మణిమేఖలను జూచి ''అమ్మా! నేను పేరాఁకలితో పండ్రెండేండ్లుగ బాధపడుచున్నాను. ఈ

యక్షయపాత్రము నా క్షుద్బాధను తీర్పగలదా?" యని ప్రశ్నించెను. అందులకు మణిమేఖల సదుత్తర మొసఁగఁగా నామెకు మేర లేనిసంతోషము గలిగెను. 'ఆఁకలిని తీర్పు' మనుచు కాయచండిక యామెను తొందర పెట్టసాఁగెను. అటులనే యని పలికి 'తొలుతసచ్ఛీల మైనపుణ్యస్త్రీభిక్షయిడినచో నీపాత్రము నిరతాన్నదానము సేయఁగలదు. ఈ వాడయం దెవరైన నట్టివా రున్నారా?' అని మణిమేఖల ప్రశ్నించెను. 'లే కేమి! ఆదిరై యనుపతివ్రత యున్నది. ఆమె వృత్తాంతమును విను' మని కాయచండిక యామెయుదంతము నిట్లు నుడివెను.

"ఆదిరై భర్తపేరు సాధువన్. అతఁ డొక వర్తకవరేణ్యుఁడు. ఆతఁడు ధనికుఁ డని వేఱుగ నుడువ నవసరము లేదు గదా! అతఁడు వేశ్యాలోలుఁడై తన సర్వస్వమును గోల్పోయెను. నిర్ధనుఁ డైనసాధువన్ గత్యంతరము లేక స్వగృహమునకు వచ్చెను. ఆదిరై యతనిని సహర్షముగ నింటిలోనికాహ్వానించెను. అతఁడు తిరిగి వ్యాపారము సేయ సంకల్పించి విదేశములకు ప్రయాణమై పోయెను. తిరుగు ప్రయాణములో నతఁ డెక్కిననావ గాలిపానుదెబ్బ తిని సముద్రమున మునిఁగి పోయెను. పలువురు పరలోకగతు లయిరి. కొందఱు మాత్ర మా గండమునుండి బయటపడి నౌకాభంగవిషయము నామెకుఁ దెలియఁజేసిరి. తన భర్త మరణించి యుండనోపు ననుతలంపుతో ఆదిరై సహగమన మాచరింప నభిలషించెను. బంధువు లామె సహగమనమునకై యొక చితిని పేర్చిరి.

ఆమె యా చితికిఁ బ్రదక్షిణము గావించి యందు దూఁకెను. కాని యామె శరీరము నా యగ్నిజ్వాలలు స్పృశింపఁ జాలక పోయెను. అప్పు డొక వాణి 'పతివ్రతాలలామ! నీ భర్త మరణముఁ జెందలేదు. అతఁడు త్వరలోనే రాఁగలఁడు' అని వినవచ్చెను.

అటులనే కొన్నాళ్లకు సాధువన్ స్వగృహముఁ జేరెను. నౌకాభంగము కాఁగా నతఁ డొక బల్లకట్టు నాధారముగఁ జేసికొని నాగద్వీపమును జేరెను. నరమాంసభక్షకు లగుటచే నచటినాగు లతనిని భక్షింప నెంచిరి. కాని సాధువన్ నాగుల భాష నెఱిఁగి యుండుటచే వారి భాషలో తన్ను తినవల దనియు, తినినచో మహాపాపము వారిని చుట్టుకొను ననియు నుడివెను. పై పెచ్చు తన్ను చంపుఁ డని వారిని కోరెను. నాగనాయకుఁ డతని మాటల నమ్మి యతనిని విడిచిపుచ్చెను. తినుటకు కోడిపిల్లలును, త్రాగుటకు మద్యమును నాతని కొసఁగఁ బడెను. వానితోఁ గాటు జవ్వని యైన యొక సుందరాంగిని గూడ నతనికి జత గూర్చిరి. అతఁ డన్నిటిని నిరసించెను. 'నన్ను సంరక్షించుకొనఁ గోరి యితరజీవముల నిండుప్రాణముల నేల తీయవలయును? స్థిరచిత్తుఁడనై యున్న నేను మద్యము సేవించి యేల మతిభ్రమణము నెందవలయును? మనసార నన్ను వలచి నలపించుకులసతి యుండఁగా నాకీ భోగస్త్రీ యెందులకు? అదియును గాక వెలయాండ్ర గుణగణములు నాకుఁ దెలియనివి కావు. నాకు బియ్యము,

కాయగూరలు, చల్లనినీరు -మున్నగునవి యున్నఁ జాలును. వివేకవంతులను నా జతఁ గూర్చిన నేను మిక్కిలి సంతసింతును' అని సాధువన్ పలికినపలుకులు నాగులనాయకునికి నచ్చినవి. అతని యాదేశము ననుసరించి నాగులు తమ యాచార వ్యవహారములను మార్చుకొన నిశ్చయించిరి.

ఒకనాఁడు చంద్రదత్తుఁ డనువర్తకుని నౌకలు నాగద్వీపమును సమీపించెను. నావలయం దున్నవా రెల్లరును భయభ్రాంతులై యింకొకత్రోవగా ప్రయాణము చేయఁదలఁచిరి. అప్పుడు వారిని జూచిన సాధువన్ 'భయపడవలదు. ఇచటి నాగులు పూర్వపు నాగులు కారు. స్నేహప్రాయులు' అని నుడివి వారి భయమును బోఁగొట్టెను. చంద్రదత్తుఁ డందులకు సంతసించి యతనిని దన నావయం దెక్కించుకొని యతనికి బంగారము, చందనము, పట్టుసెల్లాలు మున్నగునమూల్యవస్తువుల నొసఁగెను. వానిని గ్రహించి సాధువన్ స్వగృహమునకుఁ జనెను. ఆతఁడు మహాసాధ్వి యగుఆదిరై పాదపద్మములపైఁ బడి 'నీ సచ్ఛీలమే నన్ను భయంకర మైనమృత్యుముఖమునుండి సంరక్షింపఁ గలిగినది' అని నుడివెను. నాఁటినుండి వా రిరువురును సౌఖ్యశ్రీలతోఁ దులఁదూఁగుచు కాలము గడపుచున్నారు."

పిమ్మట కాయచండికతోఁ గూడి మణిమేఖల ఆదిరై గృహమునకుఁ జని 'సాధ్వీరో! రమ్ము రమ్ము. భిక్ష యిడుము.' —అని యర్థించెను. స్మితవదన యై ఆదిరై వెలుపలికి వచ్చి

మణిమేఖలకుఁ బ్రదక్షిణము గావించి 'ఈ పాత్రము క్షుధార్తులైనవారి యార్తిని దీర్చును గాక!' యని భిక్షు యిడెను. పిదప మణిమేఖల యా యక్షయపాత్రసహాయమున తన చుట్టు ప్రక్కల నున్నవారి యాఁకలిబాధను దీర్చెను.

'ఈ భిక్షాపాత్ర నా యాఁకలిని గూడ తీర్చునా? శ్రీరామచంద్రుని కానాఁడు సేతువు నిర్మించునవసరమున వానరులు రాళ్లు తీసికొని వచ్చి గుట్టలు గుట్టలుఁగ పోసిరఁట! అటుల గుట్టలకొలఁదిగా నాహారమును భుజించినను నా యాఁకలిబాధ తీఱలేదు' అని కాయచండిక మణిమేఖల నుద్దేశించి నుడివెను. 'అట్లైనచో చేతులు చాపుము. ఈ పాత్రము నీకు నిరతాన్నదానము సేయఁగల' దని మణిమేఖల చెప్పఁగా నామె చేతులు చాపెను. నిర్ఝరాంభఃప్రవాహమువలె నామె భిక్షాపాత్రము నుండి యాహారము కాయచండిక చేతులలోనికి రాసాగెను. 'చాలు చాలు. నాకు క్షుద్బాధ తీరినది. శాపముగూడ నేటితో తీరినది'— అనుచు కాయచండిక సంభ్రమాశ్చర్యచకితయై నుడివెను అంత మణిమేఖల 'శాప మేమిటి? అసలు నీ వెవరవు? ఈ వ్యాధి నీ కెట్లు ప్రాప్తించినది. చెప్పుము' అని యడిగెను.

కాయచండిక తన జీవితవృత్తాంతమును జెప్పసాగెను.

''కైలాసపర్వతమందలి కాంచనపురమున నివసించు కాంచనుఁ డనువిద్యాధరుని భార్యను నేను. ఒకప్పుడు మేమిరువురము విహారార్థము తామ్రపర్ణినది మూలస్థానమున

నున్న పొదియిల్ పర్వతమునకుఁ బోవుచుంటిమి. త్రోవలో నొక సుందరారణ్యము మాకు దృగ్గోచర మయ్యెను. అందొక సెలయేరు పాఱుచుండెను. ఆ సెలయేటి యొడ్డున తాళఫల ప్రమాణమున పండొకటి యుండెను. అది వృశ్చికుఁ డను బ్రాహ్మణమునికి పండ్రెండేండ్ల దీర్ఘతపమునకు ఫలితముగ లభించినయపూర్వఫలము. ఆనాఁడు తన తపస్సు చాలించి వృశ్చికుఁడు సుస్నాతుఁడై యాఫలము నాహారముగ స్వీకరింపఁదలంచి దానిని గట్టుపై నుంచి స్నానము సేయుచుండెను. దుర్విధివశమున నేనచ్చోటికి వెడలి యాఫలమును పాడు చేసి తిని స్నానము చేసి వచ్చిన వృశ్చికుఁడు నలిగిపోయినపండును జూచి జరిగిన విషయమును తెలిసికొని యుగ్రుఁడై యిట్లు శపించెను. ''పండ్రెండేండ్ల యాహారమును పాడొనర్చిన యావ్యక్తికి పండ్రెండేండ్లవఱకును క్షుద్బాధ తీఱకుండును గాక! అంతే గాదు. అంతకాలము గగనవీథిని సంచరించుశక్తిని గూడ కోల్పోవునుగాక!' మఱుక్షణమునుండియు నేను పేరాఁకలికి లోనై తిని. నా దుస్థితిని జూచి జాలిపడి నా భర్త యాయడవిలోని ఫలములను, దుంపలను సేకరించి నా ముందు రాసులుగ పోసెను. అయినను నా కాఁకలి తీర లేదు. అప్పుడు ధాన్యాగార మని ప్రసిద్ధి వహించిన యీ పట్టణమునకు (కావేరీ పూంపట్టణము) నా భర్త నన్ను తీసికొనివచ్చినాఁడు. నాఁటినుండియు నీ నగరమునందలి సత్రములలో భోజనము సేయుచు కాలము గడపుచుంటిని. నేఁటికి పండ్రెండు సంవత్సరములు గడచినవి. నాశాపము తీరిపోయినది. క్షుద్బాధ

కూడ తగ్గినది. అమ్మా! మణిమేఖల!—నీకు నేను కృతజ్ఞురాలను. ఇక నేను కాంచనపురమునకు వెడలి నా భర్తను కలిసికొందును. చక్రవాళగుడిలోని యనాథాలయమున అన్నార్తులు పలువు రున్నారు. వారి యాకలిబాధను గూడ నీవు బాపుదువు గాక!''

పిమ్మట కాయచండిక కాంచననగరమున కేగి పోయెను. మణిమేఖల చక్రవాళాలయమునకుఁ జనెను. అచట నున్న క్షుధార్తులకు వలసినంత యాహారము నొసఁగి మణిమేఖల వారిని సంతుష్టహృదయులఁ గావించెను.

ఇటుల మణిమేఖల యనాథశరణాలయమునందు నివసించుట చిత్రాపతికి బాధాకరముగ నుండెను. అందాల బరిణె యైనయామె భిక్షుకి యగుట చిత్రాపతికి వెగటుగఁ దోఁపసాగెను. ఇరుగుపొరుగుల నున్నభోగస్త్రీల నందఱిని సమావేశపఱచి యామె 'యెన్నఁడైన నీ విడ్డూరమును వింటిరా? మణిమేఖలప్రవర్తనము మనజాతికి నూయరాని మచ్చగా నున్నది. పతివిహీన యైనబ్రాహ్మణివలె కన్య యైన మణిమేఖల దానధర్మములు గావించుచు సంచరించుచున్నది. వైశికుఁడు మరణించినను మరణింపని యతని వీణె వంటివారము మనము. ఎట్లైనను సరే! మణిమేఖలను ఉదయకుమారునికి పట్టమహిషిగా చేసెదను. అతఁ డామెను ప్రేమించుచున్నాఁడు. ఈ విషయములో నే నపజయము పొందినచో నా తలపై ఏ డిటుకలబాళ్ళు పెట్టి యంతఃపుర నాట్య

మందిరము చుట్టును త్రిప్పి నన్ను జాతినుండి వెలివేయుఁడు' అనెను.

అనంతరము చిత్రాపతి రాజాంతఃపురమునకు వెడలి యువరాజును సందర్శించి మణిమేఖలప్రవర్తనమును తెలియఁ జేసెను. కాని మణిమేఖలాదైవము తనకు స్వప్నమున కనఁబడి మణిమేఖలను ప్రేమింపవల దని వారించినవిషయము నాతఁడు చిత్రాపతికిఁ దెలిపెను. ఆ మాటలు విని నవ్వి చిత్రాపతి 'యువరాజా! ఎన్నఁడైనను కలలు నిజము లగునా? దేవతలు సైతము లావణ్యలతికలకు వశంవదు లయిరి. ఇంద్రుఁ డంతటివాఁ డహల్యను వంచించినాఁడు. శశాంకుఁడు తారకు వశుఁ డైనాఁడు. మా కులధర్మములను తమవంటివారు రక్షింపకున్న చో మఱి యెవ్వరు రక్షింతురు?' అని విన్నవించెను.

చిత్రాపతిపోరు పడలేక యుదయకుమారుఁడు మణిమేఖల యున్నయనాథమందిరమునకుఁ బోయెను. 'ఎందులకు భిక్షుకి వైతివి?' అని యామె నాతఁడు ప్రశ్నించెను. పూర్వజన్మమునఁ దన భర్తయు, ప్రకృతము యువరాజును నైన యుదయకుమారునియెడల మణిమేఖల గౌరవాభిమానములు ప్రకటించి ''ప్రభూ! పుట్టుట, పెరుఁగుట, గిట్టుట, రోగము మున్నగువానిని శరీర మనుభవించియే తీరవలయును. మత వ్యాపనమునందును, దానధర్మములు సేయుటయందును నేను నా జీవితము నంకితము గావింపఁ దలఁచి యీ భిక్షుకివేషమును బరిగ్రహించితిని'' అనెను.

మణిమేఖలను జూచినకొలఁది యువరాజు కామాతు రుఁడు కాసాగెను. అది గ్రహించి యామె చంపావతిగుడిలోనికి వెళ్ళి యొక మంత్రమునుచ్చరించి కాయచండిక వేషమును ధరించి భిక్షాపాత్రమును జేతనిడుకొని యువరాజును సమీపించెను

ఆమెను జూచినతోడనే దిగ్భ్రమఁ జెంది యుదయ కుమారుఁడు 'మణిమేఖల యెక్కడ?' యనుచు గుడిలోనికిఁ జొరబడెను. చంపావతికిఁ బ్రణమిల్లి యతఁడు 'దేవీ! భిక్షా పాత్రను కాయచండిక కొసఁగి మణిమేఖల యెచ్చటికి వెడలెనో చెప్పుము. ఈ విషయము తెలియనిదే నే నిచటనుండి కద లను' అని నుడువఁగా 'నీ పట్టిన ప్రతిజ్ఞ ఫలప్రదము కాఁ జాల'దని యొక వాణి యామెకు వినవచ్చెను. ఆ కంఠము తనకు స్వప్నములో శ్రవణగోచర మైన దేవికంఠమువలె విన నయ్యెను. తోడనే యాతఁ డా తలంపునకు స్వస్తి చెప్పి యంతఃపురమునకు మఱలిపోయి మణిమేఖల నిజవృత్తాంత మును దెలిసికొన నభిలషించెను.

ఒకనాఁడు మణిమేఖల భిక్షాపాత్రను చేత నిడికొని ప్రధానకారాగృహమునకుఁ జని యట నాఁకలితో నలమ టించి పోవుచున్న బంధితులకుఁ గడుపు నిండుగ భోజన మిడెను. కారాగృహాధికారుల కీ విషయ మెంతో యాశ్చ ర్యము గొలిపెను. అంత వారు రాజున కీ విషయమును దెలుప నిశ్చయించిరి.

తన్నగరాధిపతి యగుమావణ్‌కిల్లి భార్యాద్వితీ యుఁడై యానాఁడు కొంతవడి సుందరోద్యానవిహారము సలిపి

పిదప నొక మందిరమును ప్రవేశించెను. తన్మందిరము తమిళ, మహారాష్ట్ర, అవంతి, యవన, మగధదేశీయు లగు కళాకారులచే నిర్మిత మైనది. రాజదంపతులు తన్మందిర రామణీయకమును దిలకించుచు దానిని వేనోళ్లఁ బొగడు చుండిరి.

అప్పుడు కారాగారాధికారులు రాజును సమీపించి ''ప్రభూ! నిన్న మొన్నటిదాఁక దయ్యపుఁదిండితో బాధపడు చున్న కాయచండిక నేఁ డొకభిక్షాపాత్రమూలమున చెఱ సాలయం దున్న వారికిఁ గడుపునిండుగ భోజన మిడినది'' అని విన్నవించిరి. రా జది విని యచ్చెరువంది 'యామెను ప్రవేశ పెట్టుఁ' డని కట్టడి సేయఁగా సేవకులు కొంద ఱామెను ప్రభు సమ్ముఖమునకుఁ దీసికొని వచ్చిరి.

''ధర్మపరుఁడ వై యుందువు గాక! సకాలవర్షములు కురిసి దేశము సస్యశ్యామలమై యుండును గాక!'' అని తొలుదొలుత నుడివి మణిమేఖల యిట్లనెను. ''నే నొక విద్యాధరుని కుమార్తెను. మాఱువేషముతో నీ నగరము నందు తిరుగుచున్నాను. ఏనుఁగు నాఁకలిని గూడ దీర్పఁగల యొక యపూర్వ మైనపాత్రమును నా కొక దేవత ప్రసాదించి నది. ఈ రాజ్యమున క్షుద్బాధను తీర్చుటకై నేను కంక ణము కట్టుకొని యున్నాను.''

రాజునకు మేర లేనిసంతోషము గలిగెను. ''నా జీవి తాశయము గూడ నిదియే. నాకు చాల సంతోషముగా నున్నది. ఏదైనను వరము కోరుకొనుము'' అని యాతఁ డనెను.

'అయినచో నా కారాగారమును ధ్వంసము చేయుఁడు ఆ ప్రదేశమున నొక యనాథశరణాలయమును నిర్మింపుఁడు' అని మణిమేఖల యర్థించెను.

అందులకు రాజు సమ్మతించెను.

అనతికాలములోనే కారాగృహ మున్నచోట సుందర మందిరము లెన్నో వెలసినవి. బుద్ధపీఠ మొకటి యచట నిర్మింపఁబడెను. ప్రార్థనగీతములతో నా మందిరము సతతము ప్రతిధ్వనించుచుండెను చక్రవాళగుడియందే నివాస మేర్పఱుచుకొని మణిమేఖల నిరతాన్నదానము సేయ సాగెను.

ఉదయకుమారుఁడు మణిమేఖలయందు గాఢానురక్తుఁడై యుండెను. కాయచండికయే మణిమేఖల యని యతఁ డెట్లో పసికట్టి యామెకై చక్రవాళగుడిని శోధింప సాగెను. ఇది యిట్లుండఁగా ద్వాదశవర్షములు గడచినను కాయచండిక తన్నెందులకుఁ గలసికొనలేదో తెలిసికొనఁ గోరి కాంచనుఁడు చక్రవాళాలయమున కేతెంచెను. అతఁడు తన భార్యవేషము ధరించియున్న మణిమేఖల నచటఁ జూచెను. 'ఏ దైవమో నికీ యాహారపాత్రము నొసఁగెను కాఁబోలు' ననుచు ప్రేమపురస్సరముగ నతఁ డామెను పలుకరించెను. కాని మణిమేఖల యేమియు బదులు పలుకలేదు. అప్పుడే యుదయకుమారుఁడును వచ్చి మణిమేఖలను సమీపించెను. అతనిని జూచినతోడనే యామె యెంతో యాప్యాయముగ మాటాడ

సాగెను. సమీపమున నున్నయొక వృద్ధవనితను జూపి యామె 'ఓ యువరాజా! యౌవనమున నున్నప్పు డీమె నాకంటెను సౌందర్యరాశియై యుండ నోపును. మఱి యిప్పుడో! ఒడలు ముడుతలు పడియున్నది. కురులు నెరసిపోయినవి. శరీర చ్ఛాయలో మార్పు కనఁబడుచున్నది. కనుక వయసు ముది రినకొలఁది ప్రతివ్యక్తియందును నీ మార్పులు గోచరించుచునే యుండును. ఇట్టి దేహమును గోరుట వెఱ్ఱితనము'' అనెను.

ఈ మాట లేవియు యువరాజు తల కెక్కలేదు. అతని చూపు లన్నియు మణిమేఖలయందుఁ గేంద్రీకృతములై యుండెను. అచటనే యున్న కాంచనుఁడు తన భార్యశీలమును శంకించెను. ఉదయకుమారునిపై నామె మరులుగొని యున్న ట్లతఁడు నిశ్చయించెను. అంతలో ఉదయకుమారుఁడు 'మఱల వచ్చెదను, అప్పుడు నీతో మాటాడెద' నని నుడివి పోయెను. కాంచనునిసంశయము స్థిర మయ్యెను. రాత్రివేళనే యతఁడు రహస్యముగ వచ్చు నని తలఁచి చీఁకటి యెప్పుడు పడునా యని యతఁడు తహతహలాడసాగెను. ఒక కత్తిని గూడ నాతఁడు సిద్ధము చేసి యుంచుకొనెను.

కామాతురుఁడై నయువరాజు రాత్రివేళ నేతెంచి మణి మేఖలను గలసికొనెను. కాచి పొంచియుండిన కాంచనుఁ డది చూచి చేత నున్నకత్తితో యువరాజును రెండు తునియలుగ నఱకెను. ఈ దుర్భరదృశ్యమును జూచుచుండినమణిమేఖ లను సమీపించి కాంచనుఁడు 'రమ్ము, మనము కాంచన

నగరమునకు పోవుదము' అనెను. అప్పు డొక దేవతా విగ్రహ మిట్లు పలికెను. "కాంచనా! ఆమె నీ భార్య కాదు. మణిమేఖల. ఉదయకుమారుని బారినుండి తప్పించుకొనుటకై యామె నీ భార్య వేషము ధరించినది. నిన్నుఁ గలసికొనఁ గోరి కాయచండిక కాంచననగరమున కప్పుడే ప్రయాణమై పోయినది. కాని యామె యా సంబరములో కాళీదేవ్యాల యనుమీఁదుగ నెగిరిపోవుచుండెను. అందులకు దేవి కోపించి నీ భార్యను మృత్యుముఖమునకుఁ బాల్పడఁజేసినది. నీవో యిప్పుడు యువరాజును నిష్కారణముగఁ జంపితివి. దీనికి నీవు బాధ్యుఁడవు కావు. అతని పురాకృతకర్మయే యందులకు హేతువు. నీవు నిమిత్తమాత్రుఁడవు మాత్రమే"

ఈ విషయాదికము కాంచనునికి విచారముతోఁ గాటు సంభ్రమాశ్చర్యములను గూడఁ గలిగించెను. పిమ్మట నతఁడు కాంచనపురాభిముఖుఁడై చనెను.

విగ్రహము కాంచనునితోఁ జెప్పిన మాటలను, నతఁడు మరలి పోవుటను జూచినమణిమేఖల కాయచండిక వేషమును విడనాడి నిజరూపమును గైకొనెను. ఉదయ కుమారుని మృతశరీరమును జూచుచు పూర్వస్నేహమును స్మృతికిఁ దెచ్చికొని యామె దుఃఖభారముతో 'అకటా! పూర్వ జన్మమున దృష్టివిష మనుసర్పముచే నీవు ప్రాణములు కోలుపో యితివి. అప్పుడు నేను నీతో చితి నెక్కితిని. మఱల నిన్ను సుందరోద్యానమున కలిసికొంటిని. నా హృదయము నిన్ను

వెంబడించినది. ఆ విషయమును గ్రహించి మణిమేఖలా దైవము నన్ను మణిపల్లవద్వీపమునకుఁ గొంపోయినది. పూర్వజన్మవృత్తాంతమును తెలిసికొనినపిమ్మట నాకు నీపై నిర్హేతుకముగ ప్రేమ పొడమినది. నాయందు నీవును మరులు గొని యున్నా వని నేను గ్రహించితిని. కావుననే నేను నా తొలి రూపమునుగూడ మార్చుకొంటిని. అయినను నీ కీ జన్మమున దుర్మరణము తప్ప లేదు'' అనుచు నామె యువరాజును సమీపించెను.

అప్పు డా గుడిలోని విగ్రహము 'సమీపింపవలదు. పూర్వ జన్మముననే కాక యనేకజన్మములలోఁగూడ నతఁడు నీ భర్త. ప్రస్తుతము నీవు నిర్వాణమార్గములో నున్నావు. కావున మమకారమును తెగత్రెంపులు చేసికొనుము' అని ప్రబోధించెను. కాని తన భర్త బలవన్మరణముల కెందుకు గుఱియగుచున్నాఁడో మణిమేఖల తెలిసికొనఁ గోరెను. అంత నా దేవత యిట్లు చెప్పెను.

''కాయంగరై నదీతీరమున నివాకప్పుడు బ్రహ్మధర్మునికాతిథ్య మొసఁగితివి కాని వంటకములు తయారగుటకుఁ గొంచె మాలస్య మయ్యెను. అందులకు నీ భర్త వంటవానిని తూలనాడెను. ఎట్టకేలకు పొగలు గ్రక్కుచున్న వంటకములతో వంటవాఁ డతిథిని సమీపించెను. కాని నిప్పులు కురియుచున్ననీ భర్తృనేత్రములను జూచినతోడనే యతఁడు భయభ్రాంతుఁడై చేత నున్న పళ్లెరములను జాఱవిడిచెను. అవి

యున్నియు నేలమీఁద చిందరవందరగా పడిపోయెను. అప్పుడు నీ భర్త కోపోద్ధృతిని పట్టఁజాలక కత్తితో వంటవానిని రెండు తునియలు గావించెను కోపము దాల్చుటచే పాముకాటు వలనను, జంపుటచే కత్తివ్రేటువలనను నీ భర్తకు బలవ న్మరణములు వాటిల్లినవి. కనుక నీవు విచారింపవలసిన యవసరము లేదు ''

మణిమేఖల యది విని విచారవదనయై తన భవిష్యత్తును గూడఁ దెలియఁజేయు మని యా దేవిని వేఁడెను. ఆమె యటు లనే యామె భవిష్యద్వృత్తాంతము నిట్లు తెలిపెను. ''నీకు కారాగారప్రాప్తి కలదు. కాని వెంటనే విడుదల కాఁగలవు. అటుపిమ్మట నీవు కష్టపరంపర నెదుర్కొని సుమత్రా ద్వీపముఁ జేరెదవు. అట పుణ్యరా జను పేరున వ్యవహరింపఁ బడుఆపుత్రుని నీవు కలసికొందువు. అతనితోఁ గూడి మణిపల్లవమునకు వెడలెదవు. కావేరీపట్టణము ధ్వంసమై పోవు ననుదుర్వార్తను తెలిసి నీవు వంజినగరమునకుఁ జని యచట కణ్ణకిని సేవింతువు. నీ తల్లియు, సుతమతియు, అఱవణ మునియు పుహార్ ధ్వంసమై పోయినపిమ్మట కాంచీనగర మునకుఁ బోవుదురు. అట నొకమహాక్షామము సంభవించును. అప్పుడు భిక్షాపాత్రముతో నీ వచ్చటికి వెడలి యచటి జనుల క్షుద్బాధను తీర్చెదవు. అఱవణముని నీకు ధర్మోపదేశము గావించును. పిదప పురుషుఁడవై మగధదేశమున జన్మము లంది తుదకు నీవు నిర్వాణము నందుదువు.''

భానూదయ మయినది. చంపాపతీ దేవ్యాలయమున కేతెంచినభక్తులు యువరాజు మృతకళేబరమును జూచి భయవిహ్వలు లయిరి. చక్రవాళగుడిలోని సాధువుల కీ విష యము తెలియవచ్చెను. యువరాజుమరణమునుగూర్చి యెల్ల రును మణిమేఖలను బ్రశ్నింపసాగిరి. తా నెఱిఁగినవిషయముల నామె వారికి విదితె మొనర్చెను. పిమ్మట నా సాధువులు రాచనగరునకు వెడలిరి.

అంత నొక వృద్ధసాధువు కామాతురుల దుశ్చేష్టిత ములను, తత్ఫలితముగ వా రనుభవించినకష్టములను రాజు నకుఁ దెలియఁజేయుచు నొకగాధను జెప్పెను.

''అగస్త్యుని యభిమతము ననుసరించి కంటముఁడు కకందుని రాజుగా చేసెను. అతఁడు వారసపుత్రుఁడు కాఁడు. న్యాయసమ్మతముగ నతఁడు రాజ్య మేలెను. ఆతని రెండవకుమారుఁడు వట్టి స్త్రీలోలుఁడు. ఒకనాఁడు కావే రిలో స్నాన మాచరించి గృహాభిముఖ యైనమరుతి యను బ్రాహ్మణి యాతనికంటఁ బడెను. అతఁ డామెపొందును గోరఁగా నామె నగరదేవతను సమీపించి 'దేవీ! పతివ్రత 'కురియు' మన్నంతనే వర్షము గూడఁ గురియును. ఆమె పర పురుషుల హృదయమందు విషయాసక్తభావములు రేకెత్తింపఁ గూడదు. నే నెన్నఁడు నా భర్తయెడల విరుద్ధముగ బ్రవర్తించి యుండలేదు. కనుక పరపురుషునియందు నే నెట్లు మలిన

భావములు లేకె త్తించితినో తెలియరాకున్నది. రహస్యముగ నైనను స్త్రీలయెడఁ గామాతురులై యున్న వారినిగూడ నీవు శిక్షింతు వని విన్నాను. మఱి యిప్పుడు శక్తివిహీనవై యున్నావా ?' అని యడిగెను.

అందుల కా దేవి యిట్లు ప్రత్యుత్తర మిచ్చెను. 'ఇతరదైవములను గాక పతిదేవుని సేవించుపడఁతి కురియు మన్నంతనే వర్షము కురియును. ఆమెయే పతివ్రత. కాని నీవు శృంగారగాథలు, అసత్కథలు - మున్నగువానిని విని యెంతయో సంతసించితివి. నీవు పతివ్రతవే యైనను వర్షము కురిపించుశక్తి నీలో లేదు. నీపై మరులుగొన్న పరపురుషుని హృదయము భగ్గున మండవలదా ? అట్లు నీ వొనర్పలేవు. అయినను నీలో దోష మేమియు లేదు. కాన నిన్నుఁ దప్పక రక్షింతును. ఏడుదినములలోపల రా జతనిపై చర్య తీసికొనకున్నచో నేనే యతనిని శిక్షింతును.'

దేవి యిట్లనుచుండఁగనే కకందుఁడు కుమారునిదుశ్చర్యను విని యతనిని దన కరవాలముతో ఖండించి వైచెను. తండ్రిన్యాయశీలమును పరీక్షింపఁదలఁచి పెద్దకుమారుఁడుకూడ వైశ్యస్త్రీని పరాభవించెను. ఆ విషయము నెఱిఁగిన కకందుఁడు సింహాసనమునకు రావలసిన జ్యేష్ఠునికిఁ గూడ శిరచ్ఛేదమున కాజ్ఞాపించి న్యాయశీలుఁ డనిపించుకొనెను. కావుననే నగరమునకు కాకంది యనువ్యవహారనామ మేర్పడెను.

ప్రభూ! పంచమహాపాతకములకు చెందిన చోర, హత్య, సురాపాన, అసత్యభాషణములను రా జదుపులోనికి

తీసికొని రావచ్చును. కాని కామోద్రేక మట్టిది కాదు. కావున కామవికారము నడచుకొన్నవాఁడే ముని యని చెప్పఁబడును.''

సాధుపుంగవుని మాటలు వినుచున్నరాజు భయ భ్రాంతుఁడై 'యేమి జరిగినదో చెప్పుఁడు. దుష్టుఁ డెవ్వఁడై నను సరే వానిని తప్పక శిక్షింతు' ననెను.

''ప్రభూ! కోవలుని మరణానంతరము మాధవీ మణి మేఖలలు మున్యాశ్రమమున కాలము గడపుచున్నారు. ఉదయకుమారుఁ డట్లు మునివృత్తినున్న మణిమేఖలపై మరులు గొనఁగా నాతని బారినుండి తప్పించుకొనుటకై యామె కాయ చండిక యనుగంధర్వాంగన వేషము దాల్చినది ఆమెయే మణిమేఖల యని సంశయించి యువరాజామెను బలవంతము చేయసాగెను. తన భార్యపై యువరాజు వలపు గొని యున్నాఁ డని యనుమానించి కాయచండికభర్తయైన కాంచ నుఁడు యువరాజును నఱికివై చెను'' - అని సాధువు సవినయ ముగ విన్నవించెను.

కుమారుని బలవన్మరణవార్త రాజును కొంత కలవర పెట్టినను దుష్టునకు తగినశిక్ష లభించిన దని యతఁడు మిక్కిలి సంతసించెను, కాంచనుని వేనోళ్లఁ బొగడెను. 'పతివ్రతలను, మునులను పరిపాలకులు సంరక్షింపవలయును. యువరాజు మరణమునకు మణిమేఖలయే కారణ మని తలఁచి యుద్రక్తులైన ప్రజ లామెను హింసింతు రేమో! కావున మణిమేఖలను కొంతకాలము కారాగృహములో నుంచుట శ్రేయస్కర

ముగ నుండు' నని రాజు మణిమేఖలను చెఱసాలలో బంధింపుఁ డని సేవకుల కాజ్ఞ యిడెను.

కన్నకుమారుఁడు మరణించె నని తెలియఁగనే రాణి హృదయము శోకార్ణవ మయ్యెను. మణిమేఖలపై నామె కంతు లేనికోపము వచ్చెను. కాని యేమి చేయఁగలదు? ఇంతలో 'వసంతవ్వ' యను నొకవృద్ధ పట్టమహిషికడకు వచ్చెను. ఆ యవ్వ రాజదంపతులకును, రాజవంశీయులకును సలహా లొసఁగుచుండును. దుఃఖసమయములం దామె వారి నోదార్చుచుండును. పట్టమహిషిని దీవించి యవ్వ యిట్లనెను. ''మనరాజు లెల్లరు విజయశ్రీని వరించి యుద్ధరంగములం దే దివంగతు లయిరి. వృద్ధాప్యముచే మరణించినను వారికి సకలరాజలాంఛనములతో దహనసంస్కారాదులు జరగె డివి. లేదా వారిని బ్రాహ్మణులు దర్భశయ్యపైఁ బరుండఁ బెట్టి యుద్ధభూమిలో మరణించినట్లుగా వారిని రెండు ముక్క లుగఁ జేయుదురు. ఇంతవఱకు చోళరాజులలో వృద్ధాప్య మున మరణించుట గాని, దుర్మరణము నెందుట గాని జరగి యుండలేదు. ఉదయకుమారుఁ డొక్కఁడే నేఁడు బలవన్మర ణమునకు గుఱి యైనాఁడు. కనుక ధర్మస్వరూపుఁ డైన మహా రాజులుంగారి సమ్ముఖమున విలపింపకుము. రహస్యముగ మణిమేఖలను శిక్షించుటకు యత్నింపుము–''

అవ్వమాటలు పట్టమహిషికి రుచించినవి. ఆమె యభీ ష్టానుసారము మణిమేఖల నామె శిక్షింప సమకట్టినది. లోడనే

రాణి ప్రభువును సమీపించి మణిమేఖల నిర్దోషి యనియు, కాన నామె కారాగృహములోఁ గాక రాచనగరులోనే బంధింపఁబడవలయు ననియు నచ్చికబుచ్చిక లాడెను. అందులకు రాజు మిక్కిలి సంతసించి యెట్లైనను మణిమేఖల సురక్షితముగ నుండవలయు ననియే తన యభిప్రాయ మని నుడివెను. రాజాజ్ఞ ననుసరించి మణిమేఖల యంతఃపురప్రాంగణమున నొక గదిలో నుంచఁబడెను.

ఆ గది విషవాయుపూరితము. ఆ గాలిని పీల్చినచో మతిభ్రమణము గలుగును. ఈ విషయమును గ్రహించి మణిమేఖలాదైవము విషవాయువులోని విషమును బోఁగొట్టి మణిమేఖలను రక్షించెను. ఇంకను గసి తీఱనిపట్టమహిషి యొకనాఁటి రాత్రి బలిష్ఠుఁడును, కామోద్రిక్తుఁడును నైన యొకమోటుమానిసిని మణిమేఖలను బరాభవింపు మని ప్రేరేపించి యామె గదిలోనికిఁ బంపెను. కామపరవశుఁడై యాతఁడు గదిలోనికిఁ జనెను. అతనికంటి కొక వికృతమానవ రూపము గోచర మయ్యెను. నల్లనిమేనును, గుండ్రని యెఱ్ఱనికండ్లును, కోరపండ్లును గలిగి కొండవలె భయంకరుఁడై నయొకపురుషుఁ డాతనికిఁ గనఁబడెను. ఆ దయ్యపు మానిసిని జూచినంతనే యా యువకుఁడు భయవిహ్వలుఁ డయ్యెను. మణిమేఖలాదైవ మొసఁగినమంత్రశక్తిచే లావణ్యలతిక యగుమణిమేఖల యా వికృతరూపము ధరించె నని యా నిర్భాగ్యునకుఁ దెలియదు. భయభ్రాంతుఁడైన

యతఁడు గదినుండి వెలుపలికి వచ్చెను. చోళనాడులో నున్నచో రాణివలన నిట్టి యిబ్బంది లేమైనను గలుగు నని తలఁచి యతఁ డా దేశము నే వీడి మఱొక దేశమునకుఁ బలాయనమంత్రముఁ బఠించెను.

అప్పటికిని రాణి తన పట్టినపట్టు విడనాడలేదు. మణిమేఖలలో నెట్టి మార్పును గనఁబడలేదు. వ్యాఘ్రగ్రస్తగా నున్న దనువ్యాజమున మణిమేఖల యింకొక గదికి మార్పఁబడెను. ఆగది యడుగుభాగమున నినుపరేకులు పఱుపఁబడెను. వానిని వేఁడి చేసినచో నా యుష్ణతీవ్రతకుఁ దాళఁజాలక మణిమేఖల మరణించు నని పట్టమహిషి తలఁచెను. కాని మణిమేఖలాదైవసాహాయ్యమున నామె సురక్షితముగ నేయుండెను.

తన మాయోపాయము లన్నియు విఫలములు కాఁగా రాణి భగ్నహృదయ యయ్యెను. దైవికశక్తులెవ్వియో యామెను సంరక్షించుచున్న వనుసత్యమును రాణి గ్రహించి పశ్చాత్తాపముఁ జెందెను. తోడనే యామె మణిమేఖలను సమీపించి 'నా కుమారునియెడలి మమకారముచేతను, నతఁడు దుర్మరణము చెందెనే యను క్రోధముచేతను నే నీ దుష్కార్యములకుఁ బాల్పడితిని' అని నుడివి తన దుశ్చర్యలను వివరించి మన్నింపు మని కోరెను.

అంత మణిమేఖల యిట్లనెను. "ఇంకను మీరు మోహమును విడనాడలేకున్నారు. మీరు మీ కుమారుని శరీరమును

ప్రేమించుచున్నారా? లేక యతని యాత్మను ప్రేమించుచున్నారా? శరీరముపై మమకార మున్నచో నెందులకు దానిని దహన మొనర్చితిరి? ఆత్మను ప్రేమించినచో నతని పూర్వజన్మవృత్తాంతమును మీరు తెలిసికొన్నారా? అతఁడొకప్పుడు పాముకాటుచే మరణించెనుగదా! అందులకై మీరు నేఁడు విలపించుచున్నారా? అతఁడు పూర్వజన్మమున నా పతిదేవుఁడు...రాహులుఁడు.''

ఆశ్చర్యచకితయై పట్టమహిషి 'నీ భర్తయా!' అనెను. అప్పుడు మణిమేఖల యతని పూర్వజన్మవృత్తాంతము నామెకుఁ దెలియఁజేసెను. ఆత్మనుగుఱించి నుడువుచు నామె యిట్లనెను. ''అతని యాత్మను ప్రేమించినచో మీకు సర్వభూతసమదర్శిత యలవడియే యుండును. ఏల యన నాత్మ యొక్కటే. దాని నావరించియున్న దేహములు మాత్రము వివిధములు, విచ్ఛిన్నములును. కామక్రోధములు మానవుని పరమశత్రువులు. ఇందుల కొకదృష్టాంతమును జెప్పెదను. వినుఁడు.

''పూర్వ మొకకళాకారుఁడు తన భార్యశీలమును నిష్కారణముగ శంకించి యామెను జావ మోఁది గృహము నుండి వెడలఁగొట్టెను. అప్పు డామెకు మూడేండ్ల కుమారుఁడుండెను. అతనినిమాత్రము కళాకారుఁడు తన యొద్దనే యుంచుకొనెను. భర్తృక్రోధమును సహింపఁజాలక యామె యొక దూరస్థపట్టణమునకుఁ జని యట వేశ్యావృత్తి నవలం

బించెను. కొన్ని సంవత్సరములు గడచినపిదప నామె ధనికురాలయ్యెను. మహోన్నతమైన యొకసుందరమందిరమున నామె నివసింపఁజొచ్చెను. అయినను నామె తన వేశ్యావృత్తిని మానలేదు. ఇట్లుండ నొకనాఁడు దీర్ఘబాహుఁడైన యొక యువకుఁడామెను సమీపించెను. అతనిపై నామెకవ్యాజమైన ప్రేమ కలిగెను. 'ఎక్కడివాఁడవు? నీ పేరేమి?' అని యామె యతనిని బ్రశ్నింపఁగా నా యువకుఁడు తన కన్నకుమారుఁడే యని యామెకుఁ దెలియవచ్చెను. ఆమె దుఃఖమునకు మేరయే లేదు. నిస్సీమమైన తన దుఃఖభారము నెట్లో యడఁచుకొని యామె తన కుమారునికి తన వృత్తాంతము నంతయుఁ దెలియఁ బఱిచెను. తోడనే యా యువకుఁడు సౌధోపరిభాగమునుండి క్రిందికి దూకి విగతజీవుఁ డయ్యెను. ఆమెయుఁ బెరటిబావిలోఁ బడి ప్రాణములు వీడెను. కామక్రోధములవలన వాటిల్లు దుష్ఫలితము లివి.''

పట్టమహిషికి జ్ఞానోదయ మయ్యెను. ఆధ్యాత్మికతత్త్వములను దెలియఁజేసినమణిమేఖల కామె సాష్టాంగముగఁ బ్రణమిల్లెను. మణిమేఖల యామెను లేవనెత్తి రాణికి నమస్కరించి 'యత్తగారైనమీరు నాకు నమస్కరింపఁదగునా? అంతే కాదు. మీరు పట్టపురాణులు. నేను తమ భృత్యురాలను!' అనెను. తాను పన్నినమాయోపాయములను దలఁచికొని పట్టమహిషి కంటఁ దడిపెట్టి కోడలిని కౌఁగిలించుకొనెను. మణిమేఖలకూడ విలపింపఁ దొడఁగెను.

'ఏల దుఃఖించుచున్నా' వని పట్టమహిషి మణిమేఖలను ప్రశ్నించెను. అందుల కామె యిట్లనెను. ''అత్తగారైన మీ దగ్గఱ కాక యింక నే నెవరితో నా బాధను జెప్పుకొందును! మరణించిన నాహృదయేశ్వరునికై నేను దుఃఖించుచున్నాను. నా దుర్విధి యిట్లున్న దే యని విలపించుచున్నాను.''

''ఇందులో నీ దోష మేమి కలదు...అందఱు నిన్ను కీర్తించుచున్నారు గదా!''

''నా మనోవ్యథ ప్రజల కేమి తెలియును? యథార్థమునకు నేను సౌఖ్య మనుభవించుచున్నానా? లేదు. నేను చేసినపను లెట్టివో నాకుఁ దెలియును, ఆ బుద్ధదేవునికిఁ దెలియును. నాపై నున్నప్రేమకు ఫలితముగ నా ప్రియుఁడు తుదకు దుర్మరణమునకు లో నయ్యెను. ఎవరితోఁ జెప్పుకొందును నా తీరనివ్యథను? నా వ్యథను నా యీ కన్నీరే మీకు స్పష్టము సేయఁగలదు. మీకు మీకుమారుఁడు లేఁడు, నాకు నా పతిదేవుఁడు లేఁడు.''

దుఃఖస్వాంతులైనయా యిరువురు నొకరి నొకరు కౌఁగిలించుకొనిరి. అంతయు నిశ్శబ్దము.

మణిమేఖల కారాగృహమున బంధింపఁబడినవిషయము తెలిసినవెంటనే చిత్రాపతి యంతఃపురమునకుఁ జని పట్టమహిషిని సందర్శించెను. మాధవి సన్న్యసించుటయు, భిక్షాపాత్రమును జేత నిడికొని మణిమేఖల నగరవీథులవెంబడిఁ దిరుగుటయుఁ దనకు హృదయవిదారకములుగ నున్న వనియు,

సాటివారెల్లరు తన్నుఁజూచి పరిహసించుచున్నారనియు చిత్రాపతి రాణికిసవినయముగ విన్నవించెను. ఇంకను నామెరాణితో నిట్లనెను. 'నా తదనంతరము మా 'నూటయిరువదొక్కటి' వేశ్యాసంఘమునకు నాయకత్వము వహింపవలసినది మణిమేఖలయే. కాని యామెప్రవర్తనము మా కులాచారములకు విరుద్ధముగనున్నది. ఆమెవలననే యువరాజు మరణించెను. ప్రస్తుత మామె కారాగృహములో బంధింపఁబడుటవలన నా మణిమేఖలాదైవ మీ నగరమును గూడ నాశనము గావించునేమో యనుభయము నన్ను బాధించుచున్నది. కనుక మీరామెను విడుదల చేసి నా స్వాధీనము చేయుఁడు.'

రాణి పెదవులపై మందహాసము చిందులాడెను. మణిమేఖలను రప్పించి యామెసమక్షముననే పట్టమహిషి చిత్రాపతితో నిట్లు నుడివెను. 'మీ జీవితము లోపభూయిష్ఠమైనది. అసత్య మాడుట, మద్యము సేవించుట, జంతువులఁ జంపుట, మలినభావములతో మసలుట మున్నగునవి మీకు సుపరిచితములు. కనుక మణిమేఖల మీతో నివసింపఁజాలదు.'

చిత్రాపతి కేమియుఁదోఁపలేదు. ఆమె యాశ లన్నియు నిరాశలైనవి. ఇంతలో మణిమేఖలను వెదకికొనుచు మాధవి యంతఃపురమునకు విచ్చేసెను. ఆమెతోఁబాటు అఱవణ మునియు, సుతమతియుఁగూడ విచ్చేసిరి. మణిమేఖల బంధింపఁబడె ననువార్త వారి కందతికిని భయాందోళనహేతువయ్యెను.

రాణి వచ్చినమునికి సభ క్తికముగ నమస్కరించి యతని నర్హాసనముపైఁ గూర్చుండఁజేసెను. మాధవియు నొక యుచితాసనము నలంకరించెను. మీఁబోటి మహనీయుల సందర్శించి భాగ్యవంతురాల నైతి ననియు, విశ్వకల్యాణనిమి త్తమై తా మింకను చాలకాలము జీవింపవలయు ననియు రాణి ముని నుద్దేశించి నుడివెను.

అందుల కా తపస్వి యిట్లనెను. "అ స్తమించుసూర్యుని వలె నేను త్వరలో నిష్క్రమించెదను. పుట్టుట, పెరుఁగుట, గిట్టుట - అనువానిని పుట్టినవా రెల్లరు ననుభవింపవలసినదే. మనము గావించుకర్మలనుబట్టి మనకుఁ గష్టసుఖము లేర్పడు చున్నవి. *'నిదానముల' నన్నిటిని జక్కఁగా తెలిసికొన్నచో మానవుఁడు కష్టజలధినుండి గట్టెక్కఁగలఁడు. అవి తెలియ కున్నచో కష్టము లతనిని వెంటాడుచునే యుండును. మనో వాక్కాయకర్మలు నిష్కల్మషములుగ నుండవలయును. లేదేని మానవుఁడు జననమరణాది దుఃఖములకు లోనగు చుండును. ఉత్తరజన్మములో నతఁడు మృగమై పుట్టవచ్చును; దయ్యమై పుట్టవచ్చును. పంచశత్రువులను జయించుటయు, త్రికరణశుద్ధిగ నుండుటయు శ్రేయస్కరములు. వీని నాచ రించువారు మానవులుగానో, దేవతలుగానో జన్మించి సౌఖ్య మందుదురు.'

పిమ్మట నతవణముని నిజాశ్రమమునకు బయలు దేఱెను. అప్పుడు మణిమేఖల యతనికి నమస్కరించి తా

* ఇవి పండ్రెండుకలవు. అజ్ఞానము, ఆత్మస్తుతి మున్నగునవి నిదానములు.

నచ్చట నున్నచో జను లెల్లరు యువరాజును చంపినస్త్రీ యని తన్ను ద్వేషింతు రనియు, కాన తనకు సౌఖ్యము శూన్య మగు ననియు, శ్రావక దేశమున జన్మించినఆపుత్రునిఁ గలసికొని యాతనికిఁ బూర్వజన్మవృత్తాంతమును దెలుపవలయు ననియు, పిమ్మట వంజినగరమునకు వెడలి తన మాతృమూర్తి యైనకణ్ణకిని దర్శింపవలయు ననియు నామె నుడివెను. వివిధమత రహస్యములను గ్రహించినపిమ్మట మణిమేఖల మునియొద్ద బౌద్ధమతధర్మోపదేశమును బొందుటకు నిశ్చయించెను అందులకు మునియు నల్లె యనెను.

అందఱకడ సెలవు గైకొని మణిమేఖల గగనవీధి కెగిరి చక్రవాళగుడికిఁ జనెను. అప్పుడే భానుఁ డస్తంగతుఁ డగుచుండెను. చంపావతివిగ్రహమునకుఁ బ్రదక్షిణము చేసి యామె శ్రావక దేశమునందలి నాగపురమునకుఁ బయనమై పోయెను. మణిమేఖల యొకపుష్పోద్యానమున దిగెను. అచట ధర్మశ్రావకుఁ డనునొకముని ధర్మోపన్యాసము సేయుచుండెను. తన్నగరాధిపతి యగుపుణ్యరాజు కూడ నచటనే యుండెను. మణిమేఖల మధురమోహనమూర్తిని జూచి యాతఁడు ముగ్ధుఁ డయ్యెను. ఆమెచేత నున్నభిక్షాపాత్రయు నాతని కంటఁ బడెను. ఆమె యెవ్వరని యతఁడు విచారింపఁగ 'ఈమెయే మణిమేఖల. ధర్మబుద్ధియందును, సౌందర్యము నందును, దానశీలమందును జంబూద్వీపమున నీమెతో సాటివచ్చువా రెవ్వరును లేరు' అని మణిమేఖలను మున్నొక

తూరి పుహార్ పట్టణమునఁ జూచియుండినయొక ప్రముఖుఁడు నుడివెను.

పుణ్యరాజునకు నుడువ నలవికాని సంతోషము గలిగి యాతఁడు మణిమేఖలను సమీపించెను. అంత నామె 'ఓరాజా! పూర్వజన్మమున నీయొద్ద నున్న భిక్షాపాత్రమే ప్రస్తుతము నా యొద్ద నున్నది. అప్పటి నీపేరు ఆపుత్రుఁడు. శాలి నిన్ను విడిచి పెట్టఁగా గోవుచే నీవు రక్షింపఁబడితివి !' అని నుడివెను. పుణ్యరాజునకుఁ దన పూర్వజన్మవృత్తాంతమును దెలిసికొనవలయు ననుకుతూహలము గలిగెను. తన యభిలాష నాతఁడు మణిమేఖలకు వ్యక్తము చేయఁగా నామెయు సంతసించి యతనిని మణిపల్లవమునకు విచ్చేయు మని కోరెను. ఆమె ముమ్ముందుగ నా ద్వీపమున కెగిరిపోయెను.

పిదప పుణ్యరాజు మణిమేఖల చెప్పినవిషయములను దన పెంపుడుతల్లికిఁ దెలియఁ జెప్పెను. అతఁడు గోగర్భము నుండి జన్మించినయుదంతమును, రా జగుటకు సహాయపడిన పరిస్థితులను నామె నుడువఁగా పుణ్యరాజు రాజ్యమును త్యజించి సన్న్యాసాశ్రమమును స్వీకరింప నెంచెను. కాని మంత్రి యగుజనమిత్రుఁడు చేతులు జోడించి 'ప్రభూ! దుర్భరక్షామము చే నీ దేశమునఁ బండ్రెండుసంవత్సరములు ప్రజలు నానాబాధలుపడిరి. క్షుద్బాధను బాపుకొనునిమిత్తము తల్లులు తమ బిడ్డలనే భక్షించిరి! కాని తమరాకతో నట్టి విపరీతవిపత్కరపరిస్థితు లన్నియు మటుమాయము లైనవి.

సకాలవర్షములు కురియుచున్నవి, అవని యంతయు సస్య శ్యామలముగ నున్నది. తా మిప్పుడు సన్న్యసించినచో మరల ప్రజలు బాధలకు గుఱి యగుదురు. కనుక మీరు సన్న్యసింపఁ జనదు. మీఁదు మిక్కిలి యిది బౌద్ధధర్మము గూడఁ గాదు' అని విన్నవించెను.

మంత్రిపలుకు వినినపుణ్యరాజు సన్న్యాసస్వీకర ణాభిలాషకు స్వస్తి చెప్పెను. కాని మణిపల్లవమునందలి బుద్ధపీఠమును దర్శింపవలయు ననుకోరిక యాతనిని వెంటాడ సాగెను తాను తిరిగి వచ్చునంతవఱకును రాజ్యపాలనమును జూచుకొను మని నుడివి, మంత్రియొద్ద సెలవు తీసికొని పుణ్య రాజు మణిపల్లవమునకుఁ బ్రయాణమై వెడలెను.

పుణ్యరాజు మణిపల్లవము జేరి బుద్ధపీఠమును దర్శించి దానికి ముమ్మారుప్రదక్షిణము గావించెను. తోడనే యాతనికిఁ బూర్వ జన్మవృత్తాంతము తెలియవచ్చెను. మణిమేఖలకూడ నప్పుడచ టనే యుండెను. ఇంతలో ద్వీపతిలక ప్రత్యక్షమై అపుత్రుని భౌతికశరీరము సమాధి చేయఁబడినప్రదేశమును వారికిఁ జూపి పుణ్యరాజు నుద్దేశించి యిట్లనెను. ''ఆనాఁడు— నౌకాభంగము జరగిననాఁడు—జీవితముపై నిరాశ చెంది నీవు ప్రాణములు వీడితివి. నీతోఁబాటు ప్రయాణము సలుపు చున్న యీ యెనిమిదిమంది సెట్టివర్తకులును నిన్నుఁ గానక చింతాక్రాంతులై నీకై యంతట వెదకిరి. తుదకు మరణించి యున్న నిన్నుఁ గాంచిరి. తమ యశ్రద్ధవలనఁ గదా నీకుఁ

ప్రాణహాని సంభవించిన దని తలఁచి యా వర్తకు లెనమండుగురు నన్నపానాదులు విసర్జించి మరణించిరి. వారు కూడ నిచటనే సమాధి గావింపఁబడిరి. తొందరపడి నీవు చేసిన యకార్యమునకు ఫలితముగ వీరును మరణించిరి.''

అనంతరము సముద్రమువలన కావేరీపట్టణము ధ్వంసము కాఁబడినవృత్తాంతమును ద్వీపతిలక మణిమేఖల కిట్లు వివరించెను. ''నాగదేశపురాకుమార్తె యైన పీలివళై తనకుమారునితోఁ గూడి బుద్ధపీఠమును సందర్శింప మణిపల్లవమున కేతెంచెను. అప్పు డా ద్వీపమునకు కంబళసెట్టి యను నొక వర్తకుని నావ వచ్చియుండెను. ఆమె యా సెట్టిని కలసికొని రాకుమారుని సురక్షితముగఁ దీసికొని వెళ్లి మహారాజు వశము సేయు మని యాతనిఁ గోరెను. అటులనే యని యతఁడు రాకొమరునినావయం దెక్కించుకొని ప్రయాణము సాగించెను. త్రోవలో నిశీథసమయమున నావ బ్రద్దలై పోయెను. పలువురు మరణించిరి. రాకుమారునిజాఁడ తెలియరాలేదు. ఈ విషాద సంఘటనమును వినినచోళమహీపతి వ్యాకులచిత్తుఁ డయ్యెను. నేల నాలుగుమూలలు గాలించినను కుమారునిజాడ తెలియరాక పోవుటచే నతనివిచార మధిక మయ్యెను. ఇట్లుండఁగ నింద్రోత్సవము సమీపించెను. చింతాక్రాంతుఁ డైన రాజు దానిని విస్మరించెను. అప్పుడు మణిమేఖలాదైవము కావేరీపట్టణము త్వరలో నాశన మగు నని యాతనిని హెచ్చరించెను. అటులనే యా పట్టణము ధ్వంసమై పోయెను. రాజుమాత్రి

మెచటికో పోయెను. అఱవణమునియు, నీ తల్లియు వంజినగ
రమునకు సురక్షితముగఁ జనిరి. అఱవణముని యింకను గొన్ని
వివరములు నీకు తెలియఁజేయఁగలఁడు.''

పిమ్మట ద్వీపతిలక యదృశ్య యయ్యెను.

పుణ్యరాజు తన సమాధిని ద్రవ్వి చూడఁగ నాతనికిఁ
గొన్ని యెముకలు మాత్ర మగపడెను. వానిని జూచినతోడనే
యతఁడు సన్న్యసింప నభిలషించెను. అట్లొనర్చిన ధర్మవిరుద్ధ
ముగ నతఁడు ప్రవర్తించిన ట్లగు ననియు, ప్రజను బాధించుట
న్యాయము గా దనియు మణిమేఖల యతనికి ధర్మోపదేశము
గావించెను. ఆమెయొద్ద సెలవు తీసికొని పుణ్యరాజు తన
దేశమునకు మఱలిపోయెను.

తన మాతృమూర్తి యైనకణ్ణకిని దర్శింపవలయు నను
కుతూహలము పొడమఁగా మణిమేఖల వంజినగరమునకుఁ
జనెను. ఆమె కణ్ణకీ దేవ్యాలయమునకుఁ బోయి దేవిని
స్తుతించెను. 'భర్తృమరణానంతరము సహగమన మాచ
రింపకయు లేక వెనువెంటనే మరణింపకయుఁ గోపావేశముతో
నెందులకు మధురను దగ్ధము చేసితివి? కారణము చెప్పుము'-
అని యామె ప్రార్థించెను. కణ్ణకి ప్రత్యక్షమై ''నేను మధురను
నాశము గావింప యత్నించుచుండఁగ మధురను సంరక్షించు
దైవము పురాతకృతకర్మల ననుసరించియే యుత్తరజన్మమున
శుభాశుభము లేర్పడు నని నుడివెను'' అని చెప్పెను.
మధురనాయిక నుడివినపూర్వజన్మగాథను గూడ కణ్ణకి
మణిమేఖల కపుడు తెలియఁజేసెను.

"పూర్వము కళింగ దేశమండలి సింహపురాధీశ్వరుఁడై నవసువునకును, కపిలపురాధిపతి యగుకుమరుఁ డనువానికిని తీఱని వైరముండెను. ఇట్లుండఁగ నొకనాఁడు సింహపుర విపణివీధిలో తిరుగుచున్న సంగముఁ డనువర్తకుని వసురాజునకుఁ జెలికాఁ డగుభరతుఁడు చూచెను. వారిరువురును బద్ధవిరోధులు సమయము లభించె నని తలఁచిభరతుఁడు రాజుతోఁ గపిలనగరాధీశ్వరుఁడు పంపినరహస్యవార్తాహరుఁ డొకఁడు మననగరమునకు వచ్చియున్నాఁ డని నుడివి సంగముని నిష్కారణముగ చంపించెను. సంగముని దుర్మరణమును విని శోకార్ణవహృదయ యైన యాతనిభార్య నిలి 'మాకు తీఱని దుఃఖము గలిగించినవారు మావలె దుర్భరదుఃఖమును పొందుదురుగాక!' అని శపించి మరణించెను. ఆ భరతుఁడే కోవలుఁడు—నా భర్త, నీ తండ్రి."

ఇంకను కణ్ణకి యిట్లనెను.

"మధురనాయిక మాటలనుగూడ పెడచెవినిబెట్టి నేను కోపావేశముతో మధురను కాల్చివేసితిని. అయినను పురాకృతకర్మలకు ఫలితముగ మేము (కణ్ణకీకోవలులు) దేవలోకమునకు పోఁగలిగితిమి. కాని మరల మగధదేశమున మేము జన్మింప నున్నాము. అప్పుడు బౌద్ధధర్మముల నన్నిటిని గ్రహించి చరితార్థుల మగుదుము. కావేరీపట్టణ మండలి యింద్రుని సప్తవిహారములందు పూజించిన భాగ్యవిశేష మే మాకీ సద్గతి లభ్య మగుటకు హేతువు. నీ విప్పుడు వివిధ

మతములందలి ధర్మములను లెస్సగ గ్రహింపుము. అప్పుడు బౌద్ధధర్మములందలి వైశిష్ట్యము నీకే తెలియఁగలదు. పిమ్మట అఱవణముని నాశ్రయించి త్రిపీరకముల నభ్యసింపుము. వాని ననుసరించి జీవింప యత్నింపుము. ఇంకొక విషయము. యువతి వైననీకు మతాచార్యు లెవ్వరును ధర్మోపదేశము చేయ నిచ్చగింపరు. కనుక వృద్ధవేషము దాల్చి వారి నాశ్రయింపుము. అందులకు మణిమేఖలాదైవము ప్రసాదించినమంత్రము ముపయోగించును.''

మణిమేఖల తన కృతజ్ఞతను దెలియఁబఱచినపిదప కణ్ణకి తన యాలయములోనికిఁ జనెను.

కణ్ణకియాదేశానుసారము వృద్ధవేషము దాల్చి తొలుత మణిమేఖల బౌద్ధమతేతరుల యాశ్రమములకుఁ జనెను. ఆయా మతాచార్యుల ధర్మోపదేశములను శ్రద్ధగ వినెను. కాని యామెకు సంతృప్తి కలుగలేదు. పిమ్మట బౌద్ధాశ్రమములను సందర్శింపసాగెను. ఒకానొక యాశ్రమమున కోవలుని తండ్రి యగుమహాసత్త్వుఁడు కనఁబడెను. మణిమేఖలను జూచి మిక్కిలి సంతసించి, కోవలుని మరణానంతరము తాను సర్వస్వమును త్యజించి సన్న్యాసాశ్రమము స్వీకరించితి ననియు, అఱవణముని కాంచననగరమున నున్నాఁడనియు, దుర్భరక్షామబాధచే కలకలలాడు కాంచీనగరము కళావిహీన మై యున్న దనియు మహాసత్త్వుఁడు నుడివెను. అతని యభిమతము ననుసరించి యామె భిక్షాపాత్రను చేత నిడికొని క్షామనివారణార్థము కాంచీనగరమునకుఁ బ్రయాణ మయ్యెను.

కాంచీనగరమును జూచినంతనే మణిమేఖల విషణ్ణ హృదయ యయ్యెను. తన్నగరమునకుఁ బ్రదక్షిణ మొనరించి, నగరమధ్యభాగమున నున్న బుద్ధాలయమున శాక్యర్షి ని సేవించి యంతఃపురమునకు సమీపమున నున్న సుందరోద్యానమునకుఁ జనెను. అట నున్న కావలివాండ్రు మణిమేఖలను గాంచి రాచనగరునకుఁ బోయి యామెరాకను రాజునకుఁ దెలియఁజేసిరి. అతఁడు మిక్కిలి సంతసించి మంత్రిపురోహిత సమేతుఁడై మణిమేఖల నాహ్వానించుటకు సుందరోద్యానమునకు దారి తీసెను.

క్షుద్బాధాపీడితు లైన ప్రజ లప్పుడే యామెను చుట్టు ముట్టిరి. ఇంతలో రాజు మణిమేఖలను సమీపించి ''అమ్మా! నే నధర్మమార్గమున సంచరించిన హేతువువలననో, లేక మునులు తమ విధ్యుక్తధర్మములను సక్రమముగ నిర్వర్తింపని కారణమువలననో, లేక స్త్రీలు నైతికముగఁ బతిసము సెందుటవలననో—మతెందులకో కాని రాజ్యమున వానలు కురియుట లేదు. చాలమంది యాఁకలిమంటల కాహుతియై పోయిరి. ఈ నగర దేవత నాకు స్వప్నమున సాక్షాత్కరించి మణిమేఖల యనుసాధ్వి దేశమును సుభిక్షముగఁ జేయు నని నుడివెను. నీ రాకను మేము వేయికన్నులతో నెదురుచూచు చున్నాము'' అనెను.

మణిమేఖల మణిపల్లవమునందలి బుద్ధపీఠమువంటి యొక పీఠమును స్థాపింపఁదలఁచి తన యాశయమును

రాజున కెఱిఁగించెను. అటులనే యొక బుద్ధపీఠ మా యుద్యాన వనమున నిర్మింపఁబడెను. మణిమేఖలాదైవమునకును, ద్వీపతిలకకును గూడ నాలయములు నిర్మితము లయ్యెను. పిమ్మట మణిమేఖల యమృతసురభిసాహాయ్యమున క్షుధార్తుల నందఱిని సంతృప్తహృదయులఁ గావించెను. ఇట్లామె నిరతాన్నదానము సేయుచుండఁగా గగనవీధియందు నీలమేఘములు క్రమ్ముకొని కుంభవృష్టిగా వర్షము కురిసెను. తటాకము లన్నియు జలార్ణవము లయ్యెను. అంతటితో క్షామము నశించిపోయెను.

అటుపిమ్మట మణిమేఖల యఱవణమునిని సందర్శించు నభిలాషతో బయలుదేఱెను. ఆమెను జూడఁగోరి యా ముని మాధవీసుతమతులతోఁ గూడి మణిమేఖలయొద్దకు వచ్చెను. వచ్చిన యామునిని సభక్తికముగ సేవించి తాను బౌద్ధమతేతరుల ధర్మోపన్యాసములను విని, ఆయామతముల నిజస్వరూపమును తెలిసికొంటి నని మణిమేఖల నుడివెను

కావేరీపట్టణము ధ్వంస మయినయుదంతమును దెలిపి అఱవణముని 'వివిధమతధర్మములనుగుఱించి నీయభిప్రాయ మేమి ?' అని మణిమేఖలను ప్రశ్నించెను. అన్ని మతములును సత్యాన్వేషణమే సలుపుచున్న వనియు, కాని యవి భేదాభిప్రాయములకును, కలహములకును గారణభూతము లగుచున్న వనియు, తథాగతుని ధర్మోపదేశములే చూడఁగ మహోత్కృష్టములుగ నున్న వనియు మణిమేఖల నుడివెను.

అంత నఱవణముని యిట్లనెను.

"తొలుదొలుత దయ యన నేమో తెలిసికొనవల యును. ధర్మస్వరూపమునుగూర్చియు, మానవులమధ్య నున్న సన్నిహితత్వమునుగూర్చియు, చేతనాచేతనములనుగూర్చియు లెస్సగఁ దెలిసికొనవలయును.

సర్వవిషయములకును ధర్మమే ప్రాతిపదికగా నుండ వలయును. ధర్మ మనఁగ న్యాయము. తథాగతుఁడు ధర్మ స్వరూపుఁడు అతఁ డీ ప్రపంచమునకు—అనఁగా సంఘ మునకు—ధర్మోపదేశము గావించును. కావుననే బౌద్ధుల కైనమనకు బుద్ధుఁడు, సంఘము, ధర్మము శరణ్యము లగు చున్నవి. శాక్యర్షి యగుబుద్ధుఁడు ధర్మప్రవర్తకుఁడు. చీకు చింతలు, జంతుబలులు, అర్థరహితము లైనపూజాపురస్కార ములు, విరుద్ధాచారములు—మున్నగునవి కరడు గట్టుకొని పోయియున్నయీదుర్దినములలో గౌతముఁ డీ ప్రపంచమునం దుదయించెను. బ్రహ్మానందపీఠ మగుతుషితస్వర్గమును విడ నాడి దుఃఖభూయిష్ఠ మైనయీ ప్రపంచమునం దవతరించెను. అపమార్గముల సంచరించుచున్నమానవాళిని సంరక్షించు నిమిత్తమై యతఁ డవతార మెత్తెను. బోధివృక్షచ్ఛాయల యం దాసీనుఁడై, మనోవాక్కర్మభిః కల్మషరహితుఁడై యతఁడుమారుని జయించినాఁడు, ఇంద్రియములను జయించి నాఁడు. మారజినుఁ డగుటయే గాక లోకజినుఁడు కూడ నై నాఁడు. కావుననే యాతనికి జినేంద్రుఁ డనుసార్థకనామము కలిగెను.

జినేంద్రుఁడు సత్యచతుష్టయమును గనుగొని వానిని లోకమునకు బోధించెను. ఆ నాలుగుసత్యము లివి — ఈ ప్రపంచము దుఃఖభూయిష్ఠ మయినది. మోహమే దుఃఖమునకు మూలకారణము. ఈ మోహమును జయించిన నాఁడు మానవుఁడు దుఃఖమును గూడ జయింపఁగలఁడు. ఈ మూఁడింటికంటెను మహోత్కృష్టమైనసత్యము నాలుగవది. అష్టాంగమార్గము ననుసరించి నిర్వాణమును బడయుట. అనఁగా జననమరణములనుండి విముక్తి పొందుట. ఇఁక కర్మసిద్ధాంతము సత్యసంపూర్ణము పురాకృతకర్మల ననుసరించియే యుత్తరజన్మమున మానవుఁడు శుభాశుభములు పొందుచున్నాఁడు. లోభమును విడనాడుటయు, ప్రేమ నలవఱుచుకొనుటయు, విజ్ఞానము నార్జించుటయు సత్కర్మకు ముఖ్యహేతువులు. వీనిని సాధించి జీవితము గడపినచో జీవితము దుఃఖభూయిష్ఠముగ నుండదు.''

పిమ్మట నఱవణమునిసమ్మతిని బడసి మణిమేఖల భిక్షుకివేషమును గైకొనెను. తన యావజ్జీవితమును బౌద్ధధర్మనిర్వాహణమునకు వినియోగింప నామె నిశ్చయించెను. జననమరణాదుల కతీతమైననిర్వాణమును ప్రధానలక్ష్యముగ నుంచుకొని మణిమేఖల—యా బౌద్ధభిక్షుకి — గంభీరస్వనమున నిట్లనెను.

''బుద్ధం శరణం గచ్ఛామి.
సంఘం శరణం గచ్ఛామి.
ధర్మం శరణం గచ్ఛామి.''

— —

# మంజీరమహిమ

## (సిలప్పదికారమ్)

తమిళపంచకావ్యములలో ద్వితీయమైనను నిది యద్వి
తీయకావ్య మని చెప్పఁదగును. ఈ యుద్గ్రంథమును
ఇళంగో అడిగళ్ (క్రీ. శ. 100-130) అనురాజకవి సంత
రించెను. ఇతఁడు కరికాలచోళుని మనుమఁడు; చేరరా జగు
సెంగుట్టువన్ తమ్ముఁడు. ఒకప్పుడు కార్తాంతికులు కొందఱు
సెంగుట్టువన్‌కంటెను ఇళంగో దిశాష్టకము నావరించు
యశస్సు సముపార్జించుసమ్రాట్టగు నని నుడివిరి. కావున
భ్రాతృగౌరవముచే రాజ్యరమను చేపట్టక యా మహానీ
యుఁడు సన్న్యాసమును స్వీకరించెను. ఇతఁడు జైన
మతావలంబకుఁడు. కావుననే యితనికావ్య మగు సిలప్పది
కారము జైనమతాచారముల వైశిష్ట్యమును వివరించు ప్రశస్త
ప్రశస్తికావ్యముగ నొప్పారుచున్నది. ఈ కావ్య మానాఁటి
సామాజికజీవనమును ప్రతిబింబించు మేలిదర్పణము. నాటక
ముగ సంతరింపఁబడిన యీ పద్యగ్రంథమునకు 'ఇయల్,
ఇశై నాటకపొరుళ్ తొడర్‌నిలై శెయ్యుళ్' అనియు
'నాటకకాప్పియం' అనియు నామాంతరము లేర్పడినవి.

సిలంబు (అందె) అదికారం (ప్రభావము) అనుమాటల
కలయికచే 'సిలప్పదికారం' శబ్దరూప మేర్పడినది. ఈ
హేతువుచే నేను దీనికి 'మంజీరమహిమ' యని పేరిడితిని.
ఈ కావ్యమున 4,957 పఙ్క్తులు కలవు.

—*—

## ఈ కథయందలి పాత్రలు

కోవలుఁడు (కోవలన్)
మహాసత్త్వుఁడు (మాశాత్తువాన్)
మహానాయకుఁడు (మానాయకన్)
కరికాలచోళుఁడు
నెడుంజెలియన్
నెంగుట్టువన్

* * *

కణ్ణకి
మాధవి
కౌంతి
మణిమేఖల
చిత్రాపతి
మాధురి (మాదిరి)
కోప్పెరుందేవి
దేవంతి

-- o

## ౨

పూర్వము దక్షిణాపథమున మూఁడు తమిళరాజ్యములు వర్ధిల్లెను. వానిలోఁ బేర్కొనఁదగినది చోళరాజ్యము. అది ప్రకృతికాంతకు సుందరారామము సకలసస్యములకు నిలయము. సర్వసంపదలకు నెలవు. అరఁటితోఁటలకును, చెఱకుతోఁటలకును నది పుట్టినిల్లు. ఆ రాజ్యమునం దెచ్చటఁ జూచినను బంటకాలువలు కన్నులపండువు గొలుపుచుండును. కవేరుని తపఃఫలమునను, అగస్త్యుని యనుగ్రహమునను బ్రభవ మొందిన కావేరీనదీజలములచే నా కాలువలు సంవర్ధితములు కనుకనే చోళమండలము దక్షిణభారతధాన్యాగారమని వార్త కెక్కినది.

చోళమహీపతులకుఁ దొలుదొలుత నొరయూ రను పట్టణము రాజధానిగ నుండెను. కాని చోళవంశప్రదీపకుఁ డగుకరికాలచోళుని పరిపాలనాకాలమునందుఁ గావేరీముఖద్వారమున నున్న కావేరీ పూంపట్టణము* చోళరాజ్యమునకు ముఖ్యపట్టణ మయ్యెను. దానికి పుహాර් అనునామాంతరము

---

* ఈ పట్టణమునకు సంబంధించినయైతిహ్య మొకటి కలదు.

పూర్వము కవేరుఁ డనురాజు చోళమండలమును పాలించుచుండెను అతఁడు తనరాజ్యమును సస్యశ్యామలముగఁ జేయఁ దలఁచెను. కాని యుత్తరదేశమునఁ బ్రవహించునట్టి జీవనదులవలె దక్షిణాపథమునం దొక్క జీవనదియు లేకుండుటచే నతఁడు మిక్కిలి విచారించి మంత్రులతో సమాలోచనము గావించి శివసముద్ర మనుచోటఁ దపస్సు చేయఁదొడఁగెను. అందుచే నతని కుమారుఁ డగుకంటముఁడు రాజ్యమునకు వచ్చెను.

గలదు. వర్తకవాణిజ్యముల కది కేంద్రస్థానము. వైదేశిక వాణిజ్యమునకును బేరొందిన రేవుపట్టణ మది.

తన్నగరము మరువూర్ పాక్కమనియు, పట్టినపాక్కమనియు రెండు భాగములుగ విభజింపఁ బడియుండెను. మరువూర్ పాక్కమునందు వైదేశికవర్తకుల రమ్యాహర్మ్యములును, కమ్మరులు కుమ్మరులు మున్నగుపారిశ్రామికుల గృహములును, విపణివీథులును గలవు. ముత్యములు, బంగారము, మణులు, పట్టుపుట్టములు, సుగంధద్రవ్యములు, వివిధము లగుధాన్యములు, రకరకాల పువ్వులు—మొదలగునవి యా యంగడివీథులందు సమృద్ధిగ దొరకుచుండును. పుహార్ పురప్రముఖులు నివసించుప్రదేశమే పట్టినపాక్కం. రాజవంశీయులు, బ్రాహ్మణులు, క్షత్రియులు, వర్తకులు,

---

కంటముఁడు తంత్రివలెఁ దపస్సు చేయుక, కులగురు వగునగస్త్య మహర్షి ని సందర్శించి "స్వామి! తమిళవ్యాకరణమును ప్రసాదించి తమిళ భాషను పోషించినట్లుగా జీవనదినిగూడ నొసఁగి తమిళదేశమును సస్యశ్యామలముగఁ జేయుదురుగాక!" అని విన్నవించెను. అగస్త్యుఁ డందులకు సమ్మతించి తన కమండలమును క్రుమ్మరింపఁగా నందలి పావనోదక మొక సారంగమున నింకిపోయెను. కొంతసేపటి కా సారంగమునకు సమీపమున జలజల నీరు ప్రవహింపసాఁగెను అంత నగస్త్యుఁ డా నీటిజాలును జూచి యిట్లనెను. "కవేరుఁడు తపస్సు చేయుచున్నశివసముద్రమునొద్ద నీవు సముద్రమునఁ గలియుదువుగాక! నిన్నుఁ గావేరి యని జనులు వ్యవహరింతురుగాక! నీ ముఖద్వారమున నొక గొప్పపట్టణము వర్ధిల్లఁగలదు." అటులనే కావేరీముఖద్వారమున గొప్ప పట్టణ మొకటి వెలసెను. అదియే కావేరీ పూంపట్టణము.

కర్షకులు, వైశ్యులు, భోగస్త్రీలు మున్నగువారీ భాగము నందు వేర్వేఱు వీథులందు నివసించుచుందురు. ఆ రెండు భాగములకు నడుమనున్న ప్రదేశమున సంత జరగుచుండును. విక్రేతలయుఁ, గొనుగోలుదారులయుఁ గేకలతో నా సంత మాఱు మ్రోఁగుచుండును.

శ్రీమంతు లయినవణిగ్వరులకుఁ గాణాచి యగునా కావేరీపట్టణమున మహానాయకుఁ డనునొకవణిక్ప్రముఖుఁడు గలఁడు. అతఁడు దాననిరతుఁడు. ధనికుఁడు దానకర్ణుఁ డగుచో దరిద్రులపాలిటి కతఁడు కల్పతరువును బోలినవాఁ డగును గదా! మహానాయకుఁ డట్టి దానశీలుఁడు!

అతని కొక కుమార్తె కలదు. ఆ శాలికపేరు కణ్ణకి. సుగుణాలవాల యైనయామె సచ్ఛీల. ఆమె యంతస్సౌంద ర్యమువలె నామె బాహ్యసౌందర్యము గూడ నిరుపమానము. ఆ యందాలబరిణెను జూచినదే తడవుగ సారసాక్షులు సయి తము ముగ్ధ లగుచుండెడివారు. కణ్ణకి సౌశీల్యమున కచ్చెరు వొందుచు నామె యాదర్శనుహిళ యగు నని యెల్లరును తల పోయుచుండిరి. ఆమె కప్పటికిఁ బండ్రెండు సంవత్సరములు నిండెను తలిదండ్రు లామెకు వివాహముఁ జేయ నిశ్చయించు కొని వరాన్వేషణ సలుపసాగిరి.

తన్నగరమునందు మహాసత్త్వుఁ డను మఱియొక వణిక్ప్రముఖుఁడు కలఁడు అతఁ డా పట్టణవర్తకశ్రేష్ఠులలో నెన్నఁదగినవాఁడు. సదాచారసంపన్నుఁ డతఁడు. అతని

దానశీలమునకు ముగ్ధుఁడై కరికాళ చోళుఁ డతనిని మిక్కిలి గౌరవించుచుండెను. గ్రామమునకు నడిగడ్డ నున్న మహావృక్షమువలె మహాసత్తువాని న్యాయార్జితవిత్తము పలువురు బీదసాదుల కుపయోగపడుచుండెడిది. అంత ధనికుఁ డయ్యు నాతఁడు నిగర్వి. పెద్దలయెడ నాతనికిఁ గలగౌరవ మపారము.

మహాసత్తువానకుఁ గోవలుఁ డనునొక కుమారు డుండెను. తండ్రిని మించినబిడ్డఁ డతఁడు. పురప్రముఖు లాతనియెడ నంతు లేనివాత్సల్యముఁ బ్రకటించుచుండిరి. వ్యాపార రహస్యములయందే కాక సంగీతశాస్త్రమునందును గోవలుఁడు ధురీణుఁడు. అతఁడు ప్రసిద్ధి వహించినవైణికుఁడు. భరతశాస్త్రముగూడ నతనికి సుపరిచితమై యుండెను. అగుట సంగీతనాట్యాచార్యుల యాదరాభిమానములను గూడ నాతఁడు చూఱగొనెను. అప్పటి కతఁడు పదునాఱేండ్ల వయసువాఁడు. అతని మనోహరాకృతిని గాంచి, 'కుమారస్వామి భూమిపై నవతరించెను కాఁబోలు' నని యాతని బంధుమిత్రాదులు తలంచుచుండిరి.

దినములు గడచుచుండెను. మహానాయకుఁడు కణ్ణకి వివాహవిషయమై తొందరపడసాగెను. కోవలుఁడే తన తనయకుఁ దగినవరుఁ డని నిశ్చయించి మహానాయకుఁ డొకనాఁడు మహాసత్తువానితోఁ దన మనోభీష్టమును వ్యక్త మొనర్చెను. అందులకు మహాసత్తువాఁడును మిక్కిలి సంతస మంది కణ్ణకియే తన కుమారునకుఁ దగినసహచరి యని యను

గొనెను. ఈ విషయమును కణ్ణకీకోవలులకుఁ దెలియఁజేసి, వారిసమ్మతినిగూడఁ బడయుట లెస్సగ నుండు నని మహాసత్త్వుఁడు నుడివెను. మహానాయకుఁడు సహర్షముగ నటులనే యనెను.

అంతకుమున్నే కణ్ణకీకోవలులు తమ నేత్రముల సహాయమున ప్రేయసీప్రియు లయిరి. ఉభయులకును గాఢానురాగ మేర్పడెను. కాని తమ జననీజనకులతో మాత్రము తమ ప్రేమోదంతమును వారిరువురును దెలుపక మిన్నకుండిరి. కణ్ణకీకోవలులకు వివాహము జరగ నున్న దని బంధుమిత్రాదులనుచుండఁగా నా మాటలు విని యా ప్రేయసీప్రియులు మిక్కిలి సంతసించిరి.

తమ సంతానములు వివాహమున కంగీకరించుటవలనను, బంధువు లెల్లరు శుభస్య శీఘ్ర మ్మనుటవలనను మహాసత్త్వమహానాయకులు వియ్యమందుటకుఁ గృతనిశ్చయులయిరి. వారి వివాహమునకు సుముహూర్తము గూడ నిర్ణయింపఁబడెను. ఆనాఁటి సాంఘికాచారమున కనుగుణముగఁ బట్టుపుట్టములు ధరించిన బాలికలు కొందఱు మదపుటేనుఁగు పై నధివసించి నగరమున నూరేగుచుఁ బురప్రముఖులను కణ్ణకీకోవలుల వివాహమున కాహ్వానించిరి. శుభముహూర్తమున శాస్త్రోక్తముగ కణ్ణకీకోవలులు దంపతు లయిరి. వారి వైవాహికోత్సవము మహావైభవముగ జరగెను. తద్వైభవమును గాంచి కావేరీపట్టణవాసులే దిగ్భ్రమ చెందిరి! ఆ శుభసమయమున మంగళతూర్యారావములతోడను, ప్రమదల

వేడుక పాటలతోడను పెండ్లిపందిరి ప్రతిధ్వనించెను. వివాహ మహోత్సవమునకు విజయంచేసినకరికాలచోళ రాజేంద్ర ప్రభృతు లా వధూవరుల నాశీర్వదించిరి. పుణ్యాంగనలు వారికి మంగళారతులు పట్టుచు 'మీ దంపతు లిరువురును పుష్పసౌరభములవలె పాయనిజంటయై యన్యోన్యముగఁ బది కాలములపాటు సుఖముగ నివసింతురుగాక !' యని దీవించి వారిపైఁ బ్రసూనములను జల్లిరి.

వివాహము జరిగినకొన్నినాళ్లకుఁ బిమ్మట కణ్ణకి కాపురమునకు వచ్చెను. ఆమెయందుఁ గోవలుఁడు బద్ధానురాగుఁడై యుండెను చిలుకయు గోరువంకవలెఁ గలసి మెలసి మెలఁగుచు వారు సాంసారికజీవనము సలుపుచు సౌఖ్యశ్రీ లనుభవించుచుండిరి. కణ్ణకి తనయత్తమామలను గౌరవించి వారికిఁ బరిచర్య లొనర్చుచు వారిమెప్పును బడసెను. అటులనే బంధుమిత్రాదులను, నతిథివ్రాతమును సగౌరవముగఁ జూచుచు కణ్ణ యందఱప్రేమానురాగములను జూఱగొనెను. 'ఈమె హైందవనారీమణి. పుట్టినింటికిని, మెట్టినింటికిని గౌరవముఁ దెచ్చు మహిళామణి.' అని యామెసత్ప్రవర్తనమును దిలకించిన వా రెల్లరు నుడువుచుండిరి.

ఇటుల కణ్ణకీకోవలుల సాంసారికజీవితము సౌఖ్యావహముగఁ గొంతకాలము మహాసత్త్వనిమందిరమున గడచెను. కాని వంశానుగతమైనయాచారము నతిక్రమింపఁజాలక యతఁడు తన కుమారుని నొక ప్రత్యేకభవనమున

నివసింపఁజేసెను. అట్లొనర్చిన నూతనదంపతులమధ్య సన్నిహితసంబంధము సంఘటిల్లు ననియు, వారి ప్రేమవల్లరి పెద్దలవలని భయమునకుఁ బాల్పడకుండ నిరాటంకముగఁ బై కెగఁబ్రాకు ననియు మహాసత్త్వునియభిమతము.

అత్తమామలసహాయము లేకున్నను గణ్ణకి తన సాంసారికధర్మములను సక్రమముగ నిర్వర్తించుచుండెను. ఆమె సాధుపుంగవులకు సభక్తికముగ సపర్యలు సలుప సాగెను. బ్రాహ్మణుల నాదరింపఁజొచ్చెను. బంధుమిత్రాదులను ప్రేమపురస్సరముగ గౌరవించుచుండెను. భర్తృమనఃప్రవృత్తి ననుసరించి ప్రవర్తించుచు కోవలుని ప్రేమానురాగముల నామె చూఱగొనెను. ఆమెయే యతనికి సర్వస్వ మనిపించెను. ఆమెను విడనాడి యతఁడు క్షణకాలమైన నుండఁజాలఁడు. ఆమె యొయ్యారపునడలు రాయంచ నడలను తిరస్కరించు ననియు, ఆమె చక్కఁదనము నెమలి సొగసుఁదనమును తలఁదన్ను ననియు, ఆమె కలకండపుఁ బలుకులు చిలుకపలుకులను గెలిచేయు ననియుఁ గోవలుఁడు తన ప్రేయసిని పలుదెఱఁగులఁ గొనియాడుచుండును. అమూల్యాభరణములతో కణ్ణకిని గై సేయుచుండుపరి వారికలను గాంచి కోవలుఁడు కొంచెము కరినముగ నిట్లనును. "ఈ యాభరణాదులు కణ్ణకిసౌందర్యము నినుమడింపఁజేయవు సరికదా యామె సుకుమారశరీరమున కవి బాధాకరములుగ నుండును."
ఇట్లు ప్రేమమూర్తు లయినకణ్ణకీకోవలుల సాంసారికజీవనము సౌఖ్యప్రదముగఁ గొన్నివత్సరములు సాగెను.

ఇట్లుండ నొకనాఁడు కరికాలరాజేంద్రుని యాస్థానము-
నందలి వేదికపై మాధవి యనునర్తకి నృత్యగానప్రదర్శ
నము గావించెను. రసహృదయుఁ డగుకరికాలుఁడు భాషా
పోషకుఁడుగను, కళాతపస్విగను వార్త కెక్కినవాఁడు. అతని
సమాదరణమున కావేరీపట్టణపునటకులును, గాయనీ గాయ
కులును జాలమంది తమ ప్రజ్ఞావిశేషములను జూపి యమ్మహా
రాజుచే సమ్మానితు లగుచుండిరి. ఆనాఁటి మాధవినృత్య
సభకు కళారాధకుఁ డైనకోవలుడు కూడ వెడలియుండెను.

మాధవి చిత్రాపతి యనువేశ్యకు ముద్దుల కొమరిత.
నృత్తగీతములందు చిత్రాపతి యందె వేసినచేయి. తన
కుమార్తె తనకంటెను మిన్నగ నుండవలయు నని యామె
సదా తలఁచుచుండెడిది. కావున మాధవి కామె స్వయముగ
నృత్తగీతాదికళలు నేర్పఁదొడఁగెను. ఏడేండ్లవయసు
నకే మాధవి సంగీతనాట్యములందు ధురీణ యనిపించు
కొనెను. అప్పటికే యామె యాటపాటలు సహృదయుల
ప్రశంసల నందుకొనెను. అయినను జిత్రాపతి తృప్తిపడలేదు.
అందుచే సంగీతనాట్యశాస్త్రనిధి యని పేరు మోసిన యొక
యాచార్యుని నామె మాధవికి గురువుగ నియమించెను. తదా
దిగ నామె 'దేశి, ఆర్య' యనునాట్యభేదములందును, సంగీత
శాస్త్రమునందును ప్రత్యేకముగ కృషి సేయ నారంభించెను.
నాటకవేషధారణమునఁ గూడ నామె ప్రావీణ్యమును గడించి
యుండెను.

ఆ నాఁటి సదస్సును బురస్కరించుకొని మాధవి విలువ గలపట్టుపుట్టములు ధరించెను. అమూల్యాభరణభూషిత యయ్యెను. మనోజ్ఞముగఁ గైసేసికొనెను. ఆమె వస్తుతః చక్కనిచుక్క, పదునాలుఁగేఁడుల లేఁబ్రాయమున నున్న జవ్వని. ఒకానొక శాపవశమున దేవవేశ్య యైనయూర్వశియే కావేరీపట్టణమున మాధవిగా జనన మందెనఁట!

మాధవి రంగస్థలము నెక్కెను. ఆమెవెంట వైణి కుఁడు, మార్దంగికుఁడు, మురళిని మ్రోఁగించువాఁడు, నాట్యా చార్యుఁడు, కవి మున్నగు వా రుండిరి. ఆమె సంప్రదా యము ననుసరించి కుడికాలు ముందు పెట్టి గానము సేయు నారంభించెను. 'దేశమున నెబ్బర మటుమాయమై, మంచి నెలకొనుఁగాక' యనుచు మాధవి దైవప్రార్థనము సేయు చుండఁగ తదనుగుణముగఁ దొలుత మురళి మ్రోఁగెను. పిమ్మట వీణానాదము విననయ్యెను. అటుపిమ్మట మద్దెల మ్రోఁత శ్రుతిని గలసికొనెను. అటుల సంగీతవాద్యము లన్నియు మాధవిపాటలతో సహకరించెను, సదస్యులు సంతో షాబ్ధి నోలలాడిరి. అనంతరము మాధవి యొకపాటను బాడుచు తదనుగుణముగ దేశినాట్యమును పిదప నార్యనాట్య మును సలిపెను.

సంగీతనాట్యప్రదర్శనము సమాప్తిఁ జెందెను. మాధవీ ప్రతిభను గాంచి సదస్యు లెల్లరును సంభ్రమాశ్చర్యములు నెందిరి. ఆమె నటనాపాండితిని బహుముఖముల శ్లాఘిం

చిరి. నృత్తావసరమున కోవలుని నిశితము లగుచూపు లన్నియు మాధవియందే లగ్నమై యుండెను. ఆమె ప్రదర్శించు వివిధనాట్యభంగిమములను నతఁడు గమనించుచుండెను. ఆమె సాటిలేనిసౌందర్యమునకు కోవలుఁడు ముగ్ధుఁడయ్యెను, కమనీయకళావైదగ్ధ్యమునకు వశంవదుఁ డయ్యెను "ఆహా! ఈ చిఱుతవయసునందే మాధవి సంగీత నాట్య శాస్త్రముల నాపోశనము పట్టెనుగదా!" అని యతఁ డామె ప్రతిభకు జోహారు లర్పించెను. సతీతిలక మయిన కణ్ణకి యాక్రమించినకోవలుని హృదయఫలకమున మాధవి మనోహరాకృతి ప్రతిఫలించెను.

కరికాలచోళుఁడు కూడ మాధవీప్రతిభకు ముగ్ధుఁడై సదస్యు లెల్లరు హర్షధ్వానములు ప్రకటించుచుండఁగ వేదికను సమీపించి మాధవిగళసీమను వేపాకునూలను వేసెను. ఇది నాఁటి యాచారము. పిమ్మటఁ జోళమహీపతి మాధవికి వేయు నెనిమిది బంగరునాణెములతోఁ గూడిన పచ్చల హారమును బహూకరించెను. ఆదృశ్యము చిత్రాపతికి మేర లేనిసంతోషముఁ గలిగించెను. మాధవిజన్మము సార్థక మయ్యె నని యామె సంతసించెను. పిమ్మటఁ గరికాలచోళుఁ డంతఃపురమునకుఁ బోవఁగా సభికు లందఱుఁ దమతమ గృహములకు దారి తీసిరి.

మాధవి సభావేదికపై నాట్యము చాలించినను, నామె మధురమోహనమూర్తి కోవలుని హృత్సీమ నర్తిం

చుచునే యుండెను. కణ్ణకిపైఁగల ప్రేమానురాగము లతనిలో మఱుఁగుపడినవి. కోవలుఁడు కామపరవశుఁడయ్యెను. మాధవి తప్ప మఱేమియు నతనికంటికి గనఁబడలేదు కామము గ్రుడ్డిది!

కోవలుఁ డట్లు కామాంధుఁడై యుండఁగ నతని కొక చాటింపు వినవచ్చెను. "అయ్యలార! ధనికులార! మన మహారాజులుంగారు మాధవికిఁ బచ్చలహారమును నిండు సభలో బహూకరించినవిషయము మీకందఱికిని తెలిసినదే. వేయునెనిమిది బంగరునాణెముల నొసఁగి దీనిని విలుచుకొనుఁడు అట్టి పురుషుఁడే మాధవికిఁ దగినప్రియుఁడు." మాధవిసఖి యగువసంతమాల యనునామె యీ చాటింపు వేసెను.

కోవలుని కెక్కుడ లేనిసంతోషము గలిగెను ఆ పచ్చలహారమును స్వీకరించుటకే యతఁడు కృతనిశ్చయుఁ డయ్యెను. వెంటనే యతఁ డామెను సమీపించి మూల్యము నొసఁగి యాపచ్చలహారమును గైకొనెను. అంత వసంతమాల మిక్కిలి సంతసించి 'అయ్యా! తమరు దయచేసి నాతో మాధవీ గృహమునకు విచ్చేయుదురా?' యని యడిగెను. కోవలుఁ డందులకు సహర్షముగ సమ్మతించెను.

కోవలుఁడు మాధవీమందిరమును జేరెను. అప్పు డామె యలంకారము సామాన్యముగనే యుండెను. కాని మాధవి యతనికంటికి లావణ్యలతికగాఁ దోఁచెను. తాను

గోరినపురుషుఁడే తనకు లభించినందుల కామె కేరుఁగెక్కినంత సంతోషము గలిగెను. మాధవిని జూచినదే తడవుగ కోవ లుఁడు సాధ్వీమణి యగుకణ్ణకిని విస్మరించెను. మాధవియే తన సర్వస్వ మని యాతఁ డెంచెను. మాధవీకోవలులు ప్రేయసీ ప్రియులయిరి. నానాఁటికి వారి ప్రేమానురాగములు వృద్ధి యగుచుండెను. కోవలుఁడు గృహిణిని, గృహమునుగూడ మఱచెను వ్యాపారమును గూడ మఱచినట్లే యయ్యెను. జననిజనకులు, బంధుమిత్రాదులు నతనికి స్మృతిపథమునఁ గూడ లేరు.

మహాసత్త్వునకుఁ గోవలుని చెడునడత తీఱనివిచా రముఁ గలిగించెను. ఎన్నటికైన నతఁడు సన్మార్గమునకు వచ్చు ననునాశతో మహాసత్త్వుఁడు తన విచారమును బహిర్గతము సేయకయే కాలము వెళ్లఁబుచ్చుచుండెను. కాని పాలవంటి తనవంశమునకు మాసిపోవనిమచ్చ యొకటి కలిగెను గదా యని యతఁడు విచారహృదయుఁ డయ్యెను. కోవలునిప్రవర్తన మతని బంధుమిత్రాదులకుఁ గూడ విచార హేతు వయ్యెను. కణ్ణకిదుస్థితిని దలఁచి వారు శోకార్ణవమున మునిఁగిపోయిరి. "అకటా! యెంతలో నెంత మార్పు సంభ వించినది! పండువంటి కణ్ణకికాపురము పాడయి పోయెను. విద్యావివేకములు గలవాఁ డయ్యు కోవలుఁ డిట్లు సంచరింప వచ్చునె? ఇంతకు విధి బలీయము!" అని వారు తమకుఁ దామే సమాధానము చెప్పుకొనిరి.

భర్తృవేశ్యాగమనము కణ్ణకి సుకుమారహృదయమును గలంచివైచినది, దుఃఖజలధిని ముంచివేసినది. కన్నులయందు నీరు లభ్య మయినంతవఱకు కామె రేయనక పగలనక కన్నీరు మున్నీరుగా నేడ్చినది. కాని తనకుఁ గలిగిన దుస్థితిని దలంచి భర్తను గాని, మఱెవ్వరిని గాని యా సాధ్వీతిలకము పల్లెత్తుమాట యైనఁ బలుకలేదు. విధిని నిందింపలేదు. పూర్వమువలెఁ దన్నలంకరించుకొనుట నామె మానివైచినది. సురభిళద్రవ్యముల నామె దగ్గఱకు రానీయలేదు. సుమధారణమునకుఁ గూడ నామె స్వస్తి చెప్పినది. అమూల్యాభరణముల ధరించుట విడనాడినది. అంతకంటెను మించి యేమి సేయఁగలదు? పాపము! ఒకనాఁటి సౌందర్యతిలకయైన కణ్ణకి నేఁడు శోకరసాధిదేవత యైనది.

శరవేగమున దినములు పరుగిడుచుండెను. కొన్ని నెలలు గడచెను. కోవలుని పూర్వులు కూడఁ బెట్టిన కష్టార్జితద్రవ్యము కొంతవఱకు మాధవీగృహమును జేరినది. అతని వ్యాపారము మూలఁ బడినది. అయినను కోవలునిలో నెట్టిమార్పును గలుగలేదు. పైపెచ్చు మాధవిపై నానాఁటికి నతనికిఁ బ్రేమ యగ్గల మగుచుండెను. తుదకు మాధవీకోవలుల ప్రేమవల్లరి ఫలించి సఫలత చెందినది. ఆమె గర్భము ధరించెను. కాని చిత్రాపతి కా విషయము స్మృతిపథమునకు వచ్చినప్పుడెల్ల నామె భయకంపిత కాసాగెను. ఇట్లుండ నొకనాఁడు మాధవి స్త్రీశిశువును బ్రసవించి

మాతృస్థానము నలంకరించెను. చిత్రాపతితక్కుఁ దక్కిన వా రందఱు నా శుభవర్తమానమును విని సంతసించిరి.

కోవలునకుఁ గలిగినయానందమునకు మేరయే లేదు. మాధవియం దాతనికిఁ బ్రేమానురాగములు ద్విగుణీకృతము లయ్యెను. మాతాశిశువుల సంక్షేమము నాశించి కోవలుఁ డా నాఁడు దేవాలయములయం దభిషేకములు నెఱపెను. శిశూదయ మైనయైదవనాఁ డా పసుకూనకు నామకరణమహోత్సవము నెఱపిరి. తదవసరమునఁ గోవలుఁడు బ్రాహ్మణులకు భూరిదక్షిణల నొసఁగి వారిని సంతుష్టి పఱచెను. వేయిమంది వేశ్యలు మాధవిని, నామె తనయను దర్శింప నేతెంచిరి. మహావైభవోపేతముగఁ దదుత్సవము జరగెను. కోవలుని యభిమతము ననుసరించి యా శిశువునకు మణిమేఖల యను పేరు పెట్టిరి. ఆ పేరు ముద్దులమూట గట్టుచుండుటచే మాధవియుఁ దనప్రియుని యభీష్టమును గౌరవించెను. వచ్చిన బ్రాహ్మణులును మణిమేఖలను దీవించిరి.

కోవలుఁడు తన కుమార్తెకు మణిమేఖల యని పేరిడుట కొక గాథ కలదు. మున్నొకప్పుడు కోవలుని వంశీయుఁ డొకఁడు సముద్రయానము సలుపుచుండఁగ నతఁడు ప్రయాణముఁ జేయుచున్న నౌక సంద్రమున మునిఁగిపోయెను. తత్ఫలితముగ నతఁడు చావుబ్రతుకుల మధ్య నుండఁగా నొక దేవత యతనిని గనికరించి యాపత్తునుండి కాపాడెను. ఆ దేవత పవిత్రనామము మణిమేఖల. నాఁటినుండియు

కోవలుని వంశస్థుల కా దేవతపై భక్తివిశ్వాసము లేర్పడెను. కావున నా దేవతయే తన ముద్దులపట్టిని నెల్ల ప్రొద్దులును వేయికండ్లతో రక్షించుచుండు ననుతలంపుతోఁ గోవలుఁ డాశిశువునకు మణిమేఖల యని పేరిడెను.

మణిమేఖలాప్రాదుర్భావముతో మాధవీకోవలుల యనురాగబంధము మఱింత దృఢ మయ్యెను. ఆ స్తిపాస్తు లడుగంటిపోయినను కోవలుఁ డామెయందు బద్ధానురాగుఁడై యుండెను. తుదకుకణ్ణకి యమూల్యాభరణములు కొన్ని మాధవీసమార్చనమునకై వినియోగింపఁబడెను. అయినను కణ్ణకి తన నాధుని ద్వేషింపక యతని క్షేమమునే సదా కోరుచుండెడిది. కాని యతని ప్రవర్తనమువలన వంశగౌరవమర్యాదలు మంటఁగలసెను గదా యని మాత్రము కణ్ణకి విచార మందుచుండెను.

కోవలుఁడు మాధవి కే లోటును రానీయకుండఁ బ్రాణప్రదముగఁ జూచుచుండినను చిత్రాపతి కతనిపై రోఁత యేర్పడెను. అతనిని విడనాడి మఱియొక లక్ష్మీపుత్రునిఁ జేపట్టు మని యామె మాధవిని గోరెను. కాని కోవలుని మనసార వలచినమాధవిమాత్రము తల్లిమాటలను బెడచెవిని బెట్టెను. చిత్రాపతి కటూక్తులను వినునప్పుడు మాత్రము కోవలునియందు మార్పు కలుగుచుండెడిది. కాని మాధవి కంటఁబడినంతనే యతఁ డీ ప్రపంచమునే విస్మరించుచు నామెకు వశంవదుఁ డయ్యెడివాఁడు.

ఇటుల దినములు దొరలిపోవుచుండెను. ప్రతిసంవత్సరము గొండాడఁబడు నింద్రోత్సవము సమీపించెను. ఈ యుత్సవప్రాధాన్యమును విశదీకరించుకొకగాథ కలదు.

అగస్త్యుని కరుణాకటాక్షములవలన చోళమండలమునందు కావేరి (నది) జనన మందెను. ఆ నది ప్రవహించునాఁటినుండియు చోళనాడు బంగారుపంటలకుఁ గొంగుముడియై, సకలసంపదలకుఁ గాణాచియై విలసిల్లఁ దొడఁగెను. ఇట్లు కొన్ని సంవత్సరములు గడచెను. ఒకయేడు వర్షాభావమువలనఁ గావేరిలో నీరు పుష్కలముగ లేకుండెను. కావున సస్యములకు వలసినంతజలము లభ్య మగుట దుర్లభమనిపించెను. దేశమున క్షామదేవత తాండవింపఁ జొచ్చెను. ప్రజలు పలుబాధలకుఁ బాల్పడిరి. అప్పుడు తొడిత్తోట్ సెంబియన్* యనునతఁడు రాజ్య మేలుచుండెను. క్షామనివారణోపాయ మేమియు నాతనికి స్ఫురింపలేదు. అతఁడు కులగురువయినకుంభమునిని (అగస్త్యుడు) దర్శించి తన ప్రజలు పడుచున్న బాధల నాతనికిఁ దెలిపెను. అతఁడును మిక్కిలి విచారించి కొంతవడి యోజించి పిమ్మట సెంబియన్ రాజుతో నిట్లనెను.

కావేరీపట్టణమునకు మేఘాధిపతి యగునింద్రుని, నతని పరివారమును నాహ్వానింపుము. ఇంద్రు నుద్దేశించి వైశాఖపూర్ణిమనుండి జ్యేష్ఠపూర్ణిమవఱకు వైభవోపేతముగ

* సెంబియన్ అను మాటకు 'శిబివంశీయుఁ' డని యర్థము.

నుత్సవము జరపుము. ఇంద్రుఁ డిందులకు సమ్మతించెనేని చోళ దేశమునందు వర్షాధిక్యము గాని, వర్షాభావము గాని యుండదు! ఇంద్రోత్సవము జరగునంత కాలము చోళనాడు సస్యశ్యామలమై సంపదల కాలవాలమై శోభింపఁగలదు. కావున నింద్రుని దర్శించి యతనిసమ్మతిని బొందుము ''

అగస్త్యునియాజ్ఞకు బద్ధుఁడై సెంబియన్ సహస్రాక్షుని సందర్శించి యతనికిఁ దన మనోభీష్టమును దెలిపెను. ఇంద్రుఁ డంత సంతుష్టుఁడై సపరివారముగ కావేరీపట్టణమున కేతెంచుటకు సమ్మతించెను. పిమ్మట సెంబియన్ రాజు నిజనగరమునకు విచ్చేసి దేవతల నెల్లర నాహ్వానించి వైభవోపేతముగ నింద్రోత్సవము జరపెను. చోళ దేశమున క్షామము నశించెను. తదాదిగఁ గావేరీపట్టణమునందు ఇంద్రోత్సవము ప్రతిసంవత్సరమును శ్రద్ధాభక్తులతో జరపఁబడసాగెను.

ఇంద్రోత్సవమును బురస్కరించుకొని కావేరీపట్టణము కన్నులపండువుగ నలంకృతమై యుండెను నగరవాసులెల్లరు నుత్సవకార్యములందు నిమగ్నులై యుండిరి చోళ మహారాజు స్వయముగ నుత్సవమును బ్రారంభించెను, సామంతులు, మంత్రులు, ప్రభుత్వోద్యోగులు, పురప్రముఖులు మున్నగువారు కూడ నందుత్సాహముతోఁ బాల్గొనిరి. ప్రభుపుంగవులసమక్షమున రాకుమారులు కావేరీపూతజలములతో స్వర్ణ కలశములను నింపిరి. పిమ్మట నాకుమారులు వెంటరాఁగా మహారా జింద్రాలయమునకుఁ జనెను. అట నున్న దేవతా

విగ్రహములకు రాకుమారులు గొనివచ్చినజలములతో నభిషేకాదులు జరగెను. తదవసరమున మంగళవాద్యములన్నియు మ్రోఁగెను. ఆదృశ్యమును గాంచుటకు పలువురు ప్రజ లేతెంచియుండిరి

ఉత్సవము ముగిసెను. ఆ నాఁ డమావాస్య. నగరవాసు లెల్లరుఁ గావేరీనది సముద్రమునఁ గలియుచోట స్నాన మాడుటకు శారులు తీరి మహోదధితీరమును జేరుచుండిరి. ఎక్కడఁ జూచినను వింతలు, వేడుకలును. ఎవరిని గన్గొనినను వారు నూతనోత్సాహపూరితులై యుండిరి. ఆ నాఁడుపట్టణ మంతయు సముద్రతీరమున నున్నట్లుండెను. చోళమహీపతి కూడఁ బరివారముతో వేంచేసి సముద్రస్నానముఁ గావించెను. పారావారతీరమునఁ గూడినయశేషజనమును జూడఁదలఁచియు, సముద్రస్నానముఁ గావించు నిచ్ఛపొడమియు వసంతమాలాదిసఖీజనము వెంట రాఁగా మాధవీకోవలులుకూడ సముద్రతీరముఁ జేరిరి.

అంతకుమున్నే తమకొఱకై ప్రత్యేకముగ నేర్పఱుపఁబడినయిసుకతిన్నెలపై మాధవీకోవలులు సుఖాసీను లయిరి. ఆభరణాద్యలంకారభూషిత యగు మాధవీమధురాకృతి కోవలునిఁ దన్మయునిఁ గావించెను. అంత వసంతమాల యొక విపంచిని మాధవికి నొసఁగెను. ఆ వీణను గ్రహించి శ్రుతి పఱచి దానిని మాధవి తన ప్రియునిచేతి కిచ్చెను. ఆనంద పరవశుఁడై యున్న కోవలుఁడు మాధవిమనస్సు నెఱిఁగి యా

వీణను మీటుచు మధురస్వనమున గానము సేయ నారంభించెను. తొలుత నతఁడు కావేరిని, పుహార్ పట్టణమును బ్రస్తుతించెను.

పిమ్మటఁ గోవలుఁడు ప్రణయగీతములు పాడఁజొచ్చెను. త న్నడగాసినయొకానొక ప్రేయసిని దలఁచుచు ప్రియుఁడు పలికినట్లుగ నాగీతములు స్ఫురించుచుండెను. "ప్రేయసీ! నీ మనోహరాకృతికి నేను వశంవదుఁడ నైతిని. నీ వీక్షణములు క్రూరనారాచములకంటెను వాఁడిగ నున్నవి అవి చూపఱ హృదయమును జల్చి వేయున ట్లున్నవి." ఇట్టి యర్థము లొసఁగు వాక్యము లా గీతములలో నుండెను. భావప్రధానముగఁ గోవలుఁడు కొంతవడి వీణాగాన మొనర్చి యా వీణను మాధవి చేతి కిచ్చెను కోవలుఁడు పాడినపాటలు మాధవికి సంతోషజనకములు గాకుండెను. అతఁడు తనయందు విముఖుఁడై వేఱొకజవ్వనియందు బద్ధానురాగుఁడై యుండె ననియుఁ, గావుననే యాతఁడు ప్రణయగీతములు పాడె ననియు మాధవి యుహోహ పడెను కోవలుఁడు కల్లకపటములు లేనివాఁ డని యామె గ్రహింపఁజాలక పోయెను.

పిమ్మట మాధవి సంతోషము నటించుచు కావేరీ నదీమతల్లిని, పుహార్ నగరరామణీయకమును గొనియాడి సాగరు నుద్దేశించి యిట్లు వీణాగాన మొనర్చెను.

"సరిత్పతీ! నీకు నమస్కారములు. నీకడ నున్నరత్నరాసులు గ్రహింపఁబడునటుల పురుషులు నచ్చికబుచ్చిక లాడి

మావలపుధనమును గ్రహించుచున్నారు. కాని వారిచే మేము కడపట వంచింపఁబడుచున్నాము. ఇచ్చటనే—ఈ సైకతశ్రేణులందే-నేను నాప్రియుని జతఁ గూడితిని. కాని నన్నతఁడు విసర్జించినాఁడు. హంసరాజమా! అతఁడు నన్ను మఱచిపోయినను నేనుమాత్ర మతని మఱవలేకున్నాను. సుమ రాజమా! సాయంసమయములందు నేను సంతతధారగా విలపించుచున్నప్పుడు నీవు మైమఱచి నిదురించుచున్నావు. నీది ధన్యజీవనము ఈ సముద్రతీరమునకు మఱల నా ప్రియుఁడు వచ్చునని తలఁచుచున్నావా నీవు? తరంగమా? నీవుకూడ నాప్రియునివలె కాఠిన్యము పూనితివా? కానిమ్ము. నాప్రియుని రథచక్రాలగుర్తులను గూడఁ దుడిచివేసితివి. ఇఁక నే నేమిసేయుదును? పిట్టలు చెట్లుచేరుకొన్నవి. సూర్యుఁడు పడమటికొండఁ జేరినాఁడు. ఈ వెన్నెలరేయిలోఁ గూడ నా కన్నులలో నీరు తిరుగుచున్నది. నాప్రియుఁ డున్నచోట నిప్పుడు సాయంకాలము కాదు కాఁబోలు. అతఁడు నన్నిచ టనే కలసికొనెను. ఎన్నో బాసలు చేసెను. నా కన్నులలో నతఁడు మెలఁగుచునే యున్నాఁడు. నే నతనిని మఱచి పోలేను.''

ఈ ప్రణయగీతములను బాడునపుడు మాధవి దుర్భర విరహావేదనము ననుభవించునట్లు కనఁబడెను. మిీఁదు మిక్కిలి యామె కంఠమాధుర్య మాగీతములకు జీవము పోసినట్లుండెను. ఆ గీతావళిని వినుచుండినకోవలునకు నొడ

లెల్ల జెబ్బులు వ్రాకిన ట్లుండెను. భయముచే శరీరము కంప మొందెను. అతనిహృదయవీథిలోఁ బెనుగాలిదుమారము రేఁగెను, సంశయము లెన్నియో ప్రోవులుగఁ బడెను. మాధవిపై నతనికి గోఁత కలిగెను. 'ఈమె నన్ను రోసి యితరునిఁ బ్రేమించినది. నిర్భయముగ నాసమక్షమునందే యతని నుద్దేశించి గీతములుకూడఁ బాడినది. నేను మోసపోయితిని. అయ్యో! కణ్ణకి! సాధ్వీమణి వైననిన్ను నిష్కారణముగ వంచించి యీ కులటకు దాసుఁడ నైతిని. నే నెంత మూర్ఖుఁడను! మా పెద్దలు కష్టించి కూడఁ బెట్టినధనరాసులను గూడ నాశ మొనర్చితిని. బంగారమువంటివ్యాపారమును పాడు చేసితిని. పండువంటి సంసారమును చిదిమివేసితిని. పాలవంటి వంశమునకు తీరనికళంకమును చేకూర్చితిని' అని కోవలుఁడు తన్నుఁ దాను నిందించుకొనెను.

ఇఁక నొక్కనిమిషమేని మాధవిసమక్షమున నుండుటకుఁ గోవలునకు మనస్కరించినది కాదు. అతఁడు పశ్చాత్తప్తుఁ డయ్యెను. అతఁడు మానసికముగాఁ బరివర్తనముఁ జెందుకొలఁది నతని కన్నులు చింతనిప్పులను దలపించుచుండెను. మాధవి వేఱొకప్రియుని వరించిన దని నిశ్చయించి కోవలుఁడు చివాలున తన యనుచరులతోఁ గూడి చరచర ముందునకు నడవసాగెను. కణ్ణకిని గలసికొన వలయు నని యతనిహృదయము తహతహ లాడెను. అనాఁడు మఱల కోవలుఁడు గృహమును, గృహిణిని సాదరముగ సంస్మరించినాఁడు.

కోవలుని కోపావేశమును గన్నులారఁ గాంచిన మాధవి విషణ్ణహృదయ యయ్యెను. తలవనితలంపుగ సంఘటిల్లినయెడ బాటునకు వగచుచు సఖీజనపరివృతయై మాధవి స్వగృహమునకు మఱలెను.

మాధవి స్వగృహముఁ జేరెను. వసంతమాల యామెకు ధైర్యము నుడివి యామె నూరడించెను కాని మాధవి కోవలు నెడబాసియుండలేక మిక్కిలి దుఃఖించుచుండెను. పిమ్మట నామె తన విచారమును విస్మరింపఁ దలఁచి వీణను మీటుచు నొక పాట పాడ సాగెను కాని యామె కంఠము పూడి పోయెను, మాటలు పెకలలేదు. కొంతసే పామె వీణ వాయించెను. అయినను మాధవికి దుఃఖోపశమనము గాలేదు.

అంత మాధవి కోవలునుద్దేశించి యి ట్లొక లేఖ లిఖించెను. ''జీవకోటిని ప్రేమపథమునకు మఱల్చునట్టి వసంతుఁడు పరిపాలించుచున్న ఋతు విది. అతఁడు తరుణవయస్కుఁడు కనుక తప్పు చేయుట సహజము. కాని సాయంసంధ్య సమీపింప నున్న దనఁగానే ప్రేయసీప్రియుల సమాగమమునకు వసంతుఁడు సంసిద్ధుఁ డగును. అమృతకిరణుఁ డుదయించుచో ప్రియు నెడబాసి ప్రేయసి మనఁజాలదు. కనుక పొరపాటునఁ జేయఁబడినతప్పిదమును మన్నించి నన్ను కనికరింతువుగాక.'' ఆ లేఖను కోవలున కందఁ జేయుమని వసంతమాలకు నొసఁగి మాధవి మఱల చింతాక్రాంత యయ్యెను.

కోవలుఁ డప్పుడే యంగడివీథినున్నతన 'గృహమును వీడి కణ్ణకి నివసించు గేహసీమకు, బయన మయ్యెను. వసంత

మాల యతనిని సమీపించి మాధవి యొసఁగిన కమ్మను సవినయముగ కోవలున కొసఁగఁబోయెను. ఆ యుత్తరమును నతఁడు స్పృశించుటకుఁ గూడ సమ్మతింపలేదు. పిమ్మట వసంతమాల యా జాబును చదువుమని కోవలునిఁ గోరెను. అందులకుఁ గూడ నతఁడు సుముఖుఁడుగ లేఁడు. ఎట్లో దానిని జదివెను. అర్థముఁ జేసికొనకయే కోవలుఁడు "ఇఁక నైన పొమ్ము. వసంతమాల! మీ సఖి వట్టిమాయలాఁడి. తేనె పూసిన కత్తి. ఆమె హృదయమును నేను సునిశితముగ గ్రహించితిని. ఏ పాత్రనైన నను మహాచాకచక్యముతో రంగ స్థలమున ప్రదర్శింపఁగలనటీమణి యామె ఆ విషయము నాకు చక్కఁగా తెలియును. ఈ జాబును మీ సఖికే యిచ్చి వేయుము. పొమ్ము వసంతమాల!" అని కఠినోక్తులాడెను. కోవలునకు మాధవిపైఁ గలకోపము, రోఁత—అన్నియు నా సమయమున వసంతమాలకు సువ్యక్తమయ్యెను.

ఇఁకఁ జేయునది లేక వసంతమాల కాళ్ళీడ్చుకొనుచుఁ బోయి మాధవీమందిరమును జేరెను. గంపెడాసతో మాధవి వసంతమాలను సమీపించెను. ఆమె కోవలుని కఠినోక్తుల నన్నిటిని మాధవికిఁ దెలియఁజేయఁగా నందుల కామె మిక్కిలి విచారించెను. ఆ రాత్రికి రాకున్నను మఱునాఁటికైనను కోవలుఁడు తప్పక తనయొద్దకు వచ్చునని మాధవి విశ్వసించి యటుల తన్ను దాను సమాధానపఱచికొనెను. పిమ్మట వసంత మాల తన గృహమునకుఁ జనెను.

ఆనాఁటి సాయంకాలము కణ్ణకి విచారవదనయై యేకాంతముగఁ దన విశాలసౌధమునఁ గూర్చుండియుండెను. ఎడనెడ నామె నయనపద్మములనుండి యశ్రువులు క్రిందఁ బడుచుండెను. వానినామె తన చేలాంచలముతోఁ దుడుచుకొనుచుండెను. కన్నీటికాల్వలచే నామె చిక్కిపోయిన చెక్కిళ్లు కరడు గట్టుకొని పోయెను. కన్నులలోఁ గళాకాంతులు లేకుండెను. పూర్వము కొట్ట వచ్చునట్లుగ నుండిన యామె వదనమండలము నేఁడు వెలవెలఁ బోవుచుండెను. పెండ్లినాఁటి యాభరణములన్నియు మటుమాయమై యామె గళసీమ బోసివోవుచుండెను. పరమపవిత్ర మైనయామంగళసూత్రముమాత్రము మిగిలెను. పాదముల నున్న మణిమంజీరములు కూడ సౌభాగ్యవశమునఁ నామెకు మిగిలెను. ఆనాఁ డెందులకో కాని కణ్ణకి చంచలదృగంచల యగుహరిణమువలె మాటిమాటికి బెదరిపోవుచుండెను.

ఆ సమయమున దేవంతి యనునొకబ్రాహ్మణి యామెకడకు వచ్చెను. ఆమె కణ్ణకిప్రియసఖి. కోవలుఁడు మాధవీదాసుఁ డయిననాఁటినుండియు నామె కణ్ణకికి హితవు చెప్పుచు నామెకు దుఃఖోపశమనముఁ జేయ యత్నించుచుండెను. దేవంతియందు కణ్ణకీదేవికి మేరలేని యనురాగము. కాన కణ్ణకి కల్లకపటములు లేక తన మనోగతాభిప్రాయములను దేవంతికిఁ దెలియఁజేయుచుఁ గొంతవఱకు సూఱట నొందుచుండెడిది.

కావేరీపట్టణమునందలి శాత్తన్ దేవాలయమున దేవంతి యర్చకురాలు. నాఁటి పూజాదికమును పూర్తి చేసి కొని వినియోగింపఁబడిన ప్రసాదముతో నామె కణ్ణకిని సమీపించెను. దేవంతి యక్షతలను, పచ్చికను కణ్ణకిపైఁ జల్లి 'నీ భర్త నిన్నుఁ ద్వరలోనే కలసికొనునుగాక!' అని దీవించి తాను తెచ్చిన ప్రసాదమును నామె కొసఁగెను. దేవంతి దీవన కణ్ణకిని భయభ్రాంతగాఁ జేసెను. ఆమె విచారవదనమును జూచి 'నీ విచారమునకుఁ గారణ మేమియో నేను తెలిసికొనవచ్చునా?' అని దేవంతి ప్రశ్నింపఁగా కణ్ణకి యిట్లనెను.

"దేవంతి! నిన్న రాత్రి నా కొకపీడకల వచ్చినది. ఏమి జరగ నున్నదో తెలియదు గాని మాధవిని విడనాడి నా భర్త నన్ను కలసికొనెనఁట! పిమ్మట మే మిరువురము నొక గొప్ప పట్టణమునకు వెళ్లితిమి. అచట దుష్టుఁ డొకఁడు నా భర్తపై దోష మేదియో మోపెను. అంతె నా పట్టణ మేలు రాజు న్యాయవిచారణ సలుపక యే నానాథునికి మరణశిక్ష విధించెనఁట. ఆ విషయమును దెలిసికొని నేను రాజును సమీపించి నా భర్త నిర్దోషి అని వాదించితిని. కడపట మే మిరు పురమును స్వర్గ్లోకము చేరినారము. కనుక నాప్రియుని కేమి సంభవింప నున్నదో యేమో——" అని కణ్ణకి కంటఁ దడి పెట్టెను.

దేవంతి కణ్ణకి నోదార్చుచు "అమ్మా! నీపై నీభర్తకు ద్వేషభావ మేమియును లేదు. కనుక దిగులు మానుము.

పూర్వజన్మమున నీ వొక మ్రొక్కుబడిని చెల్లింపకపోవుటచే నీ కీజన్మమున ని కష్టము కలిగినది. ఈ కష్టమునుండి బయటపడుట కొక్కటే త్రోవ కలదు. కావేరీముఖద్వారమున సోమకుండము, సూర్యకుండము నను రెండుతీర్థము లున్నవి. వానిలో నీవు స్నాన మొనరించి కామదేవుని మనసార సేవించితివేని నీకష్టము లన్నియు నంతరించును. ఇది నీ పురాకృతపాపపరిహారమార్గము'' అనెను.

ఆ మాటలు విని కణ్ణకి దేవంతితో నిట్లనెను. ''నీవు నుడివినది నిజము కా దనను. తీర్థములందు మునుకు లిడుట శ్రేయోదాయక మే. కాని పతియే దైవ మని భావించి నిష్కల్మషముగ జీవించుపడఁతికి తీర్థస్నానము లంతి ముఖ్యములు గావుక దా. పరదైవతమును వీడి పతిఁ గొల్చుచాన వాన కురియు మన్నంతనే కురియవలదా? కనుక భర్తృసేవా నిరతియే నాకు శుభప్రద మని తోఁచినది. అదియును గాక పతిని వీడి పరదైవతముల సేవించుట మా వంశాచారమును గాదు.''

దేవంతి కణ్ణకి భర్తృసేవాపరాయణతకు మిక్కిలి సంతోషించి యామెను వేనోళ్లఁ గొనియాడెను. అనంతరము కణ్ణకియొద్ద సెలవు దీసికొని దేవంతి తన గృహమునకుఁ జనెను.

ఆసమయమున నొక పరిచారిక కణ్ణకిని సమీపించి, 'కోవలుఁడుగారు వచ్చుచున్నా' రనెను. కోవలుఁ డనుమాట

వినినంతనే కణ్ణకికి నుడువ నలవి కానిసంతోషము గలిగెను. అంతలో కోవలుఁడుకూడ వచ్చెను. అతని మోము వెలవెలఁ బోవుచుండెను. విషాదచ్ఛాయ లాతని మొగమునఁ బ్రస్ఫుటముగ గోచరించుచుండెను. కణ్ణకి యతనికి దగ్గఱగ నిలువఁబడెను. అప్పుడు వాడి వత్త లయినయామె శరీరమును, సౌందర్యరహిత మైన యామె వదనమును, నామె శూన్యవీక్షణములనుండి యామెహృదయమును కోవలుఁడు గ్రహించెను దుఃఖముతో నతని కడుపు చెఱు వయ్యెను. ఆ దుఃఖమే తుదకుఁ బొంగి, పొరలి పై కుబికినది.

"కణ్ణకి! పరాభవాగ్ని నన్ను దహించుచున్నది. ధనమునే వాంఛించునట్టి వెలయాలిని త్రికరణశుద్ధిగ నమ్మి, యామెకై నాపూర్వులు కూడఁ బెట్టిపోయినధనరాసులను గూడ కరఁగించితిని. మాధవిచే నేఁడు వంచింపఁబడితిని. నిర్ధనుఁడ నైతిని" అని కోవలుఁడు శోకభారము నడఁచుకొని పలికెను.

మాధవిని సంతృప్తి పఱచుటకై వలసినంత ధనము లేక తన భర్త దీనవదనుఁడై యున్నాఁ డని కోవలుని మాటలనుబట్టి గ్రహించి కణ్ణకి "మీరు దిగులుపడ వలదు ఇంకను నాయొద్ద మంజీరములు మిగిలియున్నవి గదా! అవి యమూల్యములని మా యమ్మ చెప్పఁగా వినియుంటిని. కావున వానిని విక్రయించిన మీకు వలసినంత ద్రవ్యము లభింపఁగలదు" అని పెదవులమీఁదఁ జిఱునవ్వులు చిందులాడుచుండఁగ నుడివెను.

ఆ మాటలు వినినంతనే కోవలుఁడు హతాశుఁడయ్యెను. కణ్ణకి పలికిన ప్రత్యక్షరము శూలమై యాతని హృదయమున నాటుకొనెను. ఆమె ప్రకటించిన యౌదార్యమునకు ముగ్ధుఁడై "ప్రేయసి! నీ యౌదార్యమునుగూర్చి నేను క్రొత్తఁగాఁ జెప్ప నవసరము లేదు. నీవు చెప్పినట్లుగ నా మంజీరములను విక్రయించి తద్ద్వారా లభించు ద్రవ్యముతో నేను మధురానగరమున వ్యాపారము సేయ నభిలషించుచున్నాను. ఎట్లైనను సరే నేను పూర్వపు టౌన్నత్యమును గడింపవలయు నని తలఁచితిని. ఇఁక జన్మజన్మములకుఁ గూడ నిన్ను విడనాడను ఇది నా నిశ్చితాభిప్రాయము" అనెను.

కోవలుని మాటలను వినినకొలఁది నూతనోత్సాహము కణ్ణకిమోమున వెల్లివిరియుచుండెను. ఆమె సుందరవదనము శాంతికి సదనముగా మారెను, విశాలనయనము లాశాజ్యోతులకు నెలవు లయ్యెను, పలుకు పలుకులలో మధురామృతము తొలకరించెను. తొలుత కణ్ణకి తన చెవులను గూడ విశ్వసింపకపోయెను. కాని మఱుక్షణమునందే యామె సంశయము లన్నియు మాయ మయ్యెను. మాధవిని త్యజించి వచ్చిన తన భర్తను జూచుకొలఁది కణ్ణకి పరమానందభరిత యగుచుండెను. 'నేఁడు గదా నా జన్మము చరితార్థ మైనది'- అని తలఁచినది యా సాధ్వీమణి.

ఇట్లు కణ్ణకి సంతోషమున నోలలాడుచుండఁగ 'మఱి నాతో మధురానగరమునకు విచ్చేయుదువా?' అను కోవలుని

ప్రశ్న కణ్ణకికి వినవచ్చెను. పతితోడిదే లోకమని తలఁచిన యామె 'మీ యిష్టమే నా యిష్టము' అని సమాధాన మొసఁగెను. కోవలుఁ డందుల కెంతయో సంతసించెను.

ఆ మఱునాఁటి యుదయముననే కణ్ణకీ కోవలులు మధురానగరమునకుఁ బ్రయాణమై పోవ నిశ్చయించిరి. కాని తన స్వప్నవృత్తాంత మామెస్మృతిపథమునకు వచ్చి యామెను బాధింపసాగెను. కాని యెటులనో ధైర్యము దెచ్చుకొని దేవునిపై భారము మోపి కణ్ణకి ప్రయాణ మగుటకే సమకట్టెను. చాల దినములుగాఁ దాను పెంచుచున్నహంసిని, నాఁడు జింకను విడనాడియే మధురకుఁ బయన మగుటకు కణ్ణకి నిశ్చయించెను.

అది రాత్రి కడపటిజాము. చీఁకటి వెలుఁగులు తిలతండులన్యాయమున నలుమూలల నలముకొని యుండెను. కావేరీపట్టణము నిద్రించుచుండెను. అచ్చటచ్చటఁ బక్షుల కిలకిలారావములు మాత్రము మంద్రస్వరమున వినవచ్చుచుండెను.

కాకులు కూయువేళ మూఁడవకంటికిఁ దెలియకుండఁగ కణ్ణకీకోవలులు స్వగృహమును వీడి మధురానగరమునకుఁ బయనము సాగించిరి. వారి ప్రయాణోదంతము వారి పరిచారకవర్గమునకుఁ గూడఁ దెలియదు. వీథులు దాఁటి పేఁటలు దాఁటి వారిరువురును కావేరీపట్టణబహిర్ద్వారమును సమీపించిరి. అది మహోన్నత మయినది. అట నున్నహరిహారుల యాలయములను, నింద్రునిచేఁ బ్రతిష్ఠింపఁబడినబుద్ధునివిహార

స్తకమును వారు సందర్శించిరి. పిమ్మట జైనసన్న్యాసు లగు నిర్గ్రంథుల యుపన్యాసవేదికను సందర్శించి వారు దానికి భక్తిపురస్సరముగఁ బ్రదక్షిణ మొనర్చిరి. మఱల రాచ బాటమీఁదికి వచ్చి వారు ప్రయాణము సాగించి కొంత వడికి రాజోద్యానమును దాఁటి పిమ్మట కావేరీనదీతీరమును జేరిరి.

కావేరీతీరమునుబట్టి కణ్ణకీకోవలులు ప్రయాణము సాగించిరి. కోవలుఁడు ముందు నడవఁగా నాతని వెనుక కణ్ణకి మెలమెల్లన నడచుచుండెను. ఆమె మందగమనమును జూచి కోవలుఁడు మనఃక్షుభితుఁ డయ్యెను. అటులనే కొంత దూరము నడవఁగా వారి కొకసుందరారామము కనఁ బడెను. అప్పటికి సూర్యుఁడు బారెడుప్రొ ద్దెక్కెను. అసూర్యంపశ్య యగుకణ్ణకి పరిశ్రాంత యయ్యెను కావున నా సుందరోద్యానమును జూచినతోడనే యామె కొంత సే పట విశ్రాంతి గైకొన నభిలషించెను.

కణ్ణకి మిక్కిలి యలసటఁ జెందె నని కోవలుఁ డామె మోమును జూచి యనాయాసముగ గ్రహించెను. 'అకటా! యెండక న్నెఱుఁగని దయ్యు కణ్ణకి నావలనఁ గదా యిట్లు నడవ వలసి వచ్చినది. ఎట్లు నడచునో యీ కోమలాంగి!' అని యతఁ డనుకొనుచుండఁగా కణ్ణకి హీనస్వరమున 'ఆ మధురా నగర మెచ్చట నున్నది' అని భర్తను ప్రశ్నించెను. అది చెవిని బడినదే తడవుగ కోవలుఁడు నిలువున నీ రయి

పోయెను. "ఇప్పటికి ఒక కవతము (ఏడుమైళ్లు) దూరము మాత్రమే వచ్చితిమి. ఇంకను నైదాఱు కవతములు వెళ్లినఁ గాని మధురానగరము రాదు" అని కోవలుఁడు దుఃఖోద్వేగము నడఁచుకొని నుడివెను. ఐదాఱు (ముప్పది) కవతముల దూర మున్నదని నుడువుటకు మాఱుగా కోవలుఁడు 'ఐదాఱు కవతము' లని పలికెను. అంతదూర మున్నదని తెలిసికొనిన కణ్ణకి తప్పక భీతిలు నని తలఁచి కోవలుఁ డట్లు నుడివెను.

పిమ్మట విశ్రామార్థము కణ్ణకీకోవలు లా సుందరోద్యానమును బ్రవేశించిరి. అట కౌంతి యను నొక జైన యోగి యుండెను. ఆమె చిరనివాసమే యా యుద్యానము. కౌంతి యప్పుడు తపోనిష్ఠలో నుండెను. ఆమె శుభాశీస్సును బడయ నెంచి కణ్ణకీకోవలులు యోగినికి సవినయముగ నమస్కరించిరి. ఆమె వారి వినయవిధేయతల కలరి వారిని దీవించెను. కాని యోగిని చూపు లన్నియు రతీమన్మథులను దలఁపించు నా కణ్ణకీకోవలులయందే లగ్నమై యుండెను. సంభ్రమాశ్చర్యసంభరిత యై కౌంతీతపస్విని యిట్లనెను.

"బిడ్డలారా! మీ యందచందములను, సౌశీల్యమును చూడఁగా నభిజాతులవలె మీరు కనఁబడుచున్నారు. పై పెచ్చు లేఁతవయసున నున్నమీరు పాదచారులై యెచ్చటికి పోవుచున్నారు? మిమ్ముఁ జూడఁగా నా కెందులకో గాని జాలి కలుగుచున్నది."

"తల్లీ! మానివాసము కావేరీపట్టణము. ధనసంపాదననిమిత్తము మే మిపుడు మధురానగరమునకుఁ బ్రయాణ మైతిమి" అని కోవలుఁడు సంగ్రహముగ సమాధానము నొసఁగెను.

కోవలుని ప్రత్యుత్తరమును విని యోగిని మందహాసము చేసి 'నాయనా! యిక్కడికి మధురానగరము చాల దూరమున నున్నది. ఈ విషయము నీకుఁ దెలియదేమో! అదియును గాక యడవులు, గ్రామములు, కాలువలు మున్నగు వానిని దాఁటి వెళ్లవలయును. అరణ్యమార్గమున దుష్టమృగము లెన్నియో కలవు. బాటలును నంత మంచివి కావు రాళ్లు రప్పలు, ముండ్లు, పొదలు, పుట్టలు గుట్టలు మొదలగునవి బాటలనిండుగఁ గలవు. వానిని దాఁటి పోవలయును మఱి-యీ కుసుమశరీరను జూడఁగా నా హృదయము పలు వ్రయ్య లగుచున్నది. ఈ మహారణ్యమార్గమున నీమె యెట్లు ప్రయాణము సేయునో యని నేను సంశయించుచున్నాను. నేను గూడ మీతో మధురానగరమునకు వచ్చెదను. ఆ నగరమున నున్న *అరివన్ దేవుని సేవించుచుఁ బండితుల యొద్ద జైనమతధర్మముల నభ్యసింపవలయు నని నే నభిలషించుచున్నాను" అని నుడివెను.

కౌంతియోగిని తమతో మధురానగరమునకుఁ బయనమగుట తమ యదృష్ట మని కణ్ణకీకోవలులు మిక్కిలి సంత

* అరివన్ దేవుఁడు = హయగ్రీవుఁడు.

సించిరి. ఆ సంతోషమును బట్టఁజాలక "యోగిని! మీరు మాపైఁ గనికరించుట నిజమునకు మా భాగ్యవిశేషము. ఇఁక మా కష్టము లన్నియు గట్టెక్కినట్టులగా నేను భావించు చున్నాను. మిక్కిలి కృతజ్ఞుఁడను" అని కోవలుఁడు సవినయ ముగఁ బలికెను.

పిమ్మట యోగిని మధురానగరమునకుఁ బోవుత్రోవ లనుగుఱించి కణ్ణకీ కోవలులకు నుపదేశ మొసఁగెను. "అడవి మార్గమున వెళ్లినచో వేఁటగాండ్రు మృగములను బట్టుటకు వలలు పన్నియుందురు. వాని నన్నిటిని జాగరూకతతో దాఁటి పోవలయును. పచ్చనిపొలములమీఁదుగ పోవుద మన్నచో పీతలు, నీళ్లపాములు మున్నగునవి మార్గ మంతయు జరజర ప్రాకుచుండును. వానిమీఁదుగ పోయిన మనము వానికి హింస గావించినవార మగుదుము. అర్హ తుఁడు హింస కడు దూష్య మని యాదేశించినాఁడు. పై పెచ్చువానిని చూచి కణ్ణకి భయపడు నేమో! పనసతోఁటల మీఁదుగ వెళ్లుద మన్నచో పెల్లు కాచినయాపనసకాయలు మన తలలమీఁదఁ బడుచుండును. ఆ బాధ కోర్వఁజాలము. ఏ త్రోవను వెళ్లినను గొంచెముగఁ గష్ట మనిపించుచునే యుండును. కావున మెలఁకువతో మనము వెళ్లవలయును. సాధ్య మైనంతవఱకుఁ గ్రిమికీటకాదులకు హింస యొనర్పకుండ మనము పోవలయును. ఈ మాటలను జ్ఞాపక ముంచు కొనుఁడు."

అటుపిమ్మట నా తపస్విని యర్హాతులను, జైనమతా చార్యులను ప్రార్థించి తన భిక్షాపాత్రమును, నెమలిపింఛము లను గ్రహించి కణ్ణకీ కోవలులతోఁ గూడి పాండ్యభూపతులకు రాజధానినగర మగుమధురకుఁ బయనము సాఁగించెను. కావేరీనదీతీరము ననుసరించి పోవుచు వారు నేత్రపర్వము గొలుపు రమణీయప్రకృతిదృశ్యములను జూచుచు మార్గా యాసమును గూడ మఱచిపోయిరి. పయిఁడిపంటలతోడను, సుందరోద్యానములతోడను గలకలలాడుచుఁ గన్నుల పండువు గొలుపు గ్రామములను దాఁటి వారు ముప్వురుఁ బోవుచుండిరి తములపాకుల తోఁటలు, చెఱకు తోఁటలు, అరఁటి తోఁపులు - మున్నగునవి యెన్నియో వారికి గోచ రము లయ్యెను. కావేరీజలములు మహావేగముతోఁ బంట కాలువలందుఁ బాఱుచుండుటను జూచి వారు మిక్కిలి సంత సించిరి. జలజల మనునా నీటిజాలుల మ్రోఁతలకు ముగ్ధయైన కణ్ణకిని ప్రయాణపుబడలిక యించుకైన బాధింపలేదు. తోఁటల యందు శ్రమ కోర్చి పనిసేయు కార్మికుల పరిహాస ప్రసంగములు కణ్ణకీకోవలుల కవ్యక్తమధురములుగఁ దోఁచెను. క్షేత్ర లక్ష్మిని సేవించుచు నెడనెడ గీతములు పాడుచు స్వేద బిందువులను దుడుచుకొనుచు నున్నకృషికులను జూచిన వెంటనే కౌంతియోగిని యిట్లనెను.

"ప్రపంచమున కాహార మిడుచున్నయీ కర్షకులను జూడుఁడు. వారిశ్రమకు ఫలితముగానే మన మెల్లరము

సుఖించుచున్నాము. సర్వసంగపరిత్యాగ మొనర్చి సాంద్రాటవీసీమలలోఁ దపస్సు చేసికొనుసన్యాసులకుఁ గూడ హాలాయుధులు పూజ్యులు. వీరే కనుక పొలముపనులలో నిమగ్నులు కాకున్నచో లోకము మలమల మాడవలసిన దేగదా! కనుకనే యన్నివృత్తులలోను సేద్యమే మహోత్కృష్టమైన దని పెద్దలు చెప్పుచుందురు.''

యోగిని మాటలు కణ్ణకీ కోవలులకు జ్ఞానోదయము కలిగించెను.

అటుల నా ప్రయాణికులు ముగ్వురు ప్రయాణము సాఁగించి కొన్నిదినములకు శ్రీరంగమును జేరిరి. అటనొక జైనముని వారికిఁ గనఁబడెను. అతఁడు త్రికాలవేది. ఆ మునికి కౌంతి భక్తిపురస్సరముగ నమస్కరించి కణ్ణకీ కోవలుల దుర్విధిని గూడఁ దెలియఁజేసెను. ఆ జైనముని మధురలో కోవలునకు సంభవించుముప్పును గ్రహించి కౌంతి నుద్దేశించి 'అమ్మా! విధి బలీయము. పురాకృత కర్మల ననుసరించి యేర్పడుశుభాశుభములనుండి మనము తప్పించుకొనఁజాలము. గాలి కాఱిపోవు దీపమువలె మన శరీరములనుండి జీవుఁడు నిష్క్రమించినవెంటనే మన జీవితములంతమై పోవును. కాని యర్హతుని యాదేశములను దెలిసికొని జ్ఞానసంపన్నుఁ డగుమానవుఁడు మాత్రము జననమరణాది దుఃఖజలధినుండి గట్టెక్కఁగలఁడు'' అని పలికెను.

అంత కౌంతి 'ఆ యరివన్ దేవునికిఁ దప్పఁ బెఱదైవతములకు నేను నమస్కరింపను. అర్హతుని యాదేశముల నెల్లఁ

దెలిసికొని తదనుగుణముగ నేను బ్రవర్తింతును' అని నుడువఁగా నా జైనముని మిక్కిలి సంతసించి యా ముగ్వుర నాశీర్వదించి తన నివాసమునకుఁ జనెను.

పిమ్మట కౌంతితపస్విని కణ్ణకీకోవలులతోఁ గూడి యొక పడవ నెక్కి కావేరిని దాఁటి దక్షిణతీరమును జేరెను అట నొక దేవాలయ ముండెను అందుఁ గొంతనడి విశ్రమింప నభిలషించి యా ముగ్వురును గుడిలోనికిఁ జనిరి. అంతలోఁ బ్రేయసీద్వితీయుఁ డైన యొక కాముకుఁడుకూడ నా యాలయమునఁ బ్రవేశించెను. అతఁడు మలినమనస్కుఁడు. అతని ప్రేయసియు సర్వవిధముల నతనికిఁ దగినట్టిదే. కణ్ణకీకోవలుల మనోహరాకృతులను గాంచినదే తడవుగ నా కాముకీకాముకులు దిగ్భ్రమఁ జెందిరి. కౌంతిని జూచి వారు తమలోఁ దాము నవ్వుకొనిరి. అంత నా యువకుఁడు కణ్ణకీకోవలుల నుద్దేశించి 'తపస్వినీ! మీ వెంట నున్నయీయిరువురును రతీమన్మథులా ?'' అని కౌంతినిఁ బ్రశ్నించెను. ''వీరు రతీమన్మథులు కారు. నా బిడ్డలు. మేము మధురానగరమునకుఁ బోవుచున్నాము'' అని తపస్విని సహజముగ సమాధానమొసఁగెను.

అప్పు డా యువకుఁడు పెద్దపెట్టున నవ్వుచు ''సకల శాస్త్రముల సారమును గ్రహించిన యో యోగినీ! మీ సమాధానము చాల వింతగ నున్నది. ఈ దంపతులు తమకు బిడ్డలా ? ఎంత చిత్రము! ఒక గర్భమున జన్మించిన

స్త్రీ పురుషులు దంపతులుగా జీవితము సాఁగింతురా? ఈ యపూర్వవిషయమును నేను గనియు వినియు నెఱుఁగను" అనెను. అతని ప్రేయసియు నాతని మాటలను విని విఱుగఁబడి నవ్వసాఁగెను.

ఆ యువకుని పలుకులు కణ్ణకిహృదయమున ములుకులవలె నాఁటుకొనెను. ఆమెచెవులలో నా కటూక్తులు గింగురు మని ప్రతిధ్వనించుకొలఁది నామె 'నేఁడు వినరాని మాటలు వింటిని గదా' యని విచార మందసాఁగెను. కోవలుఁడు కూడ నా మలినమనస్కుని ప్రవర్తనమును గాంచి విషణ్ణుఁ డయ్యెను.

కౌంతి యా తరుణవయస్కుని మలినభావమును గ్రహించి యుగ్రురా లయ్యెను. ఆమె కన్నులు చింతనిప్పు లయ్యెను. కోపావేశముతో యోగిని "మీ రిరువును నక్కలై యీ విపినవీధులందు సంచరింతురుగాక!" అని శాప మిడిన తోడనే యా యువతీయువకులు జంబుకములుగా మాఱి యూళ లిడఁ దొడఁగిరి.

ఈ యద్భుతదృశ్యము కణ్ణకీకోవలులకు సంభ్రమాశ్చర్యములు కలిగించెను. తొలుత నా కాముకీకాముకులను కణ్ణకి ద్వేషించినను వారు నక్కలుగా మాఱినంతనే యామె నవనీతహృదయము ద్రవించిపోయెను. అప్పుడామె ప్రాంజలియై సవినయముగ "తపస్విని! తమ తపశ్శక్తి నేమని కొనియాడఁ గలను? తపోమహిమ యమోఘ మని నేఁడు తమ

పరిచయభాగ్యమువలనఁ దెలిసికొని ధన్య నైతిని. తమ శక్తిని గ్రహింపఁ జాలక వారు మిమ్ముఁ బరిహసించిరి. అజ్ఞానమే వారి దోషమునకుఁ గారణము. అందులకు వారిని మీరు శపించుట న్యాయ్యముగనే యున్నది. కాని జ్ఞానవిహీనులను దమవంటివారు కనికరింపవలయును'' అని నుడివెను.

కణ్ణకిమాటలు వినినయోగిని శాంతచిత్త యై కొంత తడవు యోచించి 'శాపము శాపముగా నుండవలసినదే. కాని వారిపై నాకును జాలి కలుగుచున్నది. ఒక్క సంవత్సర కాలము మాత్రము శాపము ననుభవించి పిమ్మట వారు యథారూపములను బడయఁగలరు'' అని నుడివెను. కణ్ణకి యందులకు మిక్కిలి సంతసించెను.

ఆ యాలయమును వీడి వారు ముప్వురును బ్రయాణము సాఁగించి వారణ మనునామాంతరము గల ఉఱైయూరు పట్టణమును జేరిరి. అట నున్నయొక జైనసంఘారామము నందు కణ్ణకీకోవలులును, కౌంతియు విశ్రమించిరి. యోగిని యర్హతుని సేవించి జైనమతధర్మములను బ్రశంసించుచు నుపన్యసించెను. ఆనాఁ డంతయు వా రా యారామముననే కాలము గడపిరి. ఆమఱునాఁడు మఱల వారు ప్రయాణము సాగించిరి

కణ్ణకి నడవఁజాలక పోయెను. ముండ్లు, ఱాళ్లు, కొమ్మలు. ఆకు లలములు—మున్నగువానితో నిండియున్న యా త్రోవను బ్రయాణ మొనర్చుటకు కోవలునకుఁ గూడఁ

గప్త మనిపించెను. అందులకుఁ దోడుగా నెండ వేఁడిమియు దుర్భరముగ నుండెను. యోగిని వారి యవస్థను గ్రహించి, "ఇఁక మనము పగటివేళలందుఁ గాక రాత్రిసమయములందే ప్రయాణము సేయుదము" అనెను. కణ్ణకీకోవలు లందులకు సంతసించిరి. అంతలో నా త్రోవనె గొతెంచుచున్న బ్రాహ్మణపాంథుఁ డొకఁడు కోవలునిఁ గలిసికొనెను. ఆ పాంథునివలన మధురానగరమునకుఁ బోవు మార్గమును, నా మార్గమునందలి వన దేవతి లొనర్చుకుతంత్రములను కోవలుఁడు తెలిసికొనెను పిమ్మట కణ్ణకీకోవలు లొక వృక్షచ్ఛాయను విశ్రమించిరి. యోగినికూడ విశ్రమించెను

అప్పుడు కోవలునకు దాహ మయ్యెను. కాఁగా నతఁడు చెంత నున్న జలాశయమునొద్దకు వెళ్లెను. అట వన దేవత వసంతమాలవలె రూపము గైకొని కోవలుని సమీపించి వలవల విలపించుచు నిట్లనెను. "అయ్యా! మీ వియోగమును భరింపఁజాలక మాధవి దుర్భరదుఃఖజలధిలో మునిఁగిపోయియున్నది. తాను ధరించినయమూల్యాభరణముల నన్నిటిని విర క్తమనస్కయై యామె పరిహరించినది. అంతే కాదు. ఏ పాపము నెఱుఁగని నాపై నొక నేరము మోపి తుదకు నన్నుఁ దనగృహమునుండి తఱిమి కొట్టినది. దిక్కు లేనినన్ను మీరు తప్పక కనికరింపవలయును." ఈ మాటలు విని నంతనే కోవలునకు బ్రాహ్మణుఁడు చెప్పినవన దేవతల కుతంత్రములు స్మృతిపథమునకు వచ్చెను. తోడనే యతఁడు దైవమును

ప్రార్థింపఁగా వనదేవత నిజరూపమును ధరించి తన తప్పును మన్నింపుమని కోవలునిఁ గోరెను. కోవలుఁడు పిమ్మటఁ దాను రాకుదొన్నెలయందు నీరు నింపుకొని కణ్ణకిని సమీపించెను.

భానుని తైక్ష్ణ్య మంతకంతకు నధిక మగుచుండెను. ఆ యెండుటెండలోఁ బయన మొనర్చుట కష్టతర మని భావించి తపస్విని తన యనుచరులతోఁ గూడి సమీపముననే యున్న యొక తోఁటలోనికిఁ జనెను. అట నొక కాళీదేవాలయ ముండెను. అచ్చట కణ్ణకీకోవలులును, కౌంతియు విశ్రమించిరి. అంతలో నా యాలయమునకు 'మఱవ'కులాంగన యగు శాలిని యను నొక బాలిక విచ్చేసెను. ఆమె వ్యాఘ్రచర్మమును ధరించియుండెను. ఆమె భయంకరాకృతి చూపఱకు భయముఁ గొలుపుచుండెను. ఆమెకుఁ బూనకము వచ్చెను కాఁబోలు! శాలిని బిగ్గఱగా నిట్లనెను. "పూర్వము మీరు నాకు బలి యిచ్చెద మని వాగ్దానము చేసియుంటిరి. కాని బలి యిచ్చుట మానివేసితిరి. అందువలననే మీ మఱవకులమునకు నానాఁటికి శక్తి తగ్గిపోవుచున్నది. పూర్వపు ధైర్యస్థైర్యములను మీరు పొందవలయు నన్నచో మీ వాగ్దానము నిర్వర్తింపుఁడు."

తత్క్షణమే మఱవలు బలి యొసఁగి కాళీదేవిని సంతృప్తిపఱచిరి. అంత శాలిని తన భక్తబృందమునకు కణ్ణకిని జూపుచు "ఈమెయే నారీరత్నము. ఈ సాధ్వియే తమిళనాడును నచిరకాలమునఁ బరిపాలింపఁగలదు" అనెను.

ఆమెమాటలు విని కణ్ణకి మందహాస మొనర్చి ''ఆవేశముచే పలికినపలుకు లవి'' యని భర్తతో నుడివెను. పిమ్మట మఱి వలు తనివి తీర మద్యము సేవించి యాడుచు నోటికి వచ్చిన ట్లెల్లఁ బాడుచు కాలము గడపిరి.

సాయంసమయ మయ్యెను. ఎండవేఁడిమి తగ్గఁ జొచ్చెను. మసకచీఁకటులు నలుమూలల నలముకొనెను. కొంతసేపటికిఁ జంద్రోదయ మయ్యెను. అవని యంతయు ధవళ కాంతులచే నిండిపోయెను. యోగినితోఁ గూడి కణ్ణకీకోవలులు మఱల ప్రయాణము సాగించిరి. రాత్రిసమయ మగుటచే గుడ్లగూబల రొదలు, ఋక్షముల యఱపులు మున్నగునవి ప్రస్ఫుటముగ వినవచ్చుచుండెను. వానిని విని కణ్ణకి భయ భ్రాంత యయ్యెను. యోగిని యామెకు ధైర్యము నుడువుచుఁ దనకుఁ దెలిసినజైనగాథలను జెప్పుచుండెను. కణ్ణకి భర్తను వెన్నంటి నడవసాగెను. అటుల నా రాత్రి యంతయు నడ వఁగా మఱునాఁటి యుదయ మగుసరికి వా రొక గ్రామముఁ జేరుకొనిరి.

ఆ జనపద మొక యగ్రహారము. ఆ యూరికోవెలకు సమీపమున నున్నయొక వనమున కౌంతియు, కణ్ణకియు విశ్రమింపఁగా కోవలుఁడు కాలోచితకృత్యములఁ దీర్చుకొన నెంచి యొక చెఱువుదగ్గఱకుఁ జనెను. ఒంటరిగ నుండుటచేఁ గాఁబోలు కోవలునకుఁ దన సహచరి పడుచున్నయవస్థ లన్నియు స్ఫురణకు వచ్చెను. నిశ్చేష్టుఁడై యతఁడా చెఱువు

గట్టున నిలిచిపోయెను. అప్పుడే యొక బ్రాహ్మణుఁడు చెఱువు లోనికి దిగుచు కోవలునిఁ జూచి యెందులకో సంశయించి. భృంగము నుద్దేశించి యిట్లనెను. "ప్రియు నెడఁబాసిన మాధవివలె నీ వేల దుఃఖించుచున్నావు?"

మాధవి యని వినినదే తడవుగా నాతురతో కోవలుఁడు బ్రాహ్మణుని సమీపించెను. ఆతనిసంశయము లన్నియు నడు గంటెను అప్పు డా బ్రాహ్మణుఁడు కోవలునితో మాధవీ వృత్తాంతమును నుడువఁ దొడఁగెను. కోవలుని నన్వేషించుటకుఁ గాను మాధవిచే నియుక్తుఁ డైనయాబ్రాహ్మణునిపేరు కౌశికుఁడు.

"నీవు భార్యాద్వితీయుఁడవై కావేరీపట్టణమును విడనాడిననాఁటినుండియు నీ తలిదండ్రులు శోకార్ణవమున మునిఁగిపోయిరి. నీ బంధుమిత్రాదులు కూడ నీకై దుఃఖించుచున్నారు. ఇఁక మాధవినిగుఱించి నుడువ నవసరమే లేదు. అహరహము నీకై యామె పరితపించుచున్నది. ఆమె పంపఁగా నేను నీకై దక్షిణాపథ మంతయుఁ దిరిగితిని. ముక్కుపచ్చలారని మణిమేఖల కూడ నీకై కలవరించుచున్నది" అని కౌశికుఁడు నుడివి మాధవి యిచ్చినయుత్తరమును కోవలున కొసఁగెను.

కౌశికునిమాటలు కోవలునకు హృదయవిదారకము లుగ నుండెను. ఆర్ద్రనయనములతోఁ గోవలుఁడు మాధవి వ్రాసినలేఖను జదివి 'అయ్యో! మాధవిని సంశయించితిని.

ఆమె నిరపరాధిని. ఆమెను క్షమించితి' నని యామెతోఁ జెప్పుము. నచ్ఛీలమే సుభూషణముగా మణిమేఖల యభ్యుదయము సెందవలయు నని నే నభిలషించుచున్నాను'' అని యా బ్రాహ్మణునితోఁ జెప్పెను. పిదపఁ దనజననీజనకుల నుద్దేశించి కోవలుఁడు కౌశికునితో నిట్లనెను. ''నిర్ధనుఁడనై యున్న నన్నుఁ జూచి మన బంధుమిత్రాదులు పరిహసింతురు. కావున మధురానగరమున వర్తకము సాగించి పూర్వపుటౌన్నత్యమును గడించినపిమ్మటనే నేను కావేరీపట్టణమునకు వత్తును. మే మిరువురమును క్షేమముగ నున్నామని మా బంధుమిత్రు లందఱితోఁడను నుడువుము.''

అంత కౌశికుఁడు కోవలునియొద్ద సెలవు దీసికొని కావేరీ పట్టణమునకుఁ బ్రయాణ మయ్యెను. కోవలుఁడు కౌంతియు, కణ్ణకియు నున్నయావనమునకుఁ జనెను. ఆసమయమున నా గ్రామమందలి బ్రాహ్మణులు కొందఱు వీణాగానముఁ జేయుచుండిరి. కోవలుఁడు వారిని సమీపించి యచట నొక విపంచిని సంవాదించి వీణాగానముఁ జేసెను. ఆతని ప్రజ్ఞావిశేషములఁ గాంచి యాబ్రాహ్మణులు మిక్కిలి సంతసించిరి.

పిమ్మట యోగినియు, కణ్ణకీకోవలులును మధురానగరమునకుఁ బ్రయాణము సాగించిరి. తన్నగర మింకను గనుచూపుమేరదూరములో నున్న దనఁగానే యేనుఁగుల ఘీంకారములును, గుఱ్ఱముల సకిలింపులును, నగారామ్రోఁతలును కణ్ణకీకోవలులకు వినవచ్చెను. బ్రాహ్మణుల వేదఘోషయు,

సైనికుల వీరాలాపములును వారికి శ్రవణగోచరము లగుచుండెను. వానిని విని నకొలఁది కోవలున కంతు లేని సంతోషము గలుగుచుండెను. అంతలో వారు వైఘునదిని సమీపించిరి.

"ఇదియే వైఘునది. మహాకవులు కీర్తించిన వైఘునది. దీని యవ్వలితీరముననే మధురానగర మున్నది" అని కౌంతి కణ్ణకీకోవలులతో నుడివెను. ఆ పవిత్రసరిత్తును సమీపించినంతనే తానేదో పవిత్రభూమియం దడుగిడుచుంటి నని కోవలుఁడు భావించెను. ప్రస్ఫుటముగ వినఁబడుచున్న శ్రీ మీనాక్షీసుందరేశ్వరుల యాలయమునందలి ఘంటారావము లతనికి దివ్యానుభూతులు కలిగింపసాగెను.

వైఘునదీప్రవాహమును గాంచి కణ్ణకీకోవలులు సంభ్రమాశ్చర్యములు సెంది "యిది పుష్పప్రవాహము గాని కేవల జలప్రవాహము గా"దని తలఁచిరి. పడవలమీఁదుగా నసంఖ్యాకజనము వైఘును దాఁటుచుండెను. కౌంతియు, కణ్ణకీకోవలులును నొకపడవ నెక్కి యానదిని దాఁటి, పోక తోఁటలు, అరఁటితోఁటలు, కొబ్బరితోఁపులు మున్నగు వానిమీఁదుగఁ బోయి పోయి తుద కొకజనపదమును జేరిరి. మధురానగరపుఁ బొలిమేర నున్నయాగ్రామమున సన్న్యాసులు నివసించుచుండిరి. యోగిని యాదేశానుసారము కణ్ణకీకోవలు లానాఁ డంతయు నా గ్రామమునందే యుండిరి.

మఱునాఁడు కోవలుఁడు నగరములోనికిఁ జని యచట వర్తకులను గలసికొన నభిలషించెను. అందువలన నతఁడు

యతనికిఁ దన నగలపెట్టె నొసఁగి యందున్న యుంగరము వంటిదే మఱియొకటి చేసి యిమ్మని యతని నాజ్ఞాపించెను. ఆ సమయమున నగలపెట్టెలో నున్న మంజీరములలో నొక దానిని మాత్రము తస్కరించి స్వర్ణకారుఁ డద్దానిని విదేశీయుఁ డగు నొక యవనవర్తకునకు విక్రయించెను. ఆ వైదేశికుఁడు తన దేశమునకుఁ బ్రయాణమై వెడలి పోయెను. పిమ్మట స్వర్ణకారుఁ డేమియుఁ దెలియనివానివలె నటించుచు నా నగలపెట్టెను మహారాణియగు కోప్పెరుందేవి కందఁ జేసెను.

కోప్పెరుందేవి నగలపెట్టెను దెఱచి చూడఁగా నందు మంజీర మొక్కటి కానరాదయ్యెను. ఆమె భయభ్రాంత యగుచు విలపింపఁ దొడఁగెను. మఱుక్షణమే మంజీరము పోయిన విషయము మహారాజగు నెడుంజెలియన్ ప్రభువునకుఁ దెలియఁ జేయఁబడెను.

నెడుంజెలియన్ న్యాయమూర్తి యని ప్రసిద్ధి వహించి యుండెను. అతఁ 'డార్యవిజేత' బిరుదవిరాజితుఁడు. పాండ్యరాజులు తమ యంతఃపురప్రాంగణమున నొక గంటను గట్టి యుంచిరి. ప్రజల కెట్టిముప్పు వాటిల్లినను దానిని బ్రభువునకుఁ దెలుపవలయు నన్నచో నా గంటను మ్రోఁగింపవలయును. ఆ ఘంటానాదమును విని వచ్చి రాజు వారి వెతలకుఁ గారణ మారయును. అట్టిది పాండ్యభూపతుల న్యాయపరిపాలనము! నెడుంజెలియన్ పరిపాలనాకాలమునందు విజయ ఘంటలు మ్రోఁగెను గాని యంతఃపురమునందలి యా ఘంటమాత్రము మ్రోఁగలేదు.

రాణిమంజీరము తస్కరింపబడినవిషయమును దెలిసికొనిన నెడుంజెలియన్ తన యాస్థానస్వర్ణకారుని సంశయించి "మంజీర మెక్కడ?" అని యతనిని గద్దించి యడిగెను. అందుల కా యగసాలి సవినయముగ నిట్లనెను. "ప్రభూ! ఈ విషయమై నా కేమియుఁ దెలియదు. మంజీరమును దస్కరించిన యా వంచకుఁ డెవ్వఁడో నే నెఱుఁగను. పూర్వము తమ దర్శనార్థమై రాయశారి నని యేతెంచిన యా వంచకుఁడు యువరాజుగారిహారమును నపహరించినట్లుగానే మంజీరమును గూడ నట్టిద్రోహి యెవ్వఁడో యపహరించి యుండ నోపును."

స్వర్ణకారుఁ డెంత యుక్తియుక్తముగ మాటలాడినను నెడుంజెలియన్ ప్రభుపుంగవునకు మాత్ర మతనియందే సంశయము దృఢ మయ్యెను. కాఁగా నతఁడు "మంజీరమును గాని దానిని దొంగిలించినతస్కరునిఁ గాని నీవు గుర్తింపవలయును. లేదేని నీ విషయము నగరన్యాయాధిపతికిఁ దెలియఁజేయఁబడును ఒక్కక్షణములో నతఁ డాచూకీ తీయఁగలఁడు" అని స్వర్ణకారునితోఁ జెప్పెను. నాఁటినుండియు నాతనికి మనస్సు మనస్సులో లేదు. తన్ను సంరక్షింపు మని యాతఁడు దైవములకు మ్రొక్కులిడెను.

అందువలననే కోవలునియొద్ద నున్న మంజీరమును గాంచినంతనే స్వర్ణకారున కెక్కడ లేనిసంతోషము గలిగెను. పనితనములోను, బరిమాణములోను కోవలుని మంజీరము

రాణిమంజీరమును దలఁపించుచుండుటచే స్వర్ణకారుఁడు తన భాగ్యదేవత తనపైఁ గనికరము సూపె నని భావించెను. వెంటనే యతని శోకమలినభావము స్ఫురించెను. 'కోవలుని మంజీరము నేను తస్కరించినమంజీరమువలె నున్నది. కనుక నీ విషయమును ప్రభువులకుఁ దెలిపినచో నాపై నున్నయను మానము వారికిఁ దొలఁగిపోవును. కోవలునకా యీ పట్టణమున బంధుమిత్రాదు లెవ్వరును లేరు. అతనియందే నే నినేరమును మోపెదనుగాక!' ఈ మలినభావము స్ఫురించినదే తడవుగ నా స్వర్ణకారుఁడు రాజాంతఃపురాభిముఖుఁడై చరచర నడవసాగెను.

మంజీరము పోయిననాఁటినుండియు కోప్పెరుందేవి చింతాక్రాంత యై యుండెను. అదియునుగాక యామె పూర్వమువలెఁ దనభర్త తనయందు బద్ధానురాగుఁడై లేఁడని తలఁచి రాజుతో మనసిచ్చి మాటాడకుండెను. అందుచే నెడుంజెలియన్ రాణిని స్వయముగఁ గలసికొన నెంచి యామె మందిరమునకు వెడలుచుండెను.

అంతలో స్వర్ణకారుఁడు "దేవర వారికి జయ" మనుచుఁ బ్రవేశించి నెడుంజెలియన్ పాదసన్నిధిని వ్రాలెను.

అతనిని జూచినదే తడవుగ రాజు "మంజీరము లభించినదా?" అని ప్రశ్నించెను.

"లభించినది ప్రభూ!" అని ప్రత్యుత్తర మిడి స్వర్ణకారుఁ డింకను నిట్లనెను. "ప్రభూ! ఆయుధముల సహా

యము లేకయు, నంతఃపురరక్షకవర్గమును మోసపుచ్చియు రాణిగారి నగలపెట్టెనుండి మంజీరమును దొంగిలించిన యా గజదొంగను మాయింటను బంధించియే యిచ్చటికి వచ్చితిని. ఆతఁ డామంజీరమును నాకే యమ్ముటకు యత్నించెను. చూచితిరా వాని గుండెనిబ్బరమును! ప్రభూ! తమరు తత్‌క్షణమే యా చోరునియొద్దనుండి మంజీరమును స్వాధీనము చేసికొని యాతనికిఁ దగినశిక్ష విధింపుఁడు.''

అగసాలి పలికినయాపలుకులను విని నెడుంజెలియన్ చాల సంతసించెను. ఇఁకఁ దన దేవేరిదుఃఖము తీఱిపోవు ననియు, మంజీరమును వెదకి తెప్పించినందులకు రాణి యెంతయో తన్నుఁ గీర్తించు ననియు నెడుంజెలియన్ తలపోసెను. ఆతనిహృదయము పట్టపుదేవినిఁ జూచి యామె ప్రశంసను బొందవలయు నని తహతహలాడఁ జొచ్చెను. అప్పు డా కామాంధుఁడు 'ఎవరక్కడ ?' నని యధికారస్వరమునఁ బలికెను.

వెంటనే యంతఃపురరక్షకులు ముగ్గురు నెడుంజెలియన్ ప్రభువును సమీపించి యాజ్ఞకై నిరీక్షించుచుండిరి.

పాండ్యభూపతి కామపరవశుఁ డగుటచే న్యాయ విచారణము గావింపకయే స్వర్ణకారుని మాటలను వేద వాక్కులుగా విశ్వసించి యా రక్షకభటుల నుద్దేశించి యిట్లాజ్ఞాపించెను. ''ఈ స్వర్ణకారుని వెంటఁ బోయి మహారాణిగారి మంజీరమును దొంగిలించిన యానీచుని వధింపుఁడు. ఆతనియొద్ద

నున్నయందెను బరీక్షించి యది రాణిగారిదే యని మీరు పోల్చుకొనినచో నా దొంగను వెంటనే యచ్చటనే చిత్రవధ గావించి యందెను మాయొద్దకుఁ దీసికొని రండు. అట్లు చేసిననే కాని చోరులకు భయము గలుగదు. పొండు. త్వరగాఁ బొండు.''

తాను పన్నినకుతంత్రము ఫలించినందులకు సంతసించి స్వర్ణకారుఁడు బుజము లెగురవైచుకొనుచు నా ముగ్గురు రక్షకభటులను వెంట నిడికొని గృహోన్ముఖుఁ డయ్యెను. కొంతసేపటికి స్వర్ణకారుఁడు సపరివారుఁడై కోవలుఁ డున్నయాలయమును సమీపించెను. అప్పు డతఁడు కోవలునితో ''రాజాజ్ఞ ననుసరించి యీ రాజభటులు నీ యొద్ద నున్న మంజీరమును జూడ నేతెంచిరి'' అనెను. కోవలుఁ డా యందియను వారికిఁ జూపెను. ఆ భటు లామంజీరమును దిలకించి 'యిది మహారాణిగారిదే' యని తెప్పపాటులోనే నిర్ణయించిరి. కాని కోవలుని గంభీరాకృతిని గాంచి యా భటులక్కజము నెందిరి. అంత వారు స్వర్ణకారునితో ''అయ్యా! యీాయన గొప్పయింటిబిడ్డఁడుగ నున్నాఁడు. దొంగవలెఁ గనఁబడుట లేదు'' అని నుడివిరి.

''ఏమేమి! ఇతఁడు దొంగవలెఁ గనఁబడుట లేదా? ఏమి విపరీత మిది! మహారాణిగారి మంజీరము నీతనియొద్దఁ జూచినను మీరు సంశయించుచున్నారా? చోరులు మంత్రశాస్త్రఘటికు లనియు, మత్తుమందులు చల్లి యితరు

లను మోసపుచ్చుదురనియు మీకుఁ దెలియదు కాఁబోలు. ఈతనిని వెనువెంటనే మీరు రాజాజ్ఞప్రకారము శిక్షింపకున్నచో మీపై మత్తుమందుఁ జల్లి మీ శౌరినుండి యితఁడు తప్పించుకొని పాఱిపోవఁగలఁడు. అప్పుడు మీరు ప్రభునాజ్ఞను నిర్వర్తింపనివా రగుదురు. అగుట రాజుగారి కోపాగ్నికి మీరు భస్మీభూతులు కాఁగలరు. కనుక మీనమేషములు గణించుట మాని రాజాజ్ఞను నిర్వర్తింపుఁడు'' అని స్వర్ణకారుఁడు నుడివి భటులను దొందరపెట్టసాఁగెను.

అంతలో నొక భటుఁడు ''అగు నగును. చోరులు వయవంచకులు. వారిని నమ్మఁగూడదు. ఒకనాఁటిరాత్రివేళ నేను నగరమున గస్తీ తిరుగుచుంటిని. అప్పు డొక మోసగాఁడు నా కంటఁ బడెను. నన్నుఁ జూచినతోడనే యతఁడు కొదమసింగమువలె మీఁది కుఱికెను. వెంటనే నేను కత్తి జళిపించితిని. అతఁ డెట్లో నా కత్తిని దీసికొని యాకటికి చీఁకటిలో మాయమై పోయెను. కనుకనే మంత్రతంత్రములలో నాఱితేఱినయీచోరులను నమ్మరా దనుట. రాజాజ్ఞను నిర్వర్తించుటయే మనకు మంచిది'' అని నుడువుచుండఁగా నంతలో నొక మోటుమానిసి యగుభటుఁడు తన కరవాలముతోఁ గోవలునికంఠమున నొక్క వ్రేటు వ్రేసెను.

ఆ కత్తివ్రేటుతో రక్తసిక్తమైనకోవలుని కంఠము రెండు తునియ లయ్యెను. కోవలుని శరీరముక్రిందఁ బడి

పోయెను. ఆ ప్రదేశ మంతయు రక్తమయ మయ్యెను. ఎవ రనుకొందురు కార్యార్థమై నగరమునకు వచ్చినవానికి దుర్మరణము సంభవించు నని ? విధివిలాసము చిత్రాతిచిత్రము గదా !

అటుపిమ్మట నా రాజభటులు స్వర్ణకారునితోఁ గూడి యంతఃపురమును బ్రవేశించి నెడుంజెలియన్ ప్రభువును దర్శించి తాము తెచ్చినమంజీరము నాతనిసమక్షమున నుంచిరి. మహారాజు మహానందము నొందెను. ఘనకార్య మొనర్చి మంజీరమును గొనివచ్చినయా భటులను, స్వర్ణ కారుని యథోచితముగ సత్కరించి నెడుంజెలియన్ కోప్పె రుందేవి నివాసమునకుఁ బోయి యా యందియ నా మెకు నొసఁగెను. ఆమెముఖకమలము సంతోషముతో వికసించెను. మహారాజులుంగారి సంతోష మిఁక వర్ణనాతీతము.

అప్పుడే సాయంసమయ మయ్యెను. భానుఁ డస్త మించెను. నెడుంజెలియన్ తన నివాసమునకుఁ జనెను. ఎందు లకో కాని కోప్పెరుందేవికి నిద్రచేఁ గన్నులు కూరుకొని పోవుచుండెను. అగుటచే నామె తన శయనాగారమునకుఁ జనెను.

కోవలుఁ డింకను రాకపోవుటచే కణ్ణకి హృదయము కలఁతఁ జెందెను. అతని కేమి విపత్తు వాటిల్లెనో యని యామె శంకింపసాగెను. పాపము ! ఆమె మనస్సు మనస్సులో లేదు. అంతలో వైఘనదీతీరమున బలరామకృష్ణుల ప్రీత్యర్థమై

'కురవై 'నాట్య మొనర్చి గృహమునకు నేతెంచినమాధురి కణ్ణకిని సమీపించెను. ఆమె చింతాక్రాంతయై యుండెను. కణ్ణకి వయస్సును, సౌందర్యసౌశీల్యములను దలపోయుచు నామె శిలావిగ్రహమువలె నామెనే చూచుచు నిలువఁబడెను. నదీతీరమునఁ గర్ణాకర్ణిగా వినిన కోవలుని బలవన్మరణము మాధురిని గలవరపెట్టసాఁగెను. ఆ విషాదవిషయమును కణ్ణకి కెట్లు తెలియఁజేయుటయా యని యామె మిక్కిలి విచారించుచుండెను. ఆమె కేమియు స్ఫురింపక యిరుగు పొరుగుల నున్నయాఁడుపడుచులను జేరఁదీసి వారితో మాధురి తాను వినినవిపరీతవిషయమును నుడివెను.

మాధురి యేమియు మాటాడక పోవుటచేఁ గణ్ణకి తనభర్త కేదియో విపత్తు సంభవించె నని సంశయించి తనసఖి అయ్యైతో దీనముగా నిట్లనెను. "నాభర్త యేలకో యింకను నగరమునుండి తిరిగి రాలేదు. నా హృదయ మేమో కీడు శంకించుచున్నది. మాధురి నన్నుఁ జూచి యేమియు మాటాడలేదు. నా భర్తకు జరగరాని దేదియు జరగలేదు గదా! నీవైన నన్నుఁ గనికరించి నాతోఁ జెప్ప రాదా? నన్నుఁ జూచుచు నీయాఁడువారందఱు నేవో గుస గుస లాడుకొనుచున్నారు. ఏమి జరిగినదో త్వరగా నుడువుము."

కణ్ణకి పలికినదీనోక్తులను విని సహింపఁజాలక అయ్యై "అమ్మా! ఏమని చెప్పుదును. అంతఃపురములో మహారా-

ణిగారి మంజీరము నెవరో దొంగిలించిరఁట. ఆ దొంగతన
మును నీ భర్తపై మోపి మహారాజుగారు కోవలుని హత్య
గావించినారు" అని దుఃఖభారము నడఁచుకొని చెప్పెను.

హత్య యనుమాట శ్రవోయుగళిలో మ్రోఁగినంతనే కణ్ణకికన్నులనుండి నీటిబిందువులు జలజలరాలెను; కనకనలాడు నిప్పురవ్వలు నేలఁబడెను. ఆమె దుఃఖస్వాంత యయ్యెను, కోపావేశపరవశ యయ్యెను. ఆ సౌందర్యతిలక శోకరసాధి దేవతగా-కాదు-శక్తిస్వరూపిణిగాఁ దోఁచెను. కణ్ణకి క్రిందఁ బడెను, తల బాదుకొనెను. గోడు గోడున విలపించెను. "అయ్యో! నాధా! నన్ను విడిచి వెళ్లితివా" అని యామె వాపోయెను. క్రోధోద్వేగమును సహింపఁజాలక కణ్ణకి 'తస్కరుఁడా, నా వల్లభుఁ'డని గర్జించుచు లేచెను. ఆ గర్జనము ఘనఘనారావమును దలంపునకుఁ దెచ్చెను.

"ప్రత్యక్షదైవ మని విజ్ఞులు సంభావించుచున్నయో సహస్రకిరణుఁడ! కర్మసాక్షి! ప్రపంచమునందు జరుగుచున్న సర్వవిషయములను నీవు చూచుచున్నావుగదా! నా భర్త తస్కరుఁ డేమో నీవే చెప్పుము. శ్రీకృష్ణునిప్రీత్యర్థమై కురవైనాట్య మొనర్చి వచ్చినయో గోపికలారా! మీరైనఁ జెప్పుఁడు. చెప్ప రేమి!" యనుచుఁ గణ్ణకి వారి నడిగెను.

"నీ భర్త చోరుఁడు గాఁడు. నిష్కారణముగ నతఁడు హత్య గావింపఁబడినాఁడు. ఈ మధురానగరము త్వరలోనే దగ్ధము కాఁగలదు" అని యశరీర పలికెను.

ఆ మాటలు విని యట గుమి గూడిన స్త్రీ పురుషు లెల్లరు భయము నెందిరి. అధర్మముగ సంచరించినతమమహా రాజున కెట్టి ముప్పు వాటిల్లునో యని వారు దిగులుపడ సాఁగిరి.

అంతఁ గణ్ణకి తనయొద్ద నున్నమంజీరమును జేతఁ బట్టుకొని తన్నుఁ బరివేష్టించినజనసమూహమును జూచి "మీరు న్యాయము నశించిపోయిన యీ నగరమున నివసించుచున్నారు. నా భర్త చోరుఁడు కాఁడు. అతనియొద్ద నున్న మంజీరము నపహరింపఁ దలఁచి గదా నా భర్తను హత్య గావించితిరి ! నేనే కనుకఁ బతివ్రత నైనచో సజీవుఁడై యున్న నా భర్తను జూచి యతనితోఁ నేను మాటాడెదనుగాక ! అట్లు నేను జేయఁజాలకపోయిన నన్ను హీనకులసంజాతనుగా భావింపుఁడు' అనెను. పిమ్మట కణ్ణకి తన నివాసము వీడి యా మంజీరము నటులనే తన చేతియందే యుంచుకొని నగరము నకుఁ బయన మయ్యెను. ఆమెకు సహాయముగ మధురానగర వాసులు పలువురు కోవలుఁడు విగతజీవుఁడై పడియున్న ప్రదేశము కడకు వచ్చిరి.

కణ్ణకి తన భర్త మృతశరీరమును సమీపించునప్పటికిఁ గటికిచీఁకటి పడెను. ఆమె యాశవముపైఁ బడి విలపింపసాఁగెను. ఆమెదుఃఖమే యా నిశీధమున వినఁబడుచుండెను. పెండ్లినాఁటి కోవలుఁ డామె కన్నులలో మసలుచుండఁగా నా పూర్వమధురస్మృతుల నన్నిటి నేకరువు పెట్టుచుఁ గణ్ణకి విలపించుచుండెను. "నాథా ! ఒక్కతూరి

నాతో మనసిచ్చి మాటాడుము. నేను నీ ప్రేయసిని. అయ్యో! ధూళిధూసర మైన నీ సుకుమారశరీరమును నా యీపాడు కన్నులతో నేడు చూడవలసి వచ్చినదిగదా! బంధుమిత్రాదుల నందఱను విడిచి యెచ్చటి కేఁగితివి? ఈ మధురానగరము గొడ్డు వోయినది. ఈ యన్యాయమును ప్రతిఘటించు పురుషశ్రేష్ఠులు గాని లేరా? దేవుఁడు మాత్ర మున్నాఁడా?" పతివ్రతలుగాని, అని కణ్ణకి యా మృతశరీరమును కౌఁగిలించుకొనెను.

ఆ సమయమున నిద్రనుండి లేచినవానివలె విగతఁజీవుఁ డైనకోవలుఁడు పునరుజ్జీవితుఁడై లేచి కణ్ణకి కన్నీటిని దుడుచుచు "చంద్రబింబమువంటి నీ నెమ్మొగము వాడివత్తలై యున్నది!" అనెను. అప్పుడు తన జీవితేశ్వరుని చరణసన్నిధిని జేరి యామె దుఃఖించుచుండఁగా కోవలుని యాత్మ యీ తుచ్ఛలోకమును వీడి దేవలోకమును జేరెను. అతని భౌతిక శరీరము మాత్ర మట మిగిలెను.

"నీ భర్త చోరుఁడు. కావున హత్య గావింపఁ బడినాఁడు" అనుమాటలు కణ్ణకి చెవులలో మాఱు మ్రోఁగఁజొచ్చెను. ఇఁక విలపించి లాభము లే దనుకొని యామె తన నాథునిపై మోపఁబడిననేరము సత్యదూర మని పాండ్యమన్నీనికిఁ దెలియఁజేయవలయు నని నిశ్చయించుకొనెను. తోడనే కణ్ణకి నెడుంజెలియన్ యంతఃపురమునకుఁ బయన మయ్యెను.

ఉదయ మయ్యెను. కాని యా గతరాత్రి కోప్పెరుందేవికి నిద్రలోఁ బాడుకలలును, దుర్నిమిత్తములును గన్పట్టు

టచే నామె భయభ్రాంతయై నెడుంజెలియన్ సభాభవనము నకు వేంచేసెను. దీనవదనయై యున్నయామెను జూచిన దే తడవుగా సింహాపీఠి నలంకరించియున్న యా మహారాజు కలత సెంది "దేవి! ఇంత ప్రొద్దుననే యేల వచ్చితివి?" అని ప్రశ్నింపఁగా కోప్పెరుందేవి తన స్వప్నవృత్తాంతము నిట్లు నుడువసాగెను. "ప్రభూ! తమ రాజదండమును, శ్వేతచ్ఛత్రము నుభూపతన మైనట్లును, నంతఃపురమునందలి యా పెద్దగంట మ్రోఁగినట్లును, నాకస మంతయు మెఱపుతీఁగలతో నిండి యున్నట్లును, బగటియందే తోకచుక్కలు పడినట్లును, దిక్కు లన్నియు దద్దరిల్లి పోయినట్లును నేను గలఁ గంటిని. ఈ దుర్నిమిత్తములవలనఁ దమ కెట్టి ముప్పు వాటిల్లునో యని నేను భయమందుచున్నాను."

నెడుంజెలియన్ కోప్పెరుందేవి స్వప్నగతవృత్తాంత ములను శ్రద్ధగ వినుచుండెను.

అంతలో నొక ద్వారికుఁడు సభాభవనమునఁ బ్రవే శించి ముకుళితహస్తుఁడై సవినయముగ రాజుతో నిట్లనెను. "జయము జయము ప్రభువులకు! జయము జయము దక్షిణా పథచక్రవర్తులకు! న్యాయము జరుగలేదని యొక స్త్రీ తమ దర్శనార్థమై వేచియున్నది. ఆమె భద్రకాళివలె నున్నది. దుర్గాదేవిని దలఁపించుచున్నది. ఆమెచేత మంజీర మొకటి యున్నది."

"ఆమెను బ్రవేశపెట్టుము" అని నెడుంజెలియన్ నుడివెను.

కణ్ణకి యంతఃపురమును బ్రవేశించెను. ఆమె భయంకరాకృతినిగాంచి యచటి దౌవారికులు భయభ్రాంతులయిరి.' "మతిలేనిమహీపతిని సేవించుసేవకులారా! నా రాకను మీ ప్రభువునకుఁ దెలుపుఁడు" అని కోపముతో కణ్ణకి నుడివినంతనే దౌవారికు లెల్లరును దమ రాజున కేమి విపత్తు సంభవించునో యని సంశయించిరి.

రాజాజ్ఞ కాఁగానే కణ్ణకి నెడుంజెలియన్ సభాస్థలికిఁ జనెను. ఆమెయొడ లంతయు ధూళిధూసరమై యుండెను. కపోలములందుఁ గన్నీటిచారలు కనఁబడుచుండెను, జడలు విరియఁబోసికొని యుండెను. కణ్ణకిని జూచినంతనే నెడుంజెలియన్ దయార్ద్రహృదయుఁ డయ్యెను.

"అమ్మా! నీ వెవరవు?" అని రాజు కణ్ణకిని బ్రశ్నించెను.

తన దుర్భరకోపావేశము నడఁచుకొనఁజాలక తోడనే కణ్ణకి యిట్లనెను.

"మతి లేనిమహీపాల! కన్నకుమారుని రథచక్రములక్రింద లేఁదూడ యొకటి పడి మరణించినహేతువుచే, ధర్మసంరక్షణార్థమై యాతనిపైఁ దన రథమును నడపించి యే ప్రభుపుంగవుఁడు ధర్మస్వరూపుఁ డని విశేషవిఖ్యాతి సముపార్జించెనో యట్టి రాజవతంసునివంశీయులకు రాజధానీనగరమై విరాజిల్లు పుహార్ పట్టణమే నా నివాసస్థలము. ఆ నగరమునందలి వణిక్ప్రవరులలో మిన్న యనిపించుకొనినమహా

సత్తువ్వని కుమారుఁ డగుకోవలుఁడు నా పతి దేవుఁడు. దుర్విధి ప్రభావమున నా మంజీరము నొక్కటి విక్రయింప నెంచి నీ పట్టణమునకు రాఁగా హత్య గావింపఁబడినయా నిర్దోషికిఁ బత్నిని నేను. నా పేరు కణ్ణకి.''

''అమ్మా! నీ భర్త మహారాణి ధరించుమంజీరము లలో నొకదానిని దొంగిలించినాఁడు. చోరుని శిక్షింపు మనియే కదా నీతిశాస్త్రము చెప్పుచున్నది! కావున చోరుఁ డైననీనాథుని శిక్షించితిమి.''

''నిర్దోషిని జంపుట శిక్ష యనిపించుకొనదు. హత్య యగును.''

''అమ్మా! నీ భర్తపై నీకుఁ గల ప్రేమాతిశయముచే నీ వట్లు నుడువుచున్నావు. ఆతఁడు మంజీరముతోడనే మాకుఁ బట్టుపడినాఁడు. అనాలోచితముగా మేము మాత్రము శిక్షింతుమా?''

''ప్రభూ! నీవు కూడ నొక చక్రవర్తివా? ఒక నిరప రాధియొక్క నిండుప్రాణమును నిష్కారణముగ నీ పొట్టఁ బెట్టుకొంటివి. ఇంకను సింహాపీఠి నలంకరించుచున్నా వేమి?'' నెడుంజెలియన్ ప్రభువు రుద్రుఁ డయ్యెను.

''నీ మాటలు కోటలు దాఁటుచున్నవి సుమా!''

''రాజా! నా భర్త తస్కరుఁడు కాఁడని నిరూపించు టకే నే నిచ్చటకి వచ్చితిని. నా మంజీరమునందు మణులు గలవు....''

"మా మంజీరమునందు ముత్యములు గలవు" అని నుడివి నెడుంజెలియన్ "ఎవ రక్కడ" ననెను.

వెంటనే యొక సేవకుఁడు పాండ్యరాజును సమీపించెను.

"కోవలునియొద్దనుండి తీసికొని రాఁబడినమంజీరమును గొని రండు."

ఆ సేవకుఁడు లోనికిఁ జని యా నూపురమును గొని వచ్చి దానిని గణ్ణికిసమక్షమున నుంచెను. ఆ యందెను జూచి యది కోవలునకుఁ దా నొసఁగినమంజీరమే యని కణ్ణకి విశ్వసించెను. కోపావేశముతోఁ గణ్ణకి "ప్రభూ! మీ మంజీరమున రత్నము లున్నవి, నా మంజీరమున మణు లున్నవి" యనుచు నా యందెను బ్రద్దలు కొట్టెను.

మంజీరము ముక్కలు ముక్క లయ్యెను. అందలి మణులు చెదరి నలుమూలలఁ బడెను. కొన్ని మణులు నెడుంజెలియన్ మొగమునకుఁ దగిలి క్రిందఁ బడెను. తత్క్షణమే యా ప్రభుపుంగవుని శ్వేతచ్ఛత్రము నేల కొరగెను, న్యాయదండము వ్రాలెను.

నెడుంజెలియన్ భయవిహ్వలుఁ డయ్యెను. విషణ్ణుఁ డయ్యెను, పశ్చాత్తప్తుఁ డయ్యెను. "అయ్యో! నే నెంతటి మూర్ఖుఁడను! ఒక స్వర్ణకారుని మాటలను నమ్మి ధర్మవిరుద్ధముగ సంచరించిన నేనా చక్రవర్తిని! కోవలుఁడు చోరుఁడు గాఁడు. నేనే దొంగను, అతని ప్రాణములను పొట్టఁ బెట్టు

గొన్నదాఁగను నేనే. న్యాయమూర్తు లని విఖ్యాతి నార్జించిన మా పాండ్యవంశీయులకు నేను గళంకము తెచ్చిపెట్టితిని. నేనే న్యాయవిరుద్ధముగఁ బ్రవర్తించితిని. ఈ పరాభవమును భరించుటకంటె నేను మరణించుటయే మేలు" అనుచు మతిభ్రమణము నెంది నెడుంజెలియన్ మహారాజు సింహాసనమునుండి క్రిందఁ బడి విగతజీవుఁ డయ్యెను.

కోప్పెరుందేవి హృదయము శోకార్ణవ మయ్యెను. కాని కణ్ణకిభీకరరూపమును గాంచుకొలఁది కోప్పెరుందేవి కీ ప్రపంచము శూన్యముగఁ దోఁచుచుండెను. ఆమె కణ్ణకిపాదపద్మములపైఁ బడి క్షమింపు మని కోరెను పిమ్మట కోప్పెరుందేవి తననాథుని పాదసన్నిధిని జేరి విలపింపసాఁగెను. కొంత సేపటికి భర్తృసేవాపరాయణ యైన కోప్పెరుందేవి కూడ నెడుంజెలియన్ వలె నీ యిహలోకమును వీడెను.

రాజదంపతు లిట్లుల నకస్మాత్తుగ స్వర్గము నలంకరించుటను దిలకించుచుండిన పరిచారకవర్గము దుఃఖసముద్రమున మునిఁగిపోయెను. ఈ విషాదవిషయ మొక త్రుటికాలము లోనే మధురానగరము నలుమూలలకుఁ బ్రాకిపోయెను. తన్నగరవాసులు తీర్థప్రజవలె నేతెంచి రాజదంపతులకు నశ్రుతర్పణము గావించిరి.

కణ్ణకి కింకను క్రోధాగ్ని చల్లాఱలేదు. "ఈ రాజాంతఃపురముగూడ నశించునుగాక" యనుచు కణ్ణకి కోపావేశముతో నంతఃపురమును వీడి నగరములోనికిఁ జనెను. వెంటనే రాజ

ప్రాసాదమున నలువైపుల ధూమము మెగయుచుండెను. ఆ పొగలను జూచి మంత్రులు, నితరప్రభుత్వోద్యోగులును భయవిహ్వాలులయిరి. వాని నార్పుటకుఁ బ్రయత్నములు గూడ జరిగెను. కాని లాభము లేదయ్యెను. కన్నులపండువు గొలుపు నా యంతఃపురము దగ్ధమై పోయెను.

పిమ్మటఁ గణ్ణకి తన వామకుచమును నూడఁబెఱికి మధురానగరముపై విసరుచు "నేనే కనుకఁ బతివ్రత నైనచో నాథ రత్నను హతమార్చినదుష్టులకు నిలయ మైన యీ నగరముగూడ దగ్ధమై పోవును గాక" యని శపించెను. అప్పుడు హవ్యవాహనుఁడు ప్రత్యక్షమై "అమ్మా! నీ యాజ్ఞను నిర్వర్తించుటకే నే నిచటికి వచ్చితిని. ఎవరిని రక్షింపవలయును? ఎవరిని నశింపఁజేయవలయును? నీ యానతి యైనచో మధురను దగ్ధము గావించెదను" అని కణ్ణకి నడిగెను.

అంత నామె "అగ్నిదేవ! బ్రాహ్మణులు, న్యాయశీలురు, గోవులు, పతివ్రతలు, వృద్ధులు, బాలురు—వీరిని విడనాడి దుష్టుల నందఱను నశింపఁజేయుము" అని యగ్నిభగవానునిఁ గోరెను.

తోడనే యగ్నికీలలు నలుమూలల కెగఁబ్రాకెను. దిక్పాలురు భయము నెందిరి. వణిక్ప్రముఖులు, వారకాంతలు, కార్మికులు—పలువురు మరణించిరి. సకలసంపదలకు నెలవై కలకలలాడుచున్న యీ మధురానగరము పసుపుకుంకుమములఁ బాసినపడఁతివలెఁ గళాకాంతులు లేక పాడువాఱి పోయెను.

అప్పటికిని గణ్ణకి శాంతింపలేదు. ఆ సమయమున మధురను సంరక్షించుదైవ మగుమధురనాయిక కణ్ణకి యెదుట సాక్షాత్కరించి "అమ్మా! నెడుంజెలియన్ పైఁగల కోపముతో మధురానగరమును మంటలపా లొనర్చితివి. కావేరీపట్టణపరిపాలకులవలెఁ బాండ్యభూపతులుకూడ న్యాయ సమ్మతముగ రాజ్యము చేసినవారే. నీవు ద్వేషించిన నెడుం జెలియన్ ప్రభువు ధర్మస్వరూపుఁడు. కనుక నీ భర్త మరణిం చుటకు నెడుంజెలియన్ కారణభూతుఁడు గాఁడు. పురాకృత కర్మయే నీ యీ దుస్థితికిఁ గారణము. ఆ కథను నుడివెదను. వినుము" అని కణ్ణకిని సమాశ్వాసించి యామెతో నిట్లు చెప్పసాగెను.

"పూర్వము కళింగదేశమందలి సింహపురాధీశ్వరుఁ డగు వసువునకును, గపిలపురాధిపతి యైన కుమరుఁ డనువాని కిని దీఱనివైర ముండెను. వారిరువురును సదా కలహము లాడుకొనుచుండెడివారు. ఇట్లుండఁగా నొకనాఁడు సింహ పురవిపణివీథిలో వ్యాపారముఁ జేసికొనుచున్న సంగముఁ డనువర్తకునిఁ దన్నగరరక్షకభటనాయకుఁ డగు భరతుఁడు చూచెను. సంగముఁడు కపిలనగరమునుండి యేతెంచిన రహస్యవార్తాహరుఁ డనుకొని భరతుఁ డా విషయమును వసురాజునకు విన్నవించెను. రాజు న్యాయవిచారణము సలు పకయే భరతుని మాటలను విశ్వసించి నిష్కారణముగ సంగ మునిఁ జంపించెను. సంగముని బలవన్మరణమును విని యాతని భార్య యగునీలి దుఃఖస్వాంత యయ్యెను. ఆమె పదునాలుగు

దినములు పలుతావులు తిరిగి తిరిగి తుదకొక కొండ నెక్కి యచటినుండి క్రిందికి దూకెను. అటుల నీలి భర్తృమరణానంతరము ప్రాణములు వీడెను. ఆమె కొండనుండి దూకుచు 'మాకుఁ దీఱనిదుఃఖము గలిగించినవారు మావలె దుర్భర దుఃఖము ననుభవింతురు గాక ! యని నుడివెను. ఆ భర్తయే యీ జన్మమున కోవలుఁడుగా జన్మించినాఁడు. నీలి యుసురు నీకుఁ దగిలినది. కావుననే నీ కీ దుస్థితి సంభవించినది. ఇంకను బదునాలుగుదినములు గడచినపిమ్మట నీవు నీభర్తను గలసికొనఁగలవు.''

ఇటుల నుడివి మధురనాయిక యదృశ్య యయ్యెను.

మధురానగరమును దగ్ధము గావించినందులకుఁ గణ్ణకి పశ్చాత్తాపము నెందెను. అయినను నామె కింకను మన శ్శాంతి లభింపలేదు. మధురలో నుండుటకే యామెకు మన స్కరించినది కాదు. కావునఁ గణ్ణకి యా నగరమును వీడి వైఘనదీతీరము ననుసరించి యుత్తరముగఁ బయనము సాఁగించెను. అఁకలిదప్పులను మఱచి రేయి యనక పవల నక శ్రమదమములను సహించి కణ్ణకి యటులనే పదునాఁడు దినములు ప్రయాణ మొనర్చెను. పదునాలుగవదినమున నామె చేర దేశమునందలి 'తిరుచ్చెంకుంట్రు' అనుకొండను జేరుకొనెను. కణ్ణకి సుబ్రహ్మణ్యస్వామికి నివాస మగునా కొండ నెక్కి యట నున్న యొక నేరేడుచెట్టుక్రింద నిలువఁబడెను.

తిరుచ్చెంకుండ్రు 'కుఱవ' లనుకొండజాతివారికి నివాసస్థానము. వారు కర్షకులు, సుబ్రహ్మణ్యస్వామివారి భక్తులు. కుఱవమహిళలుకూడఁ దమ పురుషులతోఁబాటు పొలము పనులలోఁ బాల్గొనుచుందురు. రాత్రిసమయములందు వారు గంతులు వేయుచు 'కుఱింజి' పాటలు పాడుచుందురు. అప్పుడప్పుడు చేరరాజులు విహారార్థమై యాకొండకు వచ్చుచుండెడివారు.

సాయంసమయ మగుటచేఁ గుఱవలు పొలము పనులు ముగించుకొని తమ తమ యిండ్లకుఁ బోవుచుండిరి. త్రోవలో నేరేడుచెట్టుక్రింద నున్నకణ్ణకి వారి కగపడెను. దీనవదనయై యున్నయామెను జూచినదే తడవుగ వారు కణ్ణకిని సమీపించి "అమ్మా! నీ వెవరవు?" అని ప్రశ్నించిరి. ఆమె సౌందర్యాతిశయమున కబ్బురపడుచు నామె తమ కులదైవ మగువల్లీదేవి యై యుండనోపు నని వారు తలంచుచుండఁగఁ గణ్ణకి యిట్లనెను. "పురాకృతకర్మలకు ఫలితముగ మధురానగరమున భర్తను గోల్పోయినమహాపాపమతిని నేను. నా భర్తృమరణమునకుఁ బాండ్యభూపతియే కారకుఁ డని తలఁచి యాతని నగరమైనమధురను దగ్ధము చేసితిని. త్వరలోనే నేను నాభర్తను గలసికొని దేవలోకమునకుఁ జన నున్నాను."

కణ్ణకిపలుకులు కుఱవసంఘమునకు సంభ్రమాశ్చర్యములు కలిగించెను. ఆమెయందు వారికి భక్తిభావ మేర్పడెను.

అంతలో దేవలోకమునుండి యొకవిమాన మరుదెంచెను. దివ్యాకృతితో వెలుఁగొందుచున్నకోవలుఁ

డం దుండెను. దేవతలు సతీదేవి యగుకణ్ణకిని గూడ నా విమానమునం దధివసింపఁ జేసిరి. పిమ్మట నా విమానము దేవలోకమునకుఁ జనెను.

ఈ యద్భుతదృశ్యమును జూచుచుండిన కుఱవలకు కణ్ణకియందు భక్తిభావము దృఢతర మయ్యెను. ఆమెయే తమ యిలువేలుపని వారు భావించిరి. ఆ జంబూవృక్షచ్ఛాయ నొక విగ్రహమును ప్రతిష్ఠించి ధూపదీపములతో వారు సతీదేవిని బూజించిరి. ఆ సమయమున కుఱవలు కుఱంజిపాటలు పాడి కణ్ణకిని స్తుతించిరి. పిమ్మటఁ దాము కనుగొన్న యీ యద్భుతమును చేరరాజునకుఁ దెలియఁజేయు నభిలాషతో వారు చేరరాజధానీనగర మగువంజికి పయన మయిపోయిరి.

అప్పుడు చేరరాజగు సెంగుట్టువన్ సపరివారుఁడై విహారార్థము పెరియార్ నదీతీరమునకు వచ్చియుండెను. ఆ నదియందలి యిసుకతిన్నెలందు సుఖాసీనుఁడై చేరరాజు మహాకవి శాత్తనార్,[1] ఇళంగో అడిగళ్[2] మున్నగు వారితో నిష్టాగోష్ఠి జరపుచుండెను. వంజిమహానగరమునకుఁ

1. మణిమేఖల కావ్యకర్తయితఁడు. చేరరాజునకు సమకాలికుఁడు.

2. సిలప్పదికార కృతికర్త యగు నితఁడు సెంగుట్టువన్ సహోదరుఁడు. ఇతని నిజనామధేయ మేమియో మనకుఁ దెలియరాలేదు. ఇళంగో యనఁగా యువరాజు. అడిగళ్ అనఁగా పూజ్యపాదుఁడు. అగ్రజునియందలి ప్రేమానురాగములచే ఇళంగో రాజ్యరమను వరింపక సన్న్యాసాశ్రమమును స్వీకరించెను. కావుననే యితఁడు పూజ్యపాదుఁ డయ్యెను. తమిళమున సరసముగఁ గవిత లల్లఁగలిగినసమర్థుఁ డితఁడు.

ప్రయాణ మయినకుఱవలు పెరియార్ నదీతీరమున విడిసియున్న రాజును గాంచి మిక్కిలి సంతసించి యతనిని సమీపించిరి. వారు తాము గొనివచ్చిన యేనుఁగు దంతములు, వెల్లచామరములుఁ, గజ్జుజవ్వాదియు, జుంటి తేనెకుడుకలు, శ్రీచందనము, సిందూరము, హరిద్రాంజనములు, నారికేడములుఁ, దియ్యమామిడులుఁ, బోకలు, నేలకులుఁ, గొమ్మనఁటిపండ్లు, నల్లమిరియములుఁ, జెఱకుగడలుఁ, బూలతీవియలు, సింగపుఁ గొదమలుఁ, గ్రోఁతిపిల్లలుఁ, గాఱుకోళ్లు, నడవినెమళ్లు మున్నగువానిని సెంగుట్టువన్ సమక్షమున సవినయముగ నుంచిరి.

పిమ్మట కుఱవలు "ప్రభూ! ఇటీవల మనకొండమీఁద మే మొక యద్భుతమును గన్నులారఁ గాంచి తరించితిమి. మేము పనిపాటులు ముగించుకొని యిండ్లకుఁ జనుచుండఁగ నొక నేరేడుచెట్టుక్రింద నొక సాధ్వీమణి విచారవదన యై కూర్చుండియుండెను. ఆమెతో మాటాడుచుండఁగా నే దేవలోకమునుండి విమాన మొకటి వచ్చినది. ఆ విమానము నెక్కి యామె దేవలోకమునకుఁ జనెను. ఆమె యెవ్వరో మే మెఱుఁగము" అని రాజుతో విన్నవించిరి.

ఆ మాటలు విని సెంగుట్టువన్ సంభ్రమాశ్చర్య సంభరితుఁ డై శాత్తనార్ వైపు చూచెను. అప్పు డాకవివరేణ్యుఁడు "ప్రభూ! ఆమె సామాన్యురాలు కాదు. సతీదేవి యగునామె కథ నాకుఁ దెలియును" అనుచు నతఁడు కణ్ణకి యపూర్వగాథను రాజునకు సవివరముగఁ దెలియఁజేసెను. ఆ

గాథను వినుచున్నంతసేపును ఇళంగో అడిగళ్ హృదయము కణ్ణకిగాథకుఁ గావ్యరూపము నొసఁగవలయు నని తహతహలాడెను. కణ్ణకియెడ భక్తిప్రపూర్ణుఁడై సెంగుట్టువన్ తన దేవేరి నుద్దేశించి "దేవి! వింటివిగదా కణ్ణకిగాథను! పాండ్య మహారాణి పతిభక్తిపరాయణతను గూడఁ దెలిసికొంటివి గదా! వీ రిరువురిలో ని న్నాకర్షించిన దెవరు? ఎవరిని మన మారాధింతము?" అని ప్రశ్నించెను. అంత నామె యిట్లనెను. "పాండ్యమహారాణియుఁ గణ్ణకీదేవియు నిరువురును బరమపతివ్రత లనుటలో సందియ మాంవంతయు లేదు. అయినను మన దేశమునకు వచ్చి యిందినుండి దేవలోకమునకుఁ జనిన యా సతీదేవి యగుకణ్ణకీదేవిని మన మారాధించి చరితార్థుల మగుదము" రాణి యొసఁగినప్రత్యుత్తరమును విని సెంగుట్టువన్ మిక్కిలి సంతసించెను. పిమ్మట నతఁడు తన పరివారముతోఁ గూడి రాచనగరునకుఁ జనెను.

సతీదేవి యగుకణ్ణకి కొక యాలయమును నిర్మింపవలయు నని సెంగుట్టువన్ కృతనిశ్చయుఁ డయ్యెను. అయినను మంత్రులతోఁ గూడ నతఁడు సమాలోచనము నెఱపెను. ప్రభుహృదయమును గుర్తించి యా మంత్రులు 'పొదియిల్'[1] పర్వతమునుండి కాని, హిమవత్పర్వతమునుండి కాని యొక శిలను దీసికొనివచ్చి దానిని విగ్రహముగా మలఁచి కావేరీ

1. అగస్త్యుఁ డీ పర్వతముమీఁదఁ దపస్సు చేసె నని యైతిహ్యము. కావున దీనికి 'అగస్త్యకూటం' అనుపేరు కలిగినది. ఈ కొండ నేఁటి తిరువళ్వేలి తిరువాంకూరులమధ్య (పాండ్యదేశము) నున్నది.

జలములచేఁ గాని, గంగాతీర్థముచేఁ గాని యభిషేకించి ప్రతిష్ఠింతము'' అని విన్నవించిరి.

అంత సెంగుట్టువన్ ''పొదియిల్ పర్వతముననుండి శిలను దెచ్చుట యొక ఘనకార్యము కాదు. మునిప్రవరులును, దేవతలును నివసించుహిమాలయమునుండి శిలను దెచ్చుటయే సమంజసముగ నుండును'' అని నుడివెను. అప్పు డొక మంత్రిసత్తముఁడు లేచి ''ప్రభూ! తమ ధైర్యసాహసములు నాకుఁ దెలియనివి కావు. కనుక హిమవత్పర్వతముననుండి శిలను దెచ్చుటయే సమంజసముగ నుండు నని నేనును దలఁచుచున్నాను. అదియును గాక యార్యభూపతులు కొందఱు తమ కీర్తిని సంశయించినట్లు వినవచ్చినది. కావున వారి గర్వోద్రేకము నడఁచుటకై యుత్తరదేశమునకుఁ జని యా రాజులతో సమరము సాగింపవలయు నని నే నభిలషించుచున్నాను'' అని విన్నవించెను. అందులకు సెంగుట్టువన్ సమ్మతించెను. తోడనే చేరదేశమున యుద్ధసన్నాహములు ప్రారంభమయ్యెను. ఒక శుభముహూర్తమున సెంగుట్టువన్ సైన్యసమేతుఁడై యుత్తరాపథమును జయింపఁగోరి బయలు దేరెను.

కోవలుని దుర్మరణవార్త పుహార్ పట్టణమున బడబానలమువలె వ్యాపింపఁగా నతని వృద్ధజననీజనకులును, సత్తమామలును విచారసాగరమున మునిఁగిపోయిరి. ఆ దుర్భరదుఃఖమును భరింపఁజాలక కోవలుని తల్లియుఁ, గణ్ణకి తల్లియు వెంటనే మరణించిరి. మహాసత్త్వుఁడు తనసర్వస్వ

మును బీదసాదుల కొసఁగి బౌద్ధమతమును స్వీకరించి తదాశ్రమమునందే నివసింపసాఁగెను. మహానాయకుఁడు కూడ విరక్తమనస్కుఁడై యాజీవకమతమును గైకొనెను. ఇఁక మాధవియు నైహికభోగముల నెల్ల రోసి పరార్థసాధనమును గోరి బౌద్ధాశ్రమమును బ్రవేశించి భిక్షుకియై కాలము గడపఁ జొచ్చెను. ఆమె కుమార్తె మణిమేఖల—ముక్కుపచ్చలాఱని యా ముద్దుగుమ్మ—తనతల్లితోఁ బాటు బౌద్ధసంఘారామమునందు నివసింప సాఁగెను. కణ్ణకికి జరగినయన్యాయమును జూచి సహింపఁజాలక మాధురి యాత్మహత్య గావించుకొనెను. కౌంతితపస్విని ప్రాయోపవేశ మొనర్చెను.

కోవలుని మరణానంతరము మధురానగరమున వర్షాభావమువలన క్షామదేవత విలయతాండవము సేయ సాఁగెను. ఈ బాధలకు గుఱియై ప్రజ యలమటించిపోయెను. నెడుంజెలియన్ ప్రభువునకుఁ బిమ్మట రాజ్యమునకు వచ్చిన వెత్రివేల్ శెళి (ళ్రి) యన్ తన ప్రజలు పడుచున్న బాధలను జూచి సహింపఁజాలక కణ్ణకిని సంతృప్తి పఱుప నెంచి వేయిమంది స్వర్ణకారుల నామెకు బలి యిచ్చెను. నాఁటి నుండియు మధురానగరము పూర్వమువలె సుభిక్షముగ నుండెను.

విజిగీషువై యుత్తరాపథమునకుఁ జనిన సెంగుట్టువన్ తన్నెదిరించినరాజులతో యుద్ధములు నెఱపి విజయములు సాధించి హిమవత్పర్వతమునుండి యొక శిలను గైకొని యొక శుభముహూర్తమున స్వదేశమునకుఁ బయనమయ్యెను.

కొన్ని నెలలకుఁ బిమ్మట సైన్యసమేతుఁడై యతఁడు వంజీ మహానగరమును జేరెను.

వంజినగరమున సతీదేవికి సుందర మగునాలయ మొకటి నిర్మింపఁబడెను. సెంగుట్టువన్ గొనివచ్చినశిలను శిల్పాచార్యులు మలఁచి కణ్ణకివిగ్రహమును సుందరతరముగఁ దీర్చిరి. పిమ్మటఁ జేరమహీపతి మంత్రి పురోహితులతో నొక శుభముహూర్తమున సతీదేవ్యాలయమునకుఁ జని శాస్త్రోక్తముగ కణ్ణకివిగ్రహము నటఁ బ్రతిష్ఠించెను. సుమహారములతోడను, సుభూషణములతోడను సతీదేవి విగ్రహము సుభగముగ నలంకృతమై యుండెను. తదుత్సవాలోకనకుతూహలులై సింహళము నేలుగజబాహువు, మాళవ మహీపతి, కొంగుదేశపు భూపతి, యింకను మఱికొందఱు రాజన్యులానాఁడు వంజినగరమున కేతెంచి యుండిరి.

ఆ సమయమున దేవంతి, అయ్యై మున్నగువారు కూడ వంజినగరమునకు విచ్చేసిరి. దేవంతి కణ్ణకి విగ్రహమునకు సభక్తికముగ నంజలి ఘటించి "సఖీ! యీ నాఁడు నీవు చేసినమహోపదేశ మింకను నా చెవులలో మాఱుమ్రోఁగుచునే యున్నది. స్వప్నవృత్తాంతము సత్యదూరమగు ననియే నేను భావించితిని. కాని నీవు చెప్పిన దంతయు జరగనే జరగినది. కోవలుని బలవన్మరణవార్తను విని నీ తల్లియు, నీ యత్తయు వెంటనే ప్రాణములు వీడిరి. మాధురి కూడ శోకభారముతో మరణించినది. ఇదిగో చూడుము. మాధురి కుమార్తె అయ్యై నీ సన్నిధికి వచ్చి నిలిచియున్నది" అని నుడివెను.

అప్పుడు కణ్ణకి తటిల్లతలను బోలు తన పాదముల నపరంజి యందియలను, కటిసీమఁ గనక మేఖలను, గరములఁ గంకణయుగళమును, శ్రోత్రముల సురుచిరాభరణములను దాల్చి దేదీప్యమాన యై సాక్షాత్కరించెను. మనోమోహన మైన యా సతీదేవి దివ్యరూపమును గాంచి సెంగుట్టువన్ భక్తిప్రపూర్ణుఁ డయ్యెను. అంతఁ గణ్ణకి "పాండ్యభూపతి ధర్మమూర్తి. అతఁడు దేవలోకమున మహేంద్రునిచే సమ్మానితుఁ డగుచున్నాఁడు, నా భౌతికశరీరవిముక్తికిఁ గారకుఁ డగుటచే నాతఁడు నాకుఁ బితృతుల్యుఁడు" అని పలికిన పలుకులు గగనవీథిని బ్రతిధ్వనించెను.

అంతలో దేవంతికి నావేశము వచ్చి యిట్లనెను. "దానధర్మములు గావింపుఁడు. భక్తులను సేవింపుఁడు. పరులను బాధింపకుఁడు. యౌవనమును, సిరిసంపదలును శాశ్వతములుగావు కావున జీవితమును వ్యర్థ మొనర్పవలదు. సత్కార్యాచరణమే సద్గతికి సోపానము. పురాకృతకర్మముల ననుసరించియే యుత్తరోత్తరజీవితములందు శుభాశుభము లేర్పడుచుండును."

తదాదిగాఁ గణ్ణకి సతీదేవి (పత్నికక్కడవుళ్) యను పేరున సేవింపఁబడుచుండెను. కాలక్రమమునఁ దమిళ దేశమున సతీదేవ్యాలయములు పలుతావుల వెలసినవి. గజబాహువు కూడ సింహళదేశములో నొక సతీదేవ్యాలయమును నిర్మించెను.

చోళదేశమున జనన మంది, పాండ్యమండలము నందుఁ బాతివ్రత్యమును వెలయించి చేరదేశమున భౌతికమును జాలించినకణ్ణకి దివ్యచారిత్రము దేదీప్యమాన మై తేజరిల్లుచున్నది. ఆమె పవిత్రజీవనఘట్టములు కావేరీనదీజలములవలె చేరచోళపాండ్యము లనుప్రాచీనతమిళరాజ్యత్రయమును పెనవేసికొని పవిత్రతను గాంచినది!

# జీవక చింతామణి

శృంగారప్రధాన మగునీకావ్యము తిరుత్తక్కదేవర్ అను నొక జైనమునిచే సంతరింపఁబడెను. తమిళ వేదకర్త యగు తిరువళ్లువర్ ప్రభవమందిన మైలాపూరు (మదరాసు) నందే యీతఁడును జనన మొందెనని తమిళపండితుల విశ్వాసము. 'చోళకులాబ్ధిశంఖము'గా (సాహ్యకుల మాగియు కడిలిళే పిఱన్ద వలంబురి) నీతఁడు పేర్కొనఁబడి యుండుటచే, తిరుత్తక్కదేవుఁడు చోళవంశీయుఁ డని నుడువఁదగును. ఈతఁడు క్రీ. శ. 5 వ శతాబ్దపువాఁ డని పండితులును, క్రీ. శ. 10 వ శతాబ్దమునకుఁ జెందినవాఁ డని పరిశోధకవిద్వాంసులును విశ్వసించుచున్నారు.

తిరుత్తక్కదేవుఁడు జీవకచింతామణి, నరివిరుత్తం అనుసుద్గ్రంథములను రచియించి పడి సన్నవాఁడు. కాని వానిలోఁ గావ్యయశస్సును జేకూర్చుకొనినది జీవకచింతామణియే యని పేర్కొనవలసి యున్నది ఈకావ్యమునకు 'ముడిపొరుళ్ తొడర్నిలై సెయ్యుళ్' అనునామాంతరము గలదు. ధర్మార్థకామమోక్షము లనుచతుర్విధ పురుషార్థములు నీ కావ్యమున వివరింపఁబడినహేతువుచే దీనికీ పేరు కలిగెను. 'మణనూల్' అను మఱియొకపేరు కూడ దీనికిఁ గలుగు జైనమతధర్మములను, విశ్వాసములను, నాఁటి సాంఘికాచార వ్యవహారములను సుస్పష్ట మొనర్చుచున్న యీ కావ్యము నందలి యితివృత్తమునకు సంస్కృతమాతృక యుండుట గమనింపఁదగువిషయము. క్షత్రచూడామణి, గద్యచింతామణి, శ్రీపురాణము మున్నగుగ్రంథములు జీవకునిచరిత్రము నభివర్ణించుచున్నవి. కాని యీ గ్రంథములలో జీవకచింతామణీకావ్యమునకు మాతృక యేదియో యిదమిత్థ మని పేర్కొనుట సులభము గాదు. మనోహరమగువర్ణనలతోడను, మంజులశైలితోడను జెలువారుచున్న యీ కావ్యము ననుసరించి తరువాతికాలపుఁ దమిళకవులు తమ కావ్యముల వెలయించిరి. కావున జీవకచింతామణీ ప్రాశస్త్యము నుగ్గడించుటకుఁ బయివిషయ మొక్కటియే చాలును. ఈ గ్రంథమునకు నచ్చినార్కినియార్ అనునతఁడు ప్రశస్తమగు నొక వ్యాఖ్యానమును వెలయించెను.

---

## ఈకథయందలి పాత్రలు :

—*—

| | |
|---|---|
| సత్యంధరుఁడు | (సచ్చందన్) |
| జీవకుఁడు | |
| కాష్ఠాంగారకుఁడు | (కట్టియంగారన్) |
| గంధోత్కటశ్రేష్ఠి | (కందుక్కడన్) |
| ఆర్యనంది | (అచ్చణంది |
| మదనుఁడు | |
| పద్మకుఁడు | (పదుముగన్) |
| నపులుఁడు | |
| విపులుఁడు | |
| నందాస్యుఁడు | (నందట్టన్) |

| | |
|---|---|
| విజయ | విమల |
| సునంద | సురమంజరి |
| గోవింద | లక్షణ |
| గాంధర్వదత్త | |
| గుణమాల | |
| పద్మ | (పదుమై) |
| ఖేచరి | (కేమచరి) |
| కనకమాల | |

——

# 3

పూర్వము హేమాంగదరాజ్యమున రాజమహాపుర మనునగర మొకటి యుండెను. అది ప్రకృతిలక్ష్మికి నిలయము, పయిఁడిపంటలకుఁ గొంగుముడి. అట టెంకాయతోఁపులును, పోఁకతోఁటలును, మామిడితోఁపులును, ననఁటితోఁటలును విస్తారముగఁ గలవు. తన్నగరమును సత్యంధరుఁ డనుమహీపతి పరిపాలించుచుండెను. అతఁడు కురుకులోద్భవుఁడు. ఆతఁడు విదేహచక్రవర్తియుఁ, దన మాతులుఁడు నగుశ్రీదత్తుని తనయ యైనవిజయను వివాహ మాడెను. ఆమెయే యతనికి సర్వస్వము. ఎల్లప్రొద్దులు నతఁడు తన దేవేరితో సరససల్లాపము లాడుచు రాజ్యవ్యవహారములను గూడ విస్మరించెను. అట్టి కామాతురుఁ డతఁడు!

సత్యంధరుఁడు పాలనావ్యవహారములందుఁ దూష్ణీంభావుఁ డై యుండుటను జూచి యతని యమాత్యులు విషణ్ణహృదయులయిరి. నిమిత్తకుఁ డనునొకసచివప్రవరుఁ డొకనాఁడు తన ప్రభువును సమీపించి యతనితో రాజ్యవ్యవహారములఁబని గొను మని సవినయముగ విన్నవించెను. కాని యాతని హితోక్తులను బెడచెవిని బెట్టి యాతఁడు రాజ్యపాలనాధికారమును దన ముఖ్యమంత్రి యగుకాష్ఠాంగారకుఁ డనువాని యధీన మొనర్చెను. నాఁటినుండియు సత్యంధరుఁడు దేవీద్వితీయుఁ డై యంతఃపురమునందే ఱేపుమాపులు సుఖాంబుధి నోలలాడుచుండెను.

కాష్ఠాంగారకుఁడు మహామేధావి యైనమంత్రిసత్తముఁడు. బాహుబలసంపన్నుఁ డగుయుద్ధవీరుఁడు. అనేకయుద్ధములందుఁ బాల్గొని యరాతిసమూహములను జెల్చి చెండాడినఘనుఁడు. కావున నతఁ డనిన సత్యంధరునకు గౌరవాభిమానములు మెండుగా నుండెను. కాని రాజ్యాధికారము తన హస్తగత మయిననాఁటినుండియు కాష్ఠాంగారకుఁడు క్రమముగా మలినమనస్కుఁడు గాఁ దొడఁగెను. రాజును హతమార్చి యాతని రాజ్యము నెట్లయిన నపహరింపవలయు ననుదురుద్దేశ మతనికిఁ గలిగెను. అతఁడు తన బావమఱఁది యగుమదనునితోఁ గూడి మాయోపాయములు పన్నసాఁగెను.

ఇది యిట్లుండఁగ విజయ గర్భవతి యయ్యెను. ఆమెకు నెలలు నిండెను. ఒకనాఁ డామె సత్యంధరుని సమీపించి యాపూర్వరాత్రి తనకు వచ్చినస్వప్నవృత్తాంతము నాతనికి నివేదించుచుండెను. అశోకవృక్ష మొకటిభూపతిన మైనట్లును, నా తరుచ్ఛాయలక్రింద నొక బాలవృక్షము పెరుఁగుచున్నట్లును, నా బాలవృక్షమున మౌక్తికమాలాష్టకము వ్రేలాడుచున్నట్లును విజయ కలఁ గనెను. దీని యర్థ మేమని యామె యాతురముతోఁ దనభర్తను బ్రశ్నించెను. అంత సత్యంధరుఁడు కొంతవడి యాలోచించి యామెను గనుఁగొని యిట్లనెను. "దేవి! అశోకవృక్షము భూపతన మగుట నా మరణమును సూచించుచున్నది. బాలవృక్ష మొకటి పెరుఁగుచున్నదని నుడివితివి. అది నీకుఁ ద్వరలో పుత్రోదయము గాఁగల

దని తెలుపుచున్నది. అతని కెనిమిది వివాహములు జరఁగు నని యీ మౌక్తికమాలాష్టకము సూచించుచున్నది.''

సత్యంధరుఁడొసఁగినసమాధానము విజయకు సంతాప హేతు వయ్యెను.

ఆసమయమున సైన్యసమేతుఁడై కాష్ఠాంగారకుఁడు రాచనగరున నున్న సత్యంధరుని మార్కొనెను. తోడనే సత్యంధరుఁడు తనకు రాఁబోవువిపత్తును గ్రహించి విజయను మయూరాకారమున నున్నయొక విమానమునం దధివసింపఁ జేసి యామెను బుట్టినింటికిఁ బంపెను. పిమ్మట నతఁడు ధైర్యముఁ దెచ్చుకొని కాష్ఠాంగారకునితోఁ గదనమునకుఁ గడంగెను. ఆ యుద్ధమునందు సత్యంధరుఁడు వీరస్వర్గము నలంకరించెను. ఆతనిరాజ్యము కాష్ఠాంగారకుని హస్తగత మయ్యెను. తత్క్షణమే యతఁడు మదనునితో మంతనము లాడి సత్యంధరునిరాజ్యము తనవశ మైనటుల నగరమునఁ బ్రకటించెను. విజయభేరీనినాదములు మిన్ను ముట్టెను.

గగనవీథిని జనుచున్న విజయకు విజయభేరీనినాదములు శ్రవోయుగళిలో మాఱుమ్రోఁగెను. ఆమె భర్తృమరణము నభ్యూహించి దుఃఖార్ణవమున మునిఁగిపోయి మూర్ఛ నందెను. కాఁగా నా విమానము ముందునకుఁ బోవఁ జాలక యా నగర శ్మశానవాటికయందు మెలమెల్లనఁ గ్రిందికి దిగఁ జొచ్చెను. కొంతసేపటికి విజయ యొక పురుషశిశువును గని మాతృ స్థానము నలంకరించెను. అప్పటికే నలుదిశలఁ జీఁకటు లలముకొనెను. దారి తెన్ను గానక పోవుటచే విజయ విలపిం

చుచు నా పసికందు నుద్దేశించి యిటుల నుడివెను. "సకల రాజభోగముల ననుభవింపవలసిన నీ వీ శ్మశానమునందు జన్మించితివి. ఈ రాత్రిసమయమున నే నెందుఁ బోదును ? నా చింతామణి! నా దుఃఖమును బోకార్ప నవతరించిన ని న్నెట్లు నేను సంరక్షింపఁ గలదానను ?"

ఇటుల విజయ కన్నీరుమున్నీరుగా విలపించుచున్న సమయమున నా రుద్రభూమియందలి యొక దేవత యామె ప్రియసఖి యగుచంపకమాలవేషముఁ దాల్చి యామెయెదుటఁ బ్రత్యక్ష మయ్యెను. ఆ దేవత విజయను మృదూక్తులతో నూరడించి యామెయొద్ద నున్నసత్యంధరుని యుంగరము నా శిశువు చేతియం దుంచెను. ఆ యంగుళీయకముమీఁద సత్యంధరుని పేరు లిఖిత మై యుండెను. అంత నా దేవత విజయతో "అమ్మా! దుఃఖింపకుము. నీ కుమారున కేమియు భయము లేదు. ఆబుడుతని నొకవర్తకుఁడు పెంచి పెద్ద చేయును. కనుక నతఁడు వచ్చునందాఁక మన మొకచోట దాఁగియుండుదము" అని యామెను సంతృప్తిపఱచి యా శిశువు నొకచోటఁ బరుండఁబెట్టెను. దేవతయు, విజయయు నొకచెట్టుచాటున దాఁగియుండిరి.

అప్పు డొక వణిజుఁడు తన కుమారుని మృతకళేబరమును భూమియందు నిక్షేపింపఁ దలఁచి యా శ్మశానమున కేతెంచెను. అతఁడు గంధోత్కటశ్రేష్ఠి యనువణిగ్వరుఁడు. అతఁ డానగరమునందలి ధనికుల తలమానికము. ఆ వర్తకుఁడు తన కుమారుని కళేబరమును నిక్షేపించి యింటికిఁ దిరుగు

ముఖముపట్టెను. విజయ నేలపై విడిచియుండిన యా
శిశు వా సమయమున నతనికి దృగ్గోచర మయ్యెను. తోడనే
యతని కంతు లేనిసంతోషము గలిగెను. పిమ్మట
నతఁ డా బుడుతనిచేత నున్నయుంగరమును గాంచి 'ఈతఁడు
రాజవంశీయుఁడు. కనుక నే నితనిని వేయికండ్లతో సంరక్షిం
తును గాక !'' అని నిశ్చయించి యా యంగుళీయకమును
బయల్పడనీయక గంధోత్కటుఁ డా పసికూనను లేవనెత్తి
తన చేతులలోనికిఁ దీసికొనఁ బోయెను. అప్పు డాబుడుతఁడు
తుమ్మెను. దానిని విని చెట్టుచాటున నున్న దేవత 'జీవ'
యని యాశీర్వదించెను.

గంధోత్కటశ్రేష్ఠి యాశిశువును దీసికొని శర
వేగమునఁ దన గృహమునకుఁ జనెను. మహానందమున
నతఁడు తన భార్య యగుసునందను బిలిచి ''ఇదిగో
చూడుము. మన చిరంజీవి సజీవుఁ డయినాఁడు'' అని నుడివి
యా చిన్నవానిని నామెచేతియం దిడెను. ఆతనిని జూచి
యామె తన కన్నులను నమ్మలేక పోయెను. తన యదృష్ట
మును వేనోళులఁ గొనియాడి యాడి సునంద యా శిశువును
తన కన్నకడుపుగా భావించి ప్రేమార్ద్రనయనములతో
వీక్షించెను.

శ్మశానమున నున్నవిజయ తన ప్రియసఖవేషమున
నున్న దేవత సాహాయ్యమున దండకారణ్యముఁ జేరెను.
అట నామె తన కుమారుని శ్రేయస్సును నభిలషించి తపస్సు
చేయసాఁగెను. ఆ దేవత వర్తకునింటఁ బెరుఁగుచున్న యా

శిశువు క్షేమసమాచారములఁ దెలిసికొనఁగోరి రాజమహా
పురమునకుఁ బయన మయ్యెను.

గంధోత్కటశ్రేష్ఠి యా కూనకు జీవకుఁ డని పేరిడెను.
సునంద యతనిని నల్లారుముద్దుగ సాఁకుచుండెను. ఇట్లుండఁగ
నామెకు నందాఢ్యుఁ డనుకుమారుఁ డుదయించెను. అయినను
సునంద జీవకునిఁ బ్రేమానురాగములతోనే పెంచుచుండెను.
జీవకుఁడు తన తమ్మునితోడను, నపులుఁడు విపులుఁడు
మున్నగుమిత్రులతోడను గలసి మెలసి సంచరించుచు వారి
యాదరమును జూఱగొనెను. గంధోత్కటుని యభిమతాను
సార మార్యనంది యనుపండితుఁడు జీవకునకుఁ జదువు
సంధ్యలు చెప్పఁదొడఁగెను. సూక్ష్మగ్రాహి యగుటచే నతఁడు
సకలవిద్యల నచిరకాలమునందే హృద్గత మొనర్చుకొనెను.
ధనుర్విద్యారహస్యములు కూడ నతనికిఁ గరతలామలకము
లయ్యెను. జీవకుని యనిర్వచనీయ మగుమేధాసంపదను,
ప్రతిభావిశేషములను గాంచి యార్యనంది యబ్బుర మంది
యతనికి ధర్మోపదేశము గావించెను.

ఒకనాఁ డార్యనంది జీవకుని నొకరహస్యప్రదేశము
నకుఁ దీసికొని పోయి తా నొకయున్నతాసనము నధివసించి
యతని కొకకథ నుడువసాఁగెను. "ఈ నగరమును సత్యం
ధరుఁ డనురాజు పరిపాలించుచుండెను. ఆతని దేవేరిపేరు
విజయ. అతఁడు రాజ్యాధికారమును కాష్ఠాంగారకుఁ డను
తన మంత్రి యధీన మొనర్చి యెల్ల ప్రొద్దులు నా దేవేరితో
సుఖించుచుండెను. అంత నొకనాఁ డా మంత్రిపైన్యసమేతుఁ డై

రాజాంతఃపురమును ముట్టడించెను. అప్పుడు నిండు చూలాలుగ నుండినవిజయ నొక మయూరవిమానమునం దామె పుట్టినింటికిఁ బంపి సత్యంధరుఁడు మంత్రితో యుద్ధము చేసి విగతజీవుఁ డయ్యెను. పిమ్మట విజయ మార్గమధ్యమున నా నగరశ్మశానముననే యొక పురుషశిశువును బ్రసవించెను. ఆ శిశువును గంధోత్కటశ్రేష్ఠి యనువర్తకుఁడు రుద్రభూమినుండి తెచ్చి తన భార్య యగుసునందకు నొసఁగెను''.

ఆ కతను వినినతోడనే జీవకుఁడు ''స్వామి! ఆ శిశు వెవరు?'' అని ప్రశ్నింపఁగ నార్యనంది ''నీవే'' యని నుడివెను.

జీవకుఁడు దుఃఖస్వాంతుఁ డయ్యెను. తనతండ్రి మరణమునకుఁ గారకుఁ డైన యా కాష్ఠాంగారకునిఁ గసిమసంగుటకు నిశ్చయమనస్కుఁ డై యతఁడు క్రోధోద్వేగముతో లేచెను. అప్పు డార్యనంది జీవకు నుద్దేశించి ''నాయనా! కాష్ఠాంగారకుని సంహరించుట కిది తగినతరుణము గాదు. ఇంకను నొక్క సంవత్సరమువఱకు నీ వీప్రయత్నమును విరమింపుము. పిమ్మట నీ యిచ్ఛ వచ్చినటుల సంచరింపుము. అంతవఱకు నీ వృత్తాంతము నెవ్వరికిని బయల్పడనీయకుము. నీ శ్రేయస్సును గోరి యీ విషయాదికమును దెలియఁజేసితిని'' అని యనెను. జీవకుఁ డందులకు సవినయముగఁ దన యంగీకారమును దెలిపెను.

అనంతర మార్యనంది తనచరిత్రమును జీవకునితో నిట్లు చెప్పెను. "రజతాచలమునందు వారణాశి యను నగర మొకటి కలదు. తన్నగరము నేలుభూపతిని నేను. నన్ను లోకమహాపాలుఁ డని యందురు. తపస్సు చేయ నభిలషించి నేను నా రాజ్యమును నా సుతుని యధీనము చేసి యిచ్చుటకై వచ్చితిని కాని నా పురాకృతపాపఫలితముగ వెఱ్ఱియాఁకలితో (ఏనుఁగుపసి) బాధపడఁ జొచ్చితిని నిన్నుఁ జూచినతోడనే నా పేరాఁకలి మటుమాయ మయ్యెను. కాఁగా నాశ్చర్యభరితుఁడ నై నేను నాకుఁ దెలిసినవిద్యలు నీకు నేర్పఁ దలఁచితిని. నాతలఁపు నేఁటితో ఫలించినది. ఇఁక నీవు సెల వొసంగినచో నేను తపము చేసికొనఁ బోయెదను."

ఆర్యనందిని వీడియుండుటకు జీవకుఁడు తొలుత సమ్మతింపకున్నను గురునానతిని శిరసావహించుటయే తన ధర్మమని తలఁచి యందులకు వల్లె యనెను. అంత నార్యనంది యిరువది నాలుఁగవ తీర్థంకరుఁ డగుశ్రీవర్ధమానుని సమవశరణమును (జినాలయము) జేరి తపోనిష్ఠాగరిష్ఠుఁ డయ్యెను.

అంత నొకనాఁడు రాజమహానగరమునకు సమీపమున నున్న యొక పర్వతప్రాంతమునఁ గాష్ఠాంగారకుని యాలమందలు పచ్చిక మేయుచుండెను. ఆ కొండయందలి వేఁటకాండ్రు వానిని బలాత్కారముగఁ దమ గృహములకుఁ దోలుకొని పోయిరి. తోడనే భయభ్రాంతు లయినపసుల కాపరు లా విషయమును కాష్ఠాంగారకునకు విన్నవించిరి. అతఁ డాలమందలను దరలించుకొని రమ్మని తన 'కుమారులను,

మదనుని గోరక్షకులకు సాయముగఁ బంపెను. వారు కిరాతు లతోఁ బోరాడిరి. కాని ఫలము దక్కలేదు. అప్పుడు పసుల కాపరుల పెద్ద యగునందుఁ డనునతఁడు "వేఁటకాండ్రను జయించి గోసమూహమును వశము చేసికొనుబలశాలి నా కుమార్తె యగుగోవిందను బరిణయ మాడవచ్చు" నని నగర మునఁ జాటించెను.

ఆ చాటింపును విని జీవకుఁడు నిషాదుల జయింప నమకట్టి సపరివారముగఁ బయన మయ్యెను. బోయవాండ్రు బహుసంఖ్యాకు లై యున్నను జీవకుఁడు వెనుకంజ వేయక ధైర్యోత్సాహములతోఁ బోరాడి వారిని జయించెను. పిమ్మట నతఁడు గోవులను గూడ స్వాధీన మొనర్చుకొనెను. అంత నందుఁడు జీవకుని ధైర్యసాహసముల కచ్చెరు వొంది తాను ప్రకటించినరీతిగఁ దన ముద్దులపట్టి గోవిందను జీవకున కొసఁగి వివాహ మొనర్ప నిశ్చయించెను. ఆమె యందాల ప్రోవు. కాని యామెను దన ప్రథమభార్యగాఁ బరిగ్రహించుట తన కులధర్మమునకు విరుద్ధముగ నుండు నని భావించి జీవకుఁ డా వివాహమునకు సమ్మతింపఁ డయ్యెను. అతని యభిలాష ననుసరించి జీవకుని మిత్రుఁ డగుపద్మముఖుఁ డామెను వివాహ మాడెను.

ఇట్లుండ రజతాచలమునందలి విద్యాధరచక్రవర్తి యొకఁడు తన కొమరిత యగుగాంధర్వదత్తకు రాజమహా నగరమునందు వివాహము జరఁగు నని కార్తాంతికులమూల మునఁ దెలిసికొని యందులకై శ్రీదత్తుఁ డనువానిని నియో

గించెను. శ్రీదత్తుఁడు రాజమహానగర వర్తకశ్రేష్ఠుఁడు. అతనిని జూచి "నా కుమార్తెను వీణాగానములో నెవ్వఁడు జయించునో యతఁడే యామెను వివాహ మాడవలయును" అని విద్యాధరచక్రవర్తి నుడివెను. అందులకు వల్లె యని శ్రీదత్తుఁడు గాంధర్వదత్తతోఁ గూడి రాజమహానగరమునకుఁ జనెను.

పిమ్మట శ్రీదత్తుఁడు కాష్ఠాంగారకుని యాజ్ఞను గొని నగరమునం దొకమండపమును నిర్మించి యందు గాంధర్వదత్తను నివసింపఁ జేసి యిట్లు ప్రకటించెను. "గాంధర్వదత్త గొప్ప వైణికురాలు. వీణాగానములో నెవ్వఁ డీమెను జయించునో యాతఁడే యీయామెను వివాహ మాడ నర్హుఁడు." ఆ ప్రకటనమును విని పెక్కురు వైణికులు చాల సంతసించి గాంధర్వదత్తసమక్షమునఁ దమపాండితిని బ్రదర్శించిరి. కాని వా రామెను జయింపఁజాలక పోయిరి. ఇట్లాఱు దినములు గడచెను. జీవకుఁ డామె ప్రతిభావిశేషములను విని యామెను బరిణయ మాడ నిశ్చయించి తన మనోభీష్టమును గంధోత్కటశ్రేష్ఠికిఁ దెలియఁజేసెను. అతఁడు కొంతవడి యోచించి "జీవకా! నీ పైఁ గాష్ఠాంగారకుఁడు పగఁ బూని యున్నాఁడు. కనుక సైన్యసమేతుఁడ వై పొమ్ము" అని నుడివెను. అటులనే జీవకుఁడు సపరివారముగా నా మండపమునకుఁ జనెను.

జీవకుఁ డంతఁ జూపఱు సంభ్రమాశ్చర్యములు పెందునట్లుగ వీణాగానము సలిపెను. అప్పుడు గాంధర్వదత్త మేరు

లేనిసంతసమున సుమహారముతో జీవకుని గళసీమ నలంకరించెను. కాష్ఠాంగారకుఁడు రెండవరుద్రుఁడై "ఇచ్చట సమావేశమై యున్న యో రాజులార! జీవకుని జయించినవాఁడు గాంధర్వదత్తను బరిణయమాడ నర్హుఁడు. త్వరపడుఁడు" అని నుడివెను. తోడనే కొందఱు రాజకుమారులు జీవకుని మార్కొనిరి. వారి నందఱను జయించి జీవకుఁడు గాంధర్వదత్తను శాస్త్రోక్తముగఁ బరిణయమాడెను.

నవోఢ యగుగాంధర్వదత్తతో జీవకుఁడు సౌఖ్యావహముగఁ గాలము గడపుచుండఁగ వసంతఋతువు వచ్చెను. రాజమహానగరవాసులు సుందరోద్యానములందలి ప్రకృతిశోభను సందర్శించుచు నా వనముల విహారము సలుపుచుండిరి. గుణమాల, సురమంజరి యనునిరువురు కాంతలొకపూఁదోఁటలో నాట లాడుకొనుచుండఁగ వారిలో నొక కలహ మేర్పడెను. ఆ కలహము వారు తయారొనర్చినసుగంధద్రవ్యములకు సంబంధించినది. తా నొనర్చిన ద్రవ్యమే శ్రేష్ఠతర మని వారిలో నొక్కొక్కరును వాదులాడఁదొడఁగిరి. తుద కాజగడమును దీర్చుటకు జీవకుఁడు పాల్పడెను. అతఁ డా ద్రవ్యద్వయమును లెస్సగఁ బరీక్షించి గుణమాల తయారు చేసినద్రవ్యమే శ్రేష్ఠ మని నిర్ణయించెను. తన్నిర్ణయమును విని సురమంజరి కోపోద్దీపితయై "నన్నవమానించిన జీవకుఁడు నన్నాశ్రయించునట్లుగ నొనర్తును గాక! చూడు"మని నుడివెను.

ఆ యుద్యానవనమునకు సమీపమున నొక శునకము నెవ్వగతో గాసిలుచుండెను. అది బ్రాహ్మణుల యన్న భాండమును స్పృశించిన దఁట! అందువలన నా బ్రాహ్మణులా కుక్కను జావ మోదిరి. ఆ దెబ్బలకుఁ దాళఁజాలక యది యొక సరోవరమునఁ బడి కొంతవడి నీటిలో నీఁదులాడెను. అప్పటికిని దానికి బాధోపశమనముగా లేదు. ఆ శునకమును గాంచినదే తడవుగ జీవకుని యెడఁద నీరయిపోయెను. అతఁడు దానిని సమీపించి దాని చెవిలో పంచనమస్కారమనుమంత్రము నుపదేశించెను. తోడనే యది తుచ్ఛశునక శరీరమును వీడి పవిత్రదేవతాశరీరమును దాల్చెను! తద్దృశ్యమును దిలకించి చూపఱ నివ్వెఱపడెను.

అంత నా దివ్యుఁడు జీవకునికి సభక్తికముగ నమస్కరించి యతనితో నిట్లు నుడువఁ దొడఁగెను. "నన్ను సుధంజనుఁ డని యందురు. నా నివాసస్థలము చంద్రోదయ మను నగరము. నాకు నీ వొనర్చినయుపకారమునకుఁ బ్రత్యుపకారముగ నీకు నే నేమి చేయఁగలవాఁడను. ఆజ్ఞాపింపుము." అందులకు జీవకుఁడు "వైరివీరులవలన నా కేదేని నాపద సంభవించినప్పుడు నాకు నీ సాహాయ్య మవసరముగ నుండు" నని సమాధాన మొసఁగెను. వల్లె యనుచు నా దివ్యుఁడు నిజనగరాభిముఖుఁ డై పయనము సాఁగించెను.

పిమ్మట నా వనమును వీడి యెల్లరుఁ దమ తమ నివాసములకుఁ జనుచుండిరి. తత్సమయమున నశనివేగ మను

నొకపట్టపుటేనుఁగు శృంఖలములను ద్రెంచుకొనినగరముపైఁ బడెను. ఎవ్వరికిని దాని నదుపులోనికిఁ దెచ్చుటకు శక్యము గాలేదు. ఆ మత్తగజము గుణమాలపైఁ బడ నుండెను. అది పట్టపుటేనుఁగని తెలిసియు జీవకుఁడు తోడనే యా గజమును సమీపించి దాని మదము నణఁచి వైచి గుణమాలను సంరక్షించెను. ఆమె జీవకుని ధైర్యోత్సాహములను గన్నులారఁ గాంచి యాతనిపై మరులు గొనెను. అతఁడు నామెను వలచెను. పిమ్మట గుణమాల మనోభీష్టమును గుర్తించి యామె జనకుఁడు గంధోత్కటశ్రేష్ఠితో సంప్రదించి గుణమాలను జీవకున కొసఁగి వైభవోపేతముగ వివాహము జరపెను.

గుణమాలను జీవకుఁడు పరిణయమాడుట కాష్ఠాంగారకునకుఁ గన్నుకుట్టెను. అతఁడు జీవకుని హతమార్పఁ దలఁచి మదనునితో "ఆ శ్రేష్ఠితనయుఁ డగుజీవకుని సంహరింపు" మని నుడివెను. అంత మదనుఁడు రాజాజ్ఞను దలఁ దాల్చి కొందఱు వీరయోధులను వెంట నిడికొని గంధోత్కటశ్రేష్ఠి గృహమును జుట్టుముట్టెను. మదనుఁడు తన్ను బంధించుటకై యేతెంచినాఁ డని తెలిసికొని జీవకుఁడు క్రోధోద్వేగమున కాష్ఠాంగారకుని సైనికులతోఁ బోరొనర్ప సన్నద్ధుఁ డయ్యెను. అప్పుడు గంధోత్కటశ్రేష్ఠి దంపతు లతనిని సమీపించి "నాయనా! రాజున కణఁగి మణఁగి యుండుట శ్రేయస్కరముగ నుండు" నని నుడివిరి. ఆ సమయమున నార్యనంది నుడివిన 'ఒక్కసంవత్సరము దాఁకఁ గాష్ఠాంగారకునితో యుద్ధ

మొనర్పకు' మనుమాటలు జీవకునకు స్ఫురణకు వచ్చెను. వెంటనే యతఁడు కోపభారము నడఁచికొనెను. అప్పు డతనిని మకనుఁడు బంధించెను. కాష్ఠాంగారకుని సైనికులు జీవకుని వెంట నిడికొని యంతఃపురాభిముఖులై నడవసాగిరి.

నిస్సహాయుఁడైనజీవకుఁడు తదవసరమున సుధంజనునిఁ దలఁచెను. తోడనే యతఁడు తన విముక్తిఁ గోరకుఁడైనజీవకుఁడు విపత్తులో నున్నాఁడని గ్రహించి కుంభవృష్టిగా వర్షమును గురియించెను. పెనుగాలి వీచ నొనర్చెను. అప్పుడు సుధంజనుఁడు జీవకుని సమీపించి మూఁడవ కంటికిఁ దెలియకుండఁగ నతనిని దననగరమున కెత్తుకొని పోయెను.

ఉన్నట్టులుండి జీవకుఁ డంతర్హితుఁ డగుటను గాంచి మదనుఁ డాశ్చర్యచకితుఁ డయ్యెను. కాని కాష్ఠాంగారకుని కఠినాజ్ఞ స్మృతిపథమునకు రాఁగానే యతఁడు "అయ్యో! ప్రభువున కే మని ప్రత్యుత్తరము నొసఁగెదను? చేఁజిక్కిన జీవకుఁడు తప్పించుకొని యెచ్చటికో పాఱిపోయెను గదా!" అని తలఁచుచుఁ జింతాక్రాంతుఁ డయ్యెను. కొంతవడి యతఁడు యోచించి తుద కొక యభాగ్యుని శిరచ్ఛేదముఁ గావించెను. ఆ తల నాతఁడు కాష్ఠాంగారకుని సమక్షమునఁ బెట్టి సవినయముగ నిట్లనెను. "ప్రభూ! జీవకుని బంధించి మేము తమ సన్నిధికిఁ గొనివచ్చుచుండఁగఁ బెనుగాలి వీచినది, కుండపోఁతగా వాన కురిసినది. అప్పు డతనిని దెచ్చుట కష్ట మగుననిపించినది. కాన మే మతనిని, శిరచ్ఛేదముఁ

గావించి యాతని శిరస్సును దమ సన్నిధానమునకుఁ గొని వచ్చితిమి.''

మదనుని మాయమాటలు విశ్వసనీయము లని కాష్ఠాంగారకుఁడు సంభావించి ''జీవకుని సంహరించుట సులభ కార్యము గాదు. దుష్కర మగునట్టికార్య మొనర్చిననీవు భావిలో జయశ్రీని వరింతు''వని మదనునిఁ గొనియాడెను. పిదప నతనికిఁ గాష్ఠాంగారకుఁ డమూల్యము లగుబహుమతు లొసఁగి యతనిని ఘనముగ సత్కరించెను.

పిమ్మట జీవకుఁడు సుధంజనునితోఁ గూడి యా పర్వతమునందలి మనోజ్ఞదృశ్యములఁ గనుఁగొని మిక్కిలి సంతసించెను. అప్పుడు సుధంజనుఁడు తనమిత్రునకు మూఁడు మంత్రముల నుపదేశించెను. మనోహరాకృతిధారణమునకును, విషనివారణమునకును, కామరూపధారణమునకును నా వంత్రత్రయము తోడ్పడు నని యతఁడు నుడివెను. అందులకు జీవకుఁ డతనికిఁ దన కృతజ్ఞతను దెలియఁబఱచి గృహోన్ముఖుఁ డయ్యెను. మార్గమధ్యమున జీవకుఁ డొక సుందరోద్యానమున విశ్రమించెను. అటఁ బాముకాటుచే శరీర మంతయు విష మెక్కి గాసిలుచున్న యొక యుబల యార్తరవ మాతని చెవులఁ బడెను. వెంటనే యతఁ డామెను సమీపించి సుధంజనుఁ డుపదేశించినమంత్రసాహాయ్యమున నామెను సంరక్షించెను. తన్ను మృత్యుముఖమునఁ బడనీయక కాపాడినందుల కామె సంతసించి జీవకుని వివాహ మాడఁ దలఁచెను. అందుల కామె తలిదండ్రులు కూడ సమ్మతింపఁగా

జీవకుఁడా జవ్వనిని బరిణయ మాడెను. ఆమెపేరు పద్మ. ఆమెతో జీవకుఁడు కొన్నినాళ్లు సౌఖ్యావహముగఁ గాలము గడపి పిమ్మట స్వగృహమునకుఁ బయన మయ్యెను.

కతిపయదినములకు జీవకుఁడు క్షేమమహాపుర మను నగరమును జేరెను. అట సుభద్రుఁ డనునొకవర్తక శ్రేష్ఠుఁడు తనకుమార్తె క్షేచరిని జీవకున కొసఁగి పెండ్లి సేయ నిశ్చయించెను. జీవకుఁ డందుల కంగీకరింపఁగా నతనికి క్షేచరితో మహావైభవముగ వివాహము జరఁగెను. ఒకనాఁడు జీవకుఁడు హేమపుర మను నొక నగర మందలి యొక పుష్పోద్యానమున విహరించుచుండఁగ నటకు విజయుఁ డను రాకుమారుఁ డేతెంచెను. అతఁడు కృతాస్త్రుఁడు. చాలదినములుగ నతఁ డొక మామిడిగుత్తిని నొకే బాణముచే భూపతన మొనర్చుటకు యత్నించుచుండెను. ఆ నాఁడును నాతఁ డాగుత్తిని గుఱి చూచి శరప్రయోగము గావించెను. కాని లాభము లేక పోయెను. ఆ దృశ్యమును జూచుచున్న జీవకుఁ డొకేబాణముతో నా మామిడిగుత్తిని గొట్టి దానిని భూపతన మొనర్చెను. ఆతని ధనుర్విద్యాకౌశలమును గాంచి నివ్వెఱపోయి విజయుఁ డా విషయమును దన తండ్రికెఱింగించెను. ఎల్లరు నంగీకరింపఁగ విజయుని సహోదరి యగుకనకమాలను జీవకుఁడు వివాహ మాడి యామెతో సౌఖ్యశ్రీ ననుభవించుచుండెను.

ఇట్లుండ జీవకుని వృత్తాంతము నరయఁగోరి యతని తమ్ముఁడు నందాఢ్యుఁడు కొంత బలఁగమును వెంట నిడికొని

గాంధర్వదత్తయొద్దకు వెడలెను. ఆమె కనకమాలతోఁడి జీవకుని దన దూరదృష్టిని జూచి యా విషయమును నందాస్యునకుఁ దెలియఁజేసెను. అంత నతఁడు సపరివారముగ హేమపురమునకుఁ బయన మయ్యెను.

త్రోవలో దండకారణ్యమునఁ దపస్సమాధి నున్న విజయను నందాస్యుఁడు కలసికొనెను. ఆమెవలన జీవకుఁడు రాకుమారుఁ డనియుఁ, గాష్ఠాంగారకుని మాయోపాయముల వలన సత్యంధరుఁడు మరణించె ననియు నందాస్యుఁడు తెలిసికొనెను. కాష్ఠాంగారకునిపైఁ బగ సాధింపవలయు ననుప్రతీకారవాంఛ యాతనిలోఁ బ్రబలెను. పిమ్మట నందాస్యుఁ డామెయొద్ద సెలవు గైకొని ప్రయాణము సాఁగించి కొన్ని దినములకు హేమపురసీమావధిని జేరెను. అట మేయుచుండినపశువుల నప్పుడు నందాస్యుఁడు బంధించెను. ఈ విషయమును దెలిసికొని విజయుఁడు జీవకునితోఁ గూడి యుద్ధసన్నద్ధుఁ డై యాలమందలు మేయు నా పచ్చికబీడుకడకు వచ్చెను.

జీవకుఁడు నందాస్యునిఁ జూచి మేర లేనిసంతసము నెంది 'పశువుల నేల బంధించితివి'? అని ప్రశ్నింపఁగా నతఁడు యావద్వృత్తాంతమును సవివరముగఁ దెలిపెను. తన తల్లి దండకారణ్యమునఁ దపస్సు చేయుచున్న దని తెలిసికొని జీవకుఁ డామెను జూడఁ దహతహ లాడెను. కాఁగా నతఁడు కనకమాలను వీడి నందాస్యునితోఁ గూడి దండకారణ్యమునకుఁ జనెను.

అట విజయను గలసికొని జీవకుఁ డానందభరితుఁ డయ్యెను. ఆమెయు సంతోషాబ్ధిని మునిఁగి యతనితో నిట్లనెను. "కాష్ఠాంగారకుఁడు నీ తండ్రిని వంచించి రాజ్యమును సంపాదించినాఁడు. ఆతనిపైఁ బగ సాధించి విజయశ్రీని బడయవలసిన బాధ్యత నీపై నున్నది. నీ మామ యగుగోవిందునితో సంప్రదించి యుద్ధసన్నద్ధుఁడవు కమ్ము" జీవకుఁడు సహర్షముగ మాతృనానతిని శిరసావహించి పరివారయుతుఁడై రాజమహానగరమునకుఁ బయన మయ్యెను. తన్నగరమునకు వెలుపల నున్న యొక సుందరవనమున నెల్లరు విడిసిరి. అట విమల యనుజవ్వని కందుకక్రీడలో నిమగ్నయై యుండెను. ఆమె జీవకుని యపూర్వసౌందర్యమును గాంచి యతనిని వలచెను. పిమ్మట జీవకుఁడు కూడ నామెను ప్రేమించి తన ప్రేయసిగఁ జేసికొనెను.

అప్పుడు బుద్ధిసేనుఁ డనుమిత్రుఁడు జీవకు నుద్దేశించి "మిత్రమా! విమలను వివాహ మాడుట యొక ఘనకార్యము గాదు. పురుషవిద్వేషి యగునొక మహిళ కలదు ఆమెను సురమంజరి యని యందురు. ఆమెను నీవు చేపట్టితివేని నిజముగ మదనుఁడవే సుమా" యనెను. అంత జీవకుఁడు వృద్ధబ్రాహ్మణవేషము ధరించి సురమంజరిని జయింపఁ దలఁచి యామెసౌధమునకు వెడలెను.

సురమంజరియొక్క చెలికత్తెల యనుజ్ఞను బడసి జీవకుఁడు సౌధములోనికిఁ బ్రవేశించుసరికి నాతనికి దలప్రాణము తోఁకకు వచ్చిన ట్లయ్యెను. ఆఁకలి గొన్న వృద్ధబ్రాహ్మణుని

జూచినఁ దప్పు లేదని తలఁచి సురమంజరి యాతనిని సమీపించి "స్వామి! ఏల వచ్చితిరి?" అని ప్రశ్నించెను.

"కుమారీపరిగ్రహణమునకు[1] అని జీవకుఁ డనెను

"ఎందులకు?"

"వృద్ధత్వమును బాపికొనుటకు."

ఆమె కేమియు స్ఫురింపక లోనికిఁ జనెను.

అంత జీవకుఁ డొక మధురగీతము నాలపింపఁ జొచ్చెను. ఆ గీతమాధుర్యమును గ్రోలినకొలఁది సురమంజరికి జీవకుని కంఠము స్ఫురణకు వచ్చెను. పిమ్మట నామె వృద్ధబ్రాహ్మణవేషధారి జీవకుఁడే యని తెలిసికొని మిక్కిలి సంతసించి యతనిని వివాహ మాడెను.

అంతలో గోవిందుఁడు చతురంగబలసమేతుఁడై జీవకునకు సహాయముగ నేతెంచెను. కాష్ఠాంగారకునిఁ దాము విడిసియున్న ప్రదేశమునకు రప్పింపఁ దలఁచి గోవిందుఁ డొక వరాహయంత్రమును దయారు చేసి యిట్లు ప్రకటించెను. "ఈ వరాహయంత్రమును భేదించునట్టియోధునకు నా కుమార్తె యగులక్షణ నిచ్చి వివాహ మొనర్తును."

1. మూలములో 'కుమరి యాడ' అని కలదు. ఇందు మనోజ్ఞ మగు శ్లేష యున్నది. కన్యాకుమారియందుఁ గ్రుంకు లిడుట కనియు, కన్య యైన నిన్ను వివాహ మాడుట కనియు నర్థద్వయ మిందు స్ఫురించును. 'కుమారీపరిగ్రహణ' మన్నప్పుడును నట్టి యర్థద్వయమే సాధింపఁదగును.

ఆ ప్రకటనమును విని కాషాంగారకుఁడు సపరివారముగ గోవిందుఁ డున్నప్రదేశమునకు వచ్చెను. జీవకుఁడు సజీవుఁడై యుండుటను గాంచి యాతఁడు భయభ్రాంతుఁడై గోవిందుఁ డేదో మాయోపాయము పన్నె నని తలఁచెను. అప్పుడు గోవిందుడు జీవకుని వృత్తాంతము నటఁ గూడినవారి కెల్లరకుఁ దెలియఁజేసెను. అంత గత్యంతరము లేక కాష్ఠాంగారకుఁడు జీవకునితో యుద్ధసన్నద్ధుఁ డయ్యెను. ఆ సమరమునందుఁ గాష్ఠాంగారకుఁడు విగతజీవుఁ డయ్యెను. పిమ్మట రాజమహాపురమునకు జీవకుఁ డభిషిక్తుఁడు గాఁబడెను. తదవసరమున సామంతులెల్లరు నాతనియందు భక్తివిశ్వాసములు ప్రకటించిరి.

అనంతరము జీవకుఁడు తాను ప్రేమించి పెండ్లి యాడిన ప్రమదల నందఱను దన యంతఃపురమునకు రప్పించుకొనెను. గోవిందుఁడు తన మేనల్లుని శౌర్యసాహసముల కలరి యాతనికి లక్షణ నొసఁగి మహావైభవముగ వివాహమహోత్సవము గావించెను. జీవకుఁ డొకవైపు తన ధర్మపత్నులతో సౌఖ్యావహముగఁ గాలము గడుపుచున్నను, రాజ్యవ్యవహారములం దప్రమత్తుఁడై ప్రజాశ్రేయస్సు నభిలషించుచుండెను. అతఁడు గంధోత్కటశ్రేష్ఠికి రాజ్యాధికారము నొసఁగెను. సునందకు 'దేవి' యనుబిరుదము నొసఁగి యామెను గౌరవించెను. నందాస్యుని యువరాజుగ నియమించెను.

తనకు మహోపకార మొనర్చినసుధంజనున కొక యాలయ
మును నిర్మించి జీవకుఁ డాతనిని సేవించుచుండెను. ఇటుల
జీవకుఁడు తన శ్రేయస్సును గోరినవారి నెల్లరను గౌరవించి
కృతకృత్యుఁ డయ్యెను.

జీవకుని తల్లి యగువిజయ తన్నుఁ గాపాడినచంపక
మాల కొక కోవెలను నిర్మించి ధన్య యయ్యెను. పిమ్మట
నామె జీవకుఁడు జనన మందినశ్మశానమునం దొక సత్ర
మును గట్టి యం దైదువందల యైదుగురు బాలురకు నిర
తాన్నప్రదానము జరఁగునట్లు కట్టడి సేసెను. అటుల నామె
చేయఁదగుధర్మకార్యముల నెల్లఁ జేసి పిదప సమవశరణముఁ
జేరి యట సన్న్యాసాశ్రమమును స్వీకరించెను. సునంద కూడ
విజయతోఁ బాటు సన్న్యాసమును బరిగ్రహించెను.

ఒకనాఁడు జీవకుఁడు తన తల్లి నివసించుచున్న
యాశ్రమమునకుఁ జని "అమ్మా! నేను నా ధర్మపత్నులవలన
సంతానవంతుఁడ నైతిని, అనుభవింపఁ దగునైహికభోగ
ముల నెల్ల ననుభవించితిని. ఇఁక నాకు వాంఛనీయ మైన
దేదియు లేదు. కనుక సన్న్యసింపఁ దలఁచుచున్నాను."
అని విన్నవించెను. అందుల కామె యంగీకరించి యతనికి
ధర్మోపదేశము గావించెను.

అంత జీవకుఁడు తన జ్యేష్ఠకుమారుఁ డగుసత్యంధరునకుఁ బట్టాభిషేక మొనర్చి రాజ్యము నతని యధీనముఁ గావించెను. పిమ్మట నతఁడు తన యష్టమహిషులతోడను సమవశరణమునకుఁ జని సన్న్యాసాశ్రమమును స్వీకరించెను. ఆతని ధర్మపత్నులు కూడ సన్న్యసించి విజయ నివసించు నాశ్రమమున నివసింపఁ జొచ్చిరి. తదాదిగ వా రెల్లరు వర్ధమానుని సేవించుచు జైనధర్మప్రచారము సేయఁ దొడఁగిరి.

---

# ౪

# కుండలకేశి

[నామమాత్రముగానే తెలియవచ్చుచున్న యీ కావ్యము నేఁటి దాఁక నుపలబ్ధము గాలేదు. ఈ కావ్యకర్త నామము గూడఁ దెలియరాకపోవుట మిక్కిలి శోచనీయము. కాని వైశ్యపురాణమునుండియు, మహాబోధి పరిషత్పత్రికనుండియు నీ కావ్యము నందలి యితివృత్త మిట్టి దని తెలియవచ్చుచున్నది. ప్రకృతము మహాబోధిపరిషత్పత్రిక యం దుదాహృత మయిన కథయే యిందు గ్రహింపఁ బడినది.]

ఆమె సానఁ బట్టినమకరాంకుశస్త్రము. ఆమె లావణ్యాతిశయమును గాంచి సారసాత్తులు కూడ సమ్మోహితు లగుచుండిరి. అట్టి యందాలబరిణ యామె! అందును వయసు వచ్చినప్రమద. ఆమెపేరు భద్ర. రాజగృహము నందలి యాగర్భశ్రీమంతుఁ డగునొకవణిక్ప్రవరుని గారాబు కూన యామె. కావున భద్ర చీఁకుచింతలు లేనిజీవితమును గడపుచుండెను.

ఒకనాఁ డామె తన సౌధోపరిభాగమున వీణాగానము సలుపుచుండెను. తత్సమయమున నొకయువకుఁడు నగరరక్షకులచే బంధింపఁబడి రాజాజ్ఞప్రకారము వధ్యస్థానమునకుఁ గొంపోవఁబడుచుండెను. అతఁడు గజదొంగ యగుటచే

నతని కాశిక్ష విధింపఁబడెను. అతనిని శత్రుకుఁ డని వ్యవహరింతురు.

శత్రుకుఁడు మనోమోహనమగురూపముఁ గలవాఁడు. వీణ వాయించుచున్న భద్రవీక్షణము లాకస్మికముగ నతనిపైఁ బడెను. ఆతని యందచందము లామెకు మధురాతిమధుర భావములను గలుగఁజేసెను. తోడనే యామె చరచర క్రిందికి దిగి తండ్రిని సమీపించెను. పిమ్మట భద్ర యాయువకునియందుఁ దన కవ్యాజ మగుప్రేమ మేర్పడె ననియు, నతనిని నగరరక్షకులనుండి విడిపింపు మనియుఁ దండ్రిని వేఁడెను. కానక కన్నసంతాన మగుటచే నామె మాటను ద్రోసివేయఁజాలక యతఁడు నగరరక్షకులకు వలసినంత ద్రవ్యమొసఁగి శత్రుకుని విడిపించి యతనిని దన గృహమునకుఁ దీసికొనివచ్చెను.

శత్రుకుని గాంచినదే తడవుగ భద్ర యతనిపై మరులుగొనెను. అతనిని వివాహ మాడ నిశ్చయించెను. ఆమె యభిప్రాయమును గుర్తించి యామెతండ్రియు నందులకు సమ్మతించెను. అంత భద్ర యొక శుభముహూర్తమున శత్రుకునిఁ బరిణయ మాడెను. ప్రేమైకజీవులయినవారి సాంసారిక జీవనము తదాదిగ సౌఖ్యావహముగ సాఁగుచుండెను.

ఒకనాఁ డేదియో మాటపట్టింపు వలన భద్రకును, నామె భర్తకును భేదాభిప్రాయము లేర్పడెను ఆ యభిప్రాయభేదములు తుదకొక తీవ్రకలహముగ రూపొందెను. తదవసరమునఁ బేరలుక నెందినభద్ర శత్రుకు నుద్దేశించి

“నీవు దొంగవు కావా? ఆనాఁడు నగరరక్షకులనుండి నిన్ను విడిపించినది నేను గాదా?” అని కొంచెము కటువుగ నుడివెను. ఆమెమాటలను వినినంతనే శత్రుకునకు గతజీవితస్మృతులన్నియు నొక్కుమ్మడిగ స్ఫురణమునకు వచ్చెను. అతఁడు మలినమనస్కుఁడు గాఁ దొడఁగెను. భద్రపై నతనికి రోఁత జనించెను. అంతేకాదు. ఆమె కై సేసికొనిన యమూల్యాభరణముల నపహరింపవలయు ననుమలినభావ మాతని హృదయఫలకమునందుఁ బ్రతిఫలించెను. కాఁగా నతఁడు కొంతవడి యోచన చేసినట్లు నటించి పిదప నిట్లు నచ్చికబుచ్చికలాడెను.

“భద్రా! ఆనాఁడు రాజాజ్ఞ ననుసరించి నగరరక్షకులు నన్ను వధ్యస్థానమునకుఁ గొనిపోవుచున్నప్పుడు నీవు నన్నుఁ గాపాడినమాట వాస్తవమే. ఆ విపత్సమయమున ‘నన్నిగండమునుండి బయటఁ బడవేసినచోఁ దప్పక నీ సన్నిధికి వత్తు’ నని నేను మాయిలువేల్పును బ్రార్థించితిని. కాని నేటివఱకు నే నా ప్రార్థనను చెల్లింపలేదు. నేఁడు మా యిలువేల్పును సందర్శింపవలయు నని తలఁచుచున్నాను. నీవు కూడ వచ్చెదవా?”

భర్తృకోపభరము నుపశమింపఁ జేయఁ దలఁచిన భద్రకామాటలు సంతోషదాయకము లయ్యెను. తోడనే యామె వస్త్రాలంకారభూషిత యై భర్తను గూడి ప్రయాణ మయ్యెను.

కొంతసేపటికి నా దంపతులు నగరమునకు వెలుపలనున్న యొక పెద్దకొండకడకుఁ జనిరి. ఆ కొండమీఁద శత్రు

కుఁడు నుడివిన దేవాలయము గలదు. పిమ్మట వారిరువురు నా కొండ నెక్కి యాలయమును సమీపించిరి. ఇఁకఁ దన మనోభీష్టము నెఱవేరినట్లు తలఁచి సంతోషమున శత్రుకుఁడు బుజము లెగురవైచెను. అంత నతఁడు "భద్రా! నీకు నీ ప్రాణముపైఁ దీపి యున్నచో నీ నగలనన్నిటిని నా కొసఁగి గృహమునకు మఱలి పొమ్ము" అని యనెను.

ఆ మాటలు వినినదే తడవుగ భద్రకు ముచ్చెమటలు పోసెను, ఆమె భయభ్రాంత యయ్యెను. ఆమె కేమియు స్ఫురింపలేదు. ఎటులనో ధైర్యముఁ దెచ్చుకొని యామె "నేను మీదానను గదా! కనుక నీ నగ లన్నియు మీకుఁ జెందినవే" అని సవినయముగఁ బలికెను. మలినమనస్కుఁ డయిన శత్రుకున కామెసమాధానము రుచింపలేదు. మీఁదు మిక్కిలి యతఁ డామెయాభరణములను బలాత్కారముగ నైనఁ దోఁచుకొన నిశ్చయించెను. ఆతని నిశ్చితాభిప్రాయమును భద్ర పసికట్టి జీవితాశను వీడెను. ఇఁక దుఃఖించి లాభము లేదని తలఁచి యామె యొకకుయుక్తిని బన్ని భర్తతో గంభీరముగ నిట్లనెను.

"సరియే. మీ యిష్టమే నా యిష్టము. నా నగలు మీయొద్దనున్నను నాయొద్ద నున్నట్లే కదా! కాని యొక్క విషయ మున్నది. ఒక్కతూరి మీకు ముమ్మాఱు ప్రదక్షిణ మొనర్చి, మిమ్ము భక్తిని సేవించి పిమ్మట నానగల నన్నిటిని మీస్వాధీన మొనర్తును. ఇందులకు మీయనుజ్ఞ వలయును."

దూరదృష్టి లేనిశత్రుకుఁ డందులకు సమ్మతించెను.

అంత భద్ర తన భర్తకుఁ బ్రదక్షిణము జేయఁబూనెను. మూఁడవప్రదక్షిణమున నామె దురాలోచనాయుతుఁడైన శత్రుకునిఁ గ్రిందికిఁ ద్రోసివైచెను. తత్క్షణమే యా నిర్భాగ్యుఁడు జర జర జారి కొండ యడుగుభాగమునఁ బడెను. అతఁడు నురుఁగులు గ్రక్కెను. కొంతవడి యమయాతనకుఁ బాల్పడెను. తుదకు శత్రుకుఁడు విగతజీవుఁ డయ్యెను.

అ విషాదదృశ్యమును దిలకించుచున్నయా కొండ మీఁది దేవత భద్ర పన్నినయుక్తిని మెచ్చుకొనుచు నామెను గొనియాడెను. భద్రకు భర్తృమరణానంతరము జీవితముపై రోఁత యేర్పడెను. గృహాభిముఖురాలగుటకుఁ గూడ నామెకు మనస్కరింప లేదు. ఆ దేవతయభిమతము ననుసరించి భద్ర నిర్గ్రంథుల యాశ్రమమును జేరి సన్న్యాసమును స్వీకరించెను. ఆమెకుఁ గేశఖండనము జరగెను. కాషాయవస్త్రము లలంకరింపఁబడెను. కొన్నినాళ్లకుఁ బిమ్మట భద్రకుఁ గుండములవలె వంపులు తిరిగినకురులు వచ్చుచుండుటచే నామెకు 'కుండలకేశి' యను వ్యవహారనామము గలిగెను.

కుండలకేశి సర్వశాస్త్రములు నేర్చెను. కొమ్ములు తిరిగినపండితులతోఁ గూడ నామె వాదోపవాదములు సలుప సాఁగెను. అచిరకాలమునందే యామెపేరు పెంపులు నాలుఁగు మూలలకు వ్యాప్త మయ్యెను.

ఒకప్పుడు కుండలకేశి శ్రావస్తీనగరమునకు వెడలి యుండెను. తన్నగరము బౌద్ధభిక్షుకుల కాలవాలము. అచ్చటి భిక్షుకసమూహమునకుఁ దలమానిక మగుసారిపుత్రుఁ డను

నతఁడు కుండలకేశిని గలసికొనెను. వారిరువురకు వాదోపవాదములు జరఁగెను. సారిపుత్రుని వాదనైపుణ్యమున కబ్బురపడియు, నాతని పూర్వపక్షములను ఖండింపలేకయుఁ గుండలకేశి బౌద్ధమతమును స్వీకరించెను. తదాదిగ బౌద్ధమతధర్మవ్యాపనమే తన జీవితలక్ష్యమని సంభావించి కుండలకేశి పల్లెలు, పట్టణములు, నగరములు తిరుగసాఁగెను, పండితప్రకాండులతో వాదములు నెఱపి వారిని దన మతమునకుఁ ద్రిప్పుకొనఁ జొచ్చెను. ఇటుల జీవితమును బౌద్ధధర్మప్రచారమునందు లయింపఁజేసి తుదకు కుండలకేశి నిర్వాణముఁ బొంది ధన్య యయ్యెను.

---

౫

# వళయాపతి

[కుండలకేశివలె నీ గ్రంథము గూడ నుపలబ్ధము గాలేదు. కవినామధేయము గూడఁ దెలియరాలేదు. ఈ కావ్యము నందలి కథ వైశ్యపురాణమునఁ దక్క మఱి యే యితర గ్రంథము నందును గానవచ్చుట లేదు.]

మున్నొకప్పుడు నవకోటినారాయణుఁ డను నొకవజ్రవర్తకుఁ డుండెను. అతఁడు కుబేరునిఁగూడఁ దలఁ దన్నినవాఁడు. అతఁడు స్వకులమునకుఁ జెందినయొకపడఁతిని వివాహ మాడి యామెతో సంసారము సాఁగించుచుండెను. కాని యతనిహృదయ మన్యకులమునకుఁ జెందినయొక యువతిపై లగ్న మగుటచే నామెను గూడ నతఁడు పెండ్లి యాడెను.

అన్యకులస్థురాలిని నవకోటినారాయణుఁడు వివాహ మాడుటను గాంచినయాతనిబంధుమిత్రాదు లతని ప్రవర్తనమును గర్హించిరి. కులపెద్దలు నవకోటినారాయణునిఁ గులము నుండి వెలివేయుటకు నిశ్చయించిరి. కాఁగా నతఁడు గత్యంతరము లేక తన రెండవభార్యను ద్యజింపవల సివచ్చెను. ఆ సమయమున నామె గర్భము ధరించి యుండెను. అయినను నవకోటినారాయణుఁ డామెను దన గృహమునుండి వెడలఁ గొట్టెను.

కొన్ని నెలలకుఁ బిదప నామె యొకపురుషశిశువును బ్రసవించెను. దినములు దొరలెను, నెలలు చనెను, సంవత్సరములు గడచెను. ఆ బుడుతఁడు పెరిఁగి పెద్దవాఁ డయ్యెను. యుక్తాయుక్తవిచక్షణుఁ డయ్యెను. ఒకనాఁ డతఁడు తనతోఁడి మిత్రులతో నాటలాడుచుండెను. అప్పు డతనిని "నీవు తండ్రిలేనివాఁడవు, ఉన్నచో నాతనిపేరు చెప్పుము. చూతము" అని యొుకఁ డెకసక్కెము లాడెను. ఆ మాట లాతనికిఁ గర్ణశూలములు కాఁగా నతఁడు తనతల్లిని సమీపించి యామెతో జరగిన విషయమును నుడివెను.

ఆమె తన శోకభారము నడఁచుకొనుచు నతనితో 'నవకోటినారాయణుఁ డనువర్తకుఁడే నీ తండ్రి' అనెను. తోడనే యతఁడు పితృదర్శనార్థమై నవకోటినారాయణుని గృహమునకుఁ బయన మయ్యెను. ఆతనిని దర్శించి యతఁ డిట్లనెను. "నేను ని కుమారుఁడను. నీవు త్యజించినభార్యకు జన్మించిన వాఁడను."

నవకోటినారాయణుఁ డాతనిమాటలు విశ్వసనీయములు కావని తలఁచి 'నీవు నా కుమారుఁడవు కావు' అనెను. పిమ్మట నతఁడు కులపెద్దల కీవిషయమును దెలియఁ జేసెను. వారును నవకోటినారాయణుని యభిప్రాయమును సమర్థించిరి. అంతలో నవకోటినారాయణుఁడు త్యజించిన భార్యయు నచ్చటికి నేతెంచెను. అప్పుడు కులపెద్ద లామె శీలమును శంకించి యామెను బరిహాసము జేసిరి.

కౌంతిని సమీపించి సవినయముగ నిట్లనెను. "తమ యను
గ్రహమువలన మేము సురక్షితముగ మధురానగరముఁ జేరి
తిమి. మిక్కిలి కృతజ్ఞుఁడను. నే నిపుడు నగరవర్తకులను గలసి
కొని యచటి వ్యాపారపరిస్థితు లెట్లున్నవో తెలిసికొనఁ
గోరుచున్నాను. కనుక నేను నగరమునకు వెడలి తిరిగి వచ్చు
నందాఁకఁ దయచే కణ్ణకిని జూచుకొనుచుండవలయును."
అందులకు యోగినియు వల్లె యనఁగా కోవలుఁడు నగరాభి
ముఖుఁడయ్యెను.

మధురానగరము మనోజ్ఞప్రకృతిదృశ్యములకు నిల
యము. సుందరోద్యానవనములును, మహోన్నతసౌధము
లును నా నగరమునకు శోభ నొసఁగెను. సుందరేశ్వరుని
యర్ధాంగి యగుమీనాక్షీ దేవి కది జన్మస్థాన మగుటచే మధుర
పుణ్యస్థల మయ్యెను. యవనసైనికసంరక్షిత మగుతన్నగర
దుర్గద్వారమును దాఁటి కోవలుఁడు పట్టణమును బ్రవేశిం
చెను. ఆ నగరమునందలి విశాలవీథులును, రమ్యహర్మ్యము
లును కోవలుని ముగ్ధునిఁ గావించెను. అతఁడు నగరవర్తక
వరేణ్యులతోఁ జాలసేపు సంభాషణలు నెఱపెను. మధ్యా
హ్నము గూడ నతిక్రమించెను. భానుఁడు ప్రచండుఁడై
వెలుఁగొందుచుండెను. ఎండవేఁడిమిని భరింపఁజాలక కోవ
లుఁడు బాటల కిరుప్రక్కలనున్న వృక్షచ్ఛాయలయందు నడ
చుచు కౌంతియోగిని యున్నయాగ్రామమునకుఁ దిరిగివచ్చెను.

కోవలుఁడు యోగినితోడను, కణ్ణకితోడను మధురా
నగరసౌందర్యసౌభాగ్యములను వివరించుచుండఁగ నప్పుడే

యొక బ్రాహ్మణుఁడు వారిని సమీపించెను. అతఁడు కోవ లుని గుర్తించి యతని సాహసౌదార్యములను బహుభంగులఁ బ్రశంసించెను. సాయంసమయ మయ్యెను. అంత యోగిని కణ్ణకీ కోవలుల నుద్దేశించి "ఈ గ్రామము సాధువులకు మాత్రమే నివాసయోగ్య మయినది. కనుక నిట మీవంటివా రుండుట శ్రేయస్కరము గాదు. నగరమునందే మీరు కాపుర ముండుట మంచిది" అని నుడువుచుండఁగా మాధురి యను నొక యాదవాంగన తపస్వినికడకు వచ్చెను.

మాధురి మంచి యిల్లాలు. ఆమె కౌంతియోగిని శిష్యవర్గమునకుఁ జెందినది. అప్పుడు తపస్విని మాధురితో నిట్లనెను. "ఈ దంపతులు (కణ్ణకీకోవలులు) కావేరీపట్టణము నుండి వచ్చినారు. వీరు ధనికులు. కాని దుర్విధిప్రభావమున నిఱుపేద లయిరి. మార్గాయాసమున వీరు మిక్కిలి డస్సి యున్నారు. ఈ సుకుమారశరీరను నీ కన్నకడుపువలె చూచు కొనుము. అరణ్యమార్గమున వచ్చుటచే నీమె వాడివత్తలై యున్నది. ఈమెవంటి పతిజీవితను నే నెచ్చటను జూచి యుండలేదు."

యోగినియాజ్ఞను మాధురి సహర్షముగ నంగీకరించెను. కణ్ణకివంటి యుత్తమురాలు తన గృహమున నుండఁదలఁచుట తన యదృష్టవిశేష మని మాధురి సంభావించెను. అప్పుడు కణ్ణకీకోవలులు యోగినికి నమస్కరించి "తపస్వినీ! వేయి జన్మము లెత్తినను మేము తమఋణమును దీర్చుకొనలేము

డుగా గౌరవించుచున్నది. మంజీరమును విక్రయించి వెంటనే నేను మరలివచ్చెదను. అంతవఱకు నీ విచ్చటనే యుండుము.'' కోవలుఁడు కణ్ణకిని సంతృప్తిపఱిచి మధురానగరాభిముఖుఁడై నడవసాగెను. అప్పు డతని కెదురుగా నొక యాఁబోతు పరుగిడుచు వచ్చెను. అది దుశ్శకున మని పాపము కోవలునకుఁ దెలియదు. అతఁడు ముందునకు నడవసాగెను. ఇంతకును విధివిలాస మెట్లున్నదో గదా!

కోవలుఁ డనేకవీధులు దాఁటి తుదకు స్వర్ణకారులు నివసించునంగడివీథిని బ్రవేశించెను. అచట నొక స్వర్ణకారుఁడు కోవలున కెదురుపడెను. అతఁడు ధరించిన పెద్ద యంగరఖాను జూడఁగ నాతఁడు సంస్థానస్వర్ణకారునివలెఁ గన్పట్టెను. ఆతనివెంట నూఱుమంది పనివాండ్రు నడచుచుండిరి. కోవలుఁ డంత నా స్వర్ణకారుని సమీపించి ''అయ్యా! మహారాణి ధరింపఁదగినమంజీరమును మీరు ధరఁ గట్టఁగలరా?'' అని ప్రశ్నించెను.

అందుల కా యగసాలి రెండుచేతులు జోడించి కోవలునకు నమస్కరించి ''ఈ భృత్యుఁడు తమయొద్ద నున్న మంజీరమునకు వెలఁ గట్టలేఁ డేమో కాని కిరీటాదిరాజోచిత భూషణములఁ జేయుటలో మాత్రము సమర్థుఁడు'' అని సగర్వముగ బలికెను.

అంతఁ గోవలుఁడు తనయొద్ద నున్నయందెను స్వర్ణకారున కొసఁగెను. అమూల్యము లగుమణులతో నత్యద్భుత

ముగ(  జెక్కఁబడినయామంజీరమును  గాంచినంతనే యాస్థానస్వర్ణకారుఁడు దిగ్భ్రమ నొందెను. అట్టి మంజీరము నంతకు మున్నెన్నడు నాతఁడు నూచియుండలేదు. దానిని జూచినకొలఁది నాతని కన్నులు కుట్టెను. కొంతసేపటి కతఁడు కోవలునితో "ఈ మంజీరమును మా మహారాణిగారు తప్ప మతెవ్వరును ధరించుటకుఁ గూడ నర్హులు కారు. ఇది చాల విలువ గలది" యని నుడివెను.

"అగును. మీరు నుడివినది వాస్తవము."

"మీకీ పట్టణమున బంధుమిత్రు లెవరైన నున్నారా?"

"లేరు."

"నే నిపుడే రాచనగరునకు వెళ్లి తమ మంజీరవిషయమును ప్రభువులుంగారికి విన్నవించెదను."

కోవలుఁడు తన యదృష్టము పండె నని భావించి "అటులనే కానిండు" అని పలికెను.

"నేను వచ్చునందాఁకఁ దమరు మా యింటికడన యుండుఁడు. దేవరవారితో సంప్రతించి మీ కే విషయమును దెలిపెదను" అని నుడివి స్వర్ణకారుఁ డా మంజీరమును కోవలున రెండడుగులు ముందునకు వైచెను.

కోవలుఁడు స్వర్ణకారుని గృహమునకు సమీపమున నున్నయాలయమునొద్దఁ గూర్చుండెను.

స్వర్ణకారుఁ డసలే మహామాయావి. అపై మలిన మనస్కుఁడును. కొన్ని దినముల క్రితము పాండ్యమహారాణి